# అపరాధ పరిశోధన

సం. 6 ఏప్రిల్ '85

సప్లిమెంట్



అపరాధ పరిశోధన అనుబంధం—136

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## టెండర్ లవ్

రచన: వసుంధర

## సుల్తాన్! సైతాన్!!

రచన: బొమ్మిడి అచ్చారావు

## భద్రకాళి

రచన: టెంపోరావ్

## పెద్దింటి పిల్ల

రచన: మిస్ కె. మధుబాల

అగ్నికిరీటం - ఎనిమిదవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—136
ఏప్రిల్, 1985
వెల: రు. 6-00
ఏడాది చందా: 72 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. వీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# టెండర్ లవ్

## వసుంధర

కళ్ళు జిగేల్ మన్నాయి నాకు.

అర్ధరాత్రి ఆకాశంలో మెరుపు కనబడ్డా అలాగనిపించదేమో! ఆ అపురూప సుందరి యెవరో కానీ ఆ షాపులో చాలామంది ఆడా, మగా ఆమెవంక చూశారు.

రక్తవర్ణపు చీర, అదే రంగు బ్లవుజు, గులాబి రంగు పళ్ళు, పద్మాల్లాంటి కళ్ళు ...

ఆమె నా పక్కకే వచ్చి—"ఇది ఇంపోర్టెడా?" అనడిగింది.

అప్పుడు నా చేతిలో ఓ గొడుగుంది. బటన్ నొక్కితే తెరుచుకుంటుంది. ఆమెను చూడ్డానికి ముందు నే నా గొడుగు శేరం చేస్తున్నాను. ఎవరైరూ పాయలు చెప్పాడు. బటన్ ఎలా పనిచేస్తుందో చూద్దామని వెనక్కు తిరిగాను. ఆమె కనిపించింది. అన్నీ మర్చిపోయాను.

ఇప్పుడామె ఆ ప్రశ్న నన్నుద్దేశించి అడిగిందో, సేల్సుమన్ని అడిగిందో తెలియదు. కానీ నే నే—"అవును—"

అని వెంటనే బదులిచ్చాను. నా గొంతుతోపాటే సేల్సు మన్ గొంతుకూడా జత కలిసింది.

"ఎంత?" అందామె.

"ఎనభై రూపాయలు—" అన్నాడు సేల్సుమన్. ఈసారి నేను మాట్లాడలేదు.

ఆమె వానిటీ బ్యాగ్ తెరచింది. సేల్సుమన్ కంగారుగా "మీరిది కొంటారా?" అన్నాడు.

ఆమె అందంగా తల ఊపింది.

అప్పుడు సేల్సుమన్ నా వంక చూసి —"సార్— ఇలాంటిదిదొక్కటే గొడుగుంది. మీరు తీసుకునేదీ లేనిదీ చెప్పండి—" అన్నాడు.

"నేను తీసుకుంటున్నాను—" అన్నాను వెంటనే. ఇందాకా అయితే అయిదు రూపాయలు తగ్గించేలా కన బడ్డాడు. ఈ అమ్మాయి బేరమాడక పోవడం వల్లనూ, నేను నిర్ణయంలో ఆలస్యం చేయడం వల్లనూ ఎనభై రూపాయలకే గొడుగు కొనాల్సి వస్తోంది. నాలో ఇప్పుడా అమ్మాయిని చూసిన థ్రిల్ తగ్గి డబ్బు గురించి ఆలోచించ గల్గుతున్నాను.

ఆ అమ్మాయి నా వంక చూసి —"మీకీ గొడుగు అర్జెంటా?" అంది.

ఆమె నన్ను పలకరించినందు కమితానందపడుతూ "ఏం?" అన్నాను.

"నాకిది అర్జంటు...." అందామె.

"మేడమ్—ఇది లేడీస్ గొడుగు కాదు—" అన్నాను.

ఆమె చటుక్కున—"నా పేరు పద్మావతి—" అంది. తనను మేడమ్ అన్నానని పేరు చెప్పిందా లేక ఆమె నాతో పరిచయాన్నభిలషిస్తోందా అన్నది అర్థం

కాలేదు. ఏమనాలో తెలియక-"నా పేరు నూతనరావు" అన్నాను.

"మిస్టర్ నూతనరావ్! రేపు మా నాన్నగారి పుట్టిన రోజు. ఆయన కిది బర్త్‌డే ప్రెజంట్ గా ఇవ్వాలని నా కోరిక. ఎండకూ, వానకూ కూడా ఆయనకు గొడుగుండాలి. చాలా కాలంగా ఆయన వాడుతున్న గొడుగు పాడై పోయింది. ఆటోమేటిక్ గొడుగైతే బాగుంటుం దని పించింది. ఇది నాకు బాగా నచ్చింది...."

నేను చటుక్కున—"ఇన్ని చెప్పడానికి బదులు మీ ఇంటికి పిలిచి టీ ఇస్తానంటే బాగుండేది—" అన్నాను.

"తప్పకుండా! ఇప్పుడే మిమ్మల్నాహ్వానిస్తున్నాను" అందామె.

నేను తెల్లబోయినా—"అయితే గొడుగు మీదే!" అన్నాను.

"థాంక్స్!" అందామె. సేల్సుమన్ వైపు తిరిగి—"ప్రెజంటేషన్ ప్యాకింగ్ చేయి—" అంది.

క్షణాలమీద ప్యాకెట్ సిద్ధం అయింది. పద్మావతి సేల్సుమన్‌కు డబ్బిచ్చేసి అక్కడే నిలబడి వున్న నాతో "రండి—" అంది.

నేను ఆశ్చర్యంగా—"నిజంగానా?" అన్నాను.

"నేనబద్ధాలాడే దానిలా కనపడుతున్నానా?" అందామె.

"అది కాదు. నే నూరికే సరదాగా అన్నాను...."

"అయితే మీ యిష్టం. నేను మాత్రం సరదాకు ఆహ్వానించలేదు."

"మీరింత అభిమానంగా పిలుస్తున్నప్పుడు తప్పకుండా వస్తాను-" అంటూ నేను పద్మావతితో నడిచాను. నా

మనసులోంచి ఆశ్చర్యం తొలగిపోలేదు. ఎందుకో వెనక్కి తిరిగిచూస్తే సేల్స్‌మన్ మా వంక ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

## 2

"చాలా ఆశ్చర్యంగా వుందే...." అన్నాడాయన.

ఆయన పేరు ముత్యాల్రావు. వయసు యాభై వుంటుంది. పద్మావతికి తండ్రి ఆయన.

తన కూతురు నన్ను టీకి పిలిచినందుకు ముత్యాల్రావు చాలా ఆశ్చర్యపడ్డాడు. పద్మావతికి మగాళ్ళంటే చిరాకు. సాధారణంగా ఎవర్నీ పలకరించదు. ఎవరైనా పలకరిస్తే మాట్లాడదు.

ఏ తండ్రైనా తన కూతురి గురించి అలాగే అనుకుంటాడు. దీన్నిబట్టి పద్మావతి తెలివైనదే నని నేను గ్రహించాను.

"అది మీమీద ప్రేమలెండి-" అన్నాను.

"అవునవును. వెర్రిపిల్ల—దానికెప్పుడూ నా గురించే ఆలోచన. నాకొక్కందామన్న గొడుగు దొరకదేమోనన్న పరిస్థితిలో నువ్వా మాత్రం త్యాగం చేసేసరికి నీమీద ఎడతెగని అభిమానం వచ్చేసుంటుంది—" అన్నాడు ముత్యాల్రావు.

నేను అనాసక్తంగా వింటున్నాను. పద్మావతి నన్ను తండ్రికి పరిచయంచేసి తను లోపలకు వెళ్ళిపోయింది. ఇంట్లో ఈయనుంటాడన్న విషయం స్ఫురిస్తే నేను టీకిక్కడిదాకా వచ్చి వుండేవాణ్ణి కాదు. ఇంకా టైము ఆరు కూడా కాలేదుగదా—ఆయనింకా యింటికి రాడనుకున్నాను.

నే నాయనతో కాలక్షేపం చేస్తూండగా ట్రేలో

మూడు కప్పుల టీ తీసుకొని వచ్చింది పద్మావతి.

ముగ్గురం టీ తీసుకున్నాం.

"ఫెంటాస్టిక్!" అన్నాను టీ రుచిచూస్తూ. అది నేను మర్యాదకన్న ముక్క కాదు. ఆ టీ పద్మావతి తయారు చేసిందన్న భావనవల్లనో ఏమో టీ నాకు అద్భుతంగా రుచిస్తోంది.

"మా ఇంట్లో రోజూ యిలా వుండదు. ఈ రోజు మీకోసం స్పెషల్ గా చేశాను-" అంది పద్మావతి నవ్వుతూ. ఆమె నవ్వుతూంటే పళ్ళు ముత్యాల్లా మెరిశాయి.

ముత్యాలరావు ఆశ్చర్యంగా—"ఈ అబ్బాయిలో ఏదో విశేషముంది! నిన్నింత సంతోషంగా యెప్పుడూ చూడలేదు!" అన్నాడు.

పద్మావతి వెంటనే—"ఇంటికి పిలిచి టీ యిమ్మని ఈయనడిగిన తీరు అద్భుతం! కొంతమంది కేవలం పలకరించడం కోసం అడుగుతారు. ఆ పలకరింపులోనే వుంటుంది ఎక్కడలేని కల్మషం!" అంది.

ఈ విషయం నాకు తెలుసు. నాది అందమైన ముఖం. అటుపైన నాకు నటించడం బాగా చేతనౌను. నేనెలా నవ్వినా అమాయకంగా వుంటుందని చాలామంది ఆడపిల్లలే ఒప్పుకున్నారు. కాలేజీ రోజుల్లో నేనో పెద్ద హీరోని. ఒకరికి తెలియకుండా ఒకరిని మొత్తం ముగ్గురమ్మాయిలను నా వెంట తిప్పుకున్నాను. ఆ ముగ్గురిలో నా సుగుణ నన్ను మనసారా ప్రేమించింది. నా ప్రేమ నిజమేనని నమ్మింది. నే నామెకు వంటిసారు చెప్పాను. నామీద ప్రేమతో ఆమె అదికూడా నమ్మింది. నామీద జాలిపడింది.

"నువ్వు లేకుండా నేనూ బ్రతకలేను. ఆత్మహత్య చేసుకుంటాను—" అన్నాను.

సుగుణ నన్ను వారిస్తుందని ఆశపడ్డాను. ఆమె అలా చేయకుండా—"మనిద్దరం కలిసి చచ్చిపోదాం. నువ్వు లేకుండా నేనూ బ్రతకలేనని పిస్తోంది-" అంది.

నేను భయపడ్డాను. కానీ అది ప్రకటించకుండా—"నువ్వు చచ్చిపోవడానికి వీల్లేదు. నేను తిరుగుతున్న ఈ భూమ్మీదే ఎక్కడో నువ్వూ ఊపిరి పీలుస్తున్నావు కదా అని సరిపెట్టుకుంటాను. నా గురించి నువ్వు చచ్చిపోవడం భరించలేను—" అన్నాను.

అప్పుడు నేనదోలా నవ్వితే—"ఎంత అమాయకంగా నవ్వుతావు నువ్వు? ఈ నవ్వు రోజూ చూసే అదృష్టం నాకు లేదుగదా!" అని వాపోయింది సుగుణ.

అప్పుడు నేను పూర్తిగా సుగుణను మోసగించాను. ఆమెమీద నాకు ప్రేమలేదు. అభిమానంలేదు. ఆమెను కోల్పోతున్నానన్న బాధలేదు. ఆమెతో నా అవసరం తీరింది. ఆమెను మరిచిపోడానికి సిద్ధంగా వున్నాను. కానీ అలాంటి పరిస్థితుల్లోకూడా సుగుణక్కూడా అనుమానం రానంత అమాయకత్వాన్ని నేను ముఖంలో ప్రదర్శించగలిగానంటే నా నటన తిరుగులేనిదన్న నమ్మకం కలిగింది.

ఆడపిల్లల్ని మోసం చేయడానికి నా నటనా శక్తి బాగా సహకరిస్తోంది. ఇప్పుడు పద్మావతి కూడా నా నవ్వు, పలకరింపు చూసి సమ్మోహితురాలయిందంటే అది నా అదృష్టం. ఎందుకంటే ఇంతవరకూ నా జీవితంలోకి వచ్చిన ఆడపిల్లలందరిలోకీ పద్మావతి అందమైనది.

కాసేపు ముత్యాలరావు, నేను, పద్మావతి—కబుర్లు

చెప్పుకున్నాం. ముందు దేశం గురించి మాట్లాడుకున్నప్పటికీ తర్వాత ప్రైవేటు విషయాలూ వచ్చాయి. ముత్యాల్రావు నా ఉద్యోగం గురించి వాకబు చేశాడు. ఆయనింకా ఏదో అడగబోతూండగా పద్మావతి టీ కప్పులు తీసుకొని లోపలకు వెళ్ళింది.

"నువ్వు మా అమ్మాయికేదైనా మంచి సంబంధం చూసి పెట్టు. నీ మాటంటే దానికి గురికుదిరినట్లు కనబడుతోంది. ఇంతకాలం పెళ్ళన్న పేరు వింటేనే మండిపడేది. అందుక్కారణం మగాళ్ళంటే దానికి చిరాకు-" అన్నాడాయన.

"ఎలాంటి కుర్రాడు కావాలో చెప్పండి-" అన్నాను.

"నీకు లాంటి కుర్రాడనుకో—" అన్నాడాయన చటుక్కున. "ఎటొచ్చీ నాకు కులం విషయంలో పట్టింపెక్కువ."

ఆయన తన కులం చెప్పాడు. నేను వెంటనే— "అయితే మా బంధువుల్లోనే చూడొచ్చు—" అన్నాను. నిజానికి ఆయన కులం నా కులం ఒకటి కాదు. నేను పద్మావతిని పెళ్ళిచేసుకోబోవడంలేదు కాబట్టి ఈ అబద్ధం ప్రమాదకరమైనది కాదు.

ముత్యాల్రావు ముఖం వెలిగింది—"అయితే నీ బంధువులదాకా ఎందుకు? నువ్వు పిల్లను చూడనే చూశావు. నీకు నచ్చిందంటే నేను మీ వాళ్ళతో మాట్లాడ్డానికొస్తాను—" అన్నాడుత్సాహంగా.

"ఆర్నెల్ల క్రితం మా నాన్నగారి ముఖ్య బంధువొకాయన పోయాడు. యింకో ఆర్నెల్లదాకా మా యింట్లో శుభకార్యాల ప్రసక్తి వుండదు. మీరు కలుసుకోవాలంటే ఆ తర్వాతే కలుసుకోవాలి-" అన్నాను.

ఇది తిరుగులేని అబద్ధం. ఈ విధంగా నేను ఆర్నెల్లదాకా వెళ్ళి ప్రసక్తి లేకుండా పద్మావతితో తిరగొచ్చు. అప్పటి కామెపై నామోజు తీరిపోతుంది కాబట్టి ఆతర్వాత సంగతేమిటని ఆలోచించక్కర్లేదు.

"అంటే నీ కభ్యంతరం లేద నేగా—" అన్నాడు ముత్యాల్రావుత్సాహంగా.

ఆడపిల్లల తండ్రుల స్థితికి నేను జాలిపడ్డాను. అయితే ఆ జాలితో నేను వచ్చిన అవకాశాన్ని వదులుకోలేను.

ఆ తర్వాత వరుసగా మూడు రోజులు నేను పద్మావతిని వాళ్ళింట్లోనే కలుసుకున్నాను.

## 3

నాలుగో రోజు పద్మావతి యిల్లు చూపించే నెపంతో నన్ను లోపలకు పిలిచి—"నాకిలా నచ్చలేదు. మా నాన్నగారిది పాత తరం. ఆయనముందు మనం ఫ్రీగా మాట్లాడుకోలేం—" అంది.

"నాకూ అలాగే అనిపిస్తోంది కానీ చెప్పడానికి మొహమాటపడ్డాను...." అన్నాను. మనసులో నాకు చాలా సంతోషంగా వుంది. పద్మావతి నా దారికే వస్తోంది మరి!

"రేపు మనం పార్కులో కలుసుకుందాం—" అంది పద్మావతి. ఏ పార్కులో కలుసుకోవలసిందీ కూడా ఆమె నాకు చెప్పింది.

మర్నాడు ఆఫీసు నుంచి తిన్నగా పార్కుకి వెళ్ళి పోయాను. అక్కడో అరగంట యెదురు చూశాను. అప్పుడు నా దగ్గరకో అమ్మాయొచ్చింది. ఇద్దరం ఒకే బెంచి మీద పక్కపక్కన కూర్చున్నాం—కాస్త ఎడం ఎడంగా.

కాసేపట్లో పద్మావతి వచ్చేస్తుంది. అప్పుడామె నమ్మల్నిద్దర్నీ పక్క పక్కన చూడ్డం నాకు మంచిది కాదు. మగాడు తన్ను మోసం చేసినా సహిస్తుంది కానీ మరో ఆడదాని సాహచర్యాన్నాశిస్తే భరించలేదాడది. అందుకని మా పరిచయం కొనసాగుతున్నంత కాలం ఇలాంటి పొరపాట్లు జరక్కూడదు. కానీ నా పక్కనున్న అమ్మాయి యెప్పటికీ లేవడంలేదు. కాసేపాగి నేనే ఆమెను పలకరించాను.

ఆమె ఇబ్బందిగా కాక చక్కగా నవ్వింది. ఆ నవ్వుకు ముగ్ధుణ్ణయ్యాను. ఆమె తన పేరు గిరిజ అని చెప్పింది.

"ఎవరికోసమో యెదురు చూస్తున్నట్లున్నారు!" అన్నాను.

"అవును—నా స్నేహితురాలు నన్నిక్కడ కలుసుకుంటానని చెప్పింది. తనీపాటికి రావలసిందే" అందామె.

"చిత్రంగా వుందే — నేనూ నా స్నేహితురాలి నిక్కడే ఇదే సమయంలో కలుసుకోవాల్సి వుంది. మీ స్నేహితురాలి పేరు?" అన్నాను.

"పద్మావతి...." అందామె.

"నా స్నేహితురాలి పేరూ అదే!" అన్నాను.

ఇద్దరం ఒకే వ్యక్తికోసం ఎదురు చూస్తున్నామని అర్థమైంది నాకు. అందుచేత కబుర్లలో పడ్డానికి కష్టం లేకపోయింది. అలా గంటసేపు సరదాగా కబుర్లు చెప్పుకున్నాం. అప్పుడు గిరిజ టైము చూసుకొని—"అరే— చాలా టైమయిందే — ఇంక నేను ఇల్లు చేరుకోవాలి. లేకుంటే అన్నయ్య పెద్ద గొడవచేస్తాడు...." అంది.

"ఇంతసేపిక్కడ బోరుకొట్టకుండా కంపెనీ ఇచ్చారు. థాంక్స్!" అన్నాను.

"థాంక్స్ నేనే మీకు చెప్పుకోవాలి. మీరు చాలా సరదాగా మాట్లాడతారు. మా యింటికి రాకూడదూ— ఇంట్లో వాళ్ళకి పరిచయం చేస్తాను!" అంది గిరిజ.

"ఇప్పుడు కాదు. మరెప్పుడైనా!" అన్నాను. అందుకు రెండు కారణాలున్నాయి. పద్మావతితో స్నేహం కొనసాగుతూండగా మరో ఆడపిల్లతో స్నేహం ప్రారంభిస్తే రెంటికీ చెడ్డ రేవడను కావచ్చు. అందులోనూ వాళ్ళిద్దరూ స్నేహితురాండ్రు. అటుపైన అన్నయ్యలున్న ఆడపిల్లల జోలికి వెళ్ళడం నాబోటి వాళ్ళకు ప్రమాదం. ఎందుకంటే ఆ అన్నయ్యలూ నా జాతేకదా—యిట్టే పసిగట్టేస్తారు.

గిరిజ తను లేచి నిలబడి—"మీరింకా పద్మావతికోసం యెదురుచూస్తారా?" అంది.

"లేదు. అసలు తనెందుకు రాలేదో ఇంటికి వెళ్ళి కనుక్కుంటాను—" అన్నాను.

"అయితే నాకో సాయం చేస్తారా?" అంది గిరిజ.

"యట్ యువర్ సర్వీస్ ప్లీజ్!" అన్నాను.

గిరిజ కళ్ళు మెరిశాయి. ఆమె తన వానిటీ బ్యాగు తెరిచి ఓ చిన్న ప్యాకెట్ తీసి నాకిచ్చింది—"ఇది మీరు అర్జంటుగా పద్మావతింట్లో అందజేయాలి—"

"ష్యూర్—" అన్నాను. గిరిజ వెళ్ళిపోయింది. నేను పద్మావతింటికి వెళ్ళాను. ఇంట్లో ముత్యాలరావొక్కడే వున్నాడు.

నన్ను చూసి ఆప్యాయంగా పలకరిస్తూ—"అనుకోకుండా ఈ రోజు పద్మ ఊరుకెళ్ళాల్సొచ్చింది...." అన్నాడు.

పార్కు విషయం నే నాయనకు చెప్పలేదు. ఆయన

నన్నడగలేదు. పద్మావతి ఊళ్లో లేదనగానే నాకు నీరసం పుట్టుకొచ్చింది. ఏ పరిస్థితుల్లో ఆమె ఊరుకెళ్ళాల్సొచ్చిందో నాకు చెబుతున్నాడాయన. నాకు బుర్ర కెక్కడంలేదు.

"మళ్ళీ ఎప్పుడొస్తుందండి?" అన్నాను.

"అబ్బే—రేపు సాయంత్రానికల్లా వచ్చేస్తుంది...."

మళ్ళీ నాలో ఉత్సాహం పుట్టింది. వెంటనే ఆయనకు గిరిజ ఇచ్చిన ప్యాకెట్ ఇచ్చాను. గిరిజ నాకెలా తెలుసూ లాంటి వృధా ప్రశ్నలు వేసి ఆయన నన్ను విసిగించలేదు. ప్యాకెట్టందుకొని—"దానికి నేనిచ్చేస్తాలే!" అన్నాడు.

నేను సెలవు తీసుకున్నాను.

# 4

మర్నాడు సాయంత్రం నేను వెళ్ళేసరికూడా ముత్యాలరావొక్కడే ఇంట్లో వున్నాడు. నన్ను చూస్తూనే "అమ్మాయింకా రాలేదు...." అన్నాడు.

అప్పుడు నాకు ముత్యాలరావుమీద కోపం వచ్చింది. ఆయన్ను చూస్తూంటే వళ్ళు మండిపోయింది. అందులో ఆయన తప్పేమీ లేదని తెలిసినా ఇలాంటి విషయాల్లో ఆవేశాన్ని నిగ్రహించుకోవడం కష్టం. అతికష్టం మీద నిగ్రహించుకున్నాను.

వెంటనే వెళ్ళిపోవాలనుకున్నాను. కానీ ముత్యాలరావు బలవంత పెట్టాడు. ఆయన బలవంత పెట్టినకొద్దీ నాలో అసహనం పెచ్చుమీరి పోసాగింది. అయితే వివేకం నన్ను హెచ్చరించింది.

పద్మావతిని వల్లో వేసుకోవాలంటే ముత్యాలరావునీ బుట్టలో వేసుకోవాలి. తన కూతురికోసమే నేను వస్తున్నానని ఆయనకూ తెలుసు. అయితే ఆయనంటే

బొత్తిగా ఆసక్తి లేదన్న విషయం బయటపడకూడదు.

ముత్యాలరావు చదరంగం బల్ల తీశాడు. ఆడమని నన్ను బలవంత పెట్టాడు. దురదృష్టమేమిటంటే నాకు చదరంగమాడ్డం వచ్చు.

మొదలెట్టినపుడు చిరాకనిపించినా ఓ పావుగంటలో ఇద్దరం ఆటలో మునిగిపోయాం. తర్వాత టైము తెలియ లేదు. పద్మావతి వచ్చి మా ఆటకు భంగం కలిగించింది. ఆటలో ఎంతలా మునిగిపోయామంటే పద్మావతి వచ్చి ఆట డిస్టర్బ్ చేసినందుకు చిరాక్కూడా కలిగింది. అయితే అది తాత్కాలికమే!

పద్మావతికి నన్ను చూడగానే ముఖం వెలిగింది. తండ్రి వున్నాడనికూడా సందేహించకుండా—"నిన్న మిమ్మల్ని పార్కుకు రమ్మనమని చెప్పాను. నేను రాలేక పోయాను...." అంటూ సారీ చెప్పింది.

"అది సరేలే— వెళ్ళిన పనయిందా? నేను చెప్పినవన్నీ తెచ్చావా?" అన్నాడు ముత్యాలరావు ఆత్రుతగా.

"ముందు నీ సందేహం తీర్చేకనే ఈయనతో మాట్లాడతాను...." అంటూ ఆమె తన చేతిలోని సూట్ కేసును పక్కనే వున్న బల్లమీద పెట్టి తాళం చెవితో తెరవబోయింది. నేను పద్మావతి వంకే చూస్తున్నాను.

ప్రయాణం చేసి వచ్చిన అలసట ఆమె ముఖంలో కనబడుతోంది. ఆ అలసటకూడా ఆమెకు కొత్త అందాన్నిచ్చింది.

అందానికి అన్నీ అలంకారమే-అనుకున్నాను.

ఉన్నట్లుండి పద్మావతి "సూట్ కేసు తాళం రావడం లేదు నాన్నా!" అంది.

"ఎందుకు రాదూ?" అంటూ ముత్యాలరావు లేచాడు.

ఆయనకూ వచ్చినట్లు లేదు. నేనూ ప్రయత్నించి "అసలీ తాళం ఈ సూట్ కేసుదేనా?" అన్నాను.

అప్పుడు పద్మావతి "వ్యవహారం చూస్తే అలాగే వుంది. తాళం మాదే—సూట్ కేసే మాది కాదనుకో వాలి" అంటూ ఓసారి సూట్ కేసువంక చూసి "అరే - దీనిమీద పేరు వేరేగా వుందే!" అంది.

ఎస్ పి అని వుండాల్సిన అక్షరాలకు బదులు జి ఎస్ అని వున్నాయి. పరీక్షించి చూడగా సూట్ కేసు పక్కన వున్న చిన్న కాళీలో ఓ కార్డుంది. అందులో జి. సుకు మార్ అనే అతడి అడ్రసుంది.

"సూట్ కేసులు మారిపోయాయి నాన్నా!" అంటూ పక్కనే కుర్చీలో కూలబడిపోయింది పద్మావతి.

"అదెలా జరిగిందే?" అన్నాడు ముత్యాలరావు.

"ఈ రోజుల్లో అందరివీ ఒకేలాంటి సూట్ కేసులు. మార్పు పొరపాటున జరుగుతుంటుంది తప్పితే కావాలని యెవరూ చేసివుండరు" అంది పద్మావతి నిరసంగా.

"మన సూట్ కేసు ఇప్పుడే ఊరు వెళ్ళిపోయిందో?" అన్నాడు ముత్యాలరావు భయంగా.

అప్పుడు నా బుర్ర చురుగ్గా పని చేసింది. ఆ అడ్రసున్న సుకుమార్ దీ ఊరే! అంటే ట్రయిన్ లోనో బస్సులోనో దిగేటప్పుడు సూట్ కేసులు మారి వుంటాయి. అదే చెప్పాను.

"అంటే సూట్ కేసీ ఊళ్ళోనే వుంటుందంటావు...." అన్నాడు ముత్యాలరావు తెచ్చిపెట్టుకున్న ఉత్సాహంతో.

"ఈ ఊళ్ళో కాదు. పక్కింట్లోనే వున్నా సరే— నేనిప్పుడెక్కడికి కదల్లేను" అంది పద్మావతి.

"అలాగంటే ఎలాగే?" అన్నాడు ముత్యాల్రావు.

"ఇంటికి రాగానే ఈయన కనపడ్డారు. సరదాగా కబుర్లు చెప్పుకోవచ్చుగదా అని ఆశపడ్డాను. ఇప్పుడీ సూట్ కేసు మార్పిడి తెలియగానే ఒంట్లో ఓపికంతా పోయింది" అంది పద్మావతి నిట్టూర్చుతూ.

పద్మావతిని చూస్తే నాకు జాలేసింది. అందమైన ఆడపిల్ల ఇబ్బంది పడుతూంటే ఏ మగాడూ చూస్తూ ఊరుకోలేడుకదా!

"మీ కభ్యంతరం లేకపోతే నేను సాయపడతాను" అన్నాను.

"అయ్యో! మిమ్మల్ని శ్రమపెట్టడమా?" అంది పద్మావతి.

"అబ్బే—నీకెందుకు బాబూ—శ్రమ!" అన్నాడు ముత్యాల్రావు.

"ఇందులో నాకు శ్రమేం లేదండి...." అన్నాను.

వాళ్ళో పట్టాన అంగీకరించలేదు. ఒప్పించాను.

## 5

నేను వెళ్ళేసరికి సుకుమార్ ఇంట్లో చాలా హడావుడిగా వుంది. మార్పిడి జరిగిన సూట్ కేసు గురించి ఇంటిల్లపాదీ కలవరపడిపోతున్నారు. విశేషమేమిటంటే పద్మావతి సూట్ కేసుకు తాళం వేసినట్లు లేదు. వాళ్ళది తెరిచి అందులోని ఆడవాళ్ళ బట్టలూ అవీ చూసి సుకుమార్ వెళ్ళిన పని మరిచి ఏదో వ్యవహారం నడుపుకొచ్చాడని అనుమానిస్తున్నారు.

ఇంట్లో ఎవరూ అందమైన ఆడపిల్లలు లేరు. అసలు వయసులో వున్నవాళ్ళే లేరు. ఇద్దరాడవాళ్ళున్నారు. ఒకామె అతడి తల్లై వుండవచ్చు. రెండో ఆమె బామ్మ

అయియుంటుంది.

నేను సూట్ కేసుతో వెళ్ళి జరిగింది చెప్పాను వాళ్ళ ముఖాలింతంతయ్యాయి. సుకుమార్ తన సూట్ కేసును లోపలకు తీసుకెళ్ళి కాసేపట్లో తిరిగి వచ్చి—చాలా థాంక్సండీ.... పెట్టె యథాతథంగా చేరింది నాకు...." అన్నాడు,

నేను పద్మావతి సూట్ కేసు తీసుకుని తిరిగి ముత్యాల్రావింటికి వెళ్ళాను. తమ సూట్ కేసు తిరిగి వచ్చినందుకు తండ్రీ కూతుళ్ళు మహదానందం పొందారు.

పద్మావతి తనుకూడా సూట్ కేసును లోపలకు తీసుకెళ్ళింది. ముత్యాల్రావామె ననుసరిస్తూ—"ఒక్క క్షణం నాయనా!" అన్నాడు.

నేను మౌనంగా నవ్వి కూర్చున్నాను.

వాళ్ళిలా లోపలకు వెళ్ళగానే అలా ఓ నడి వయస్కుడు వచ్చాడు. నన్నక్కడ చూసి కంగారుగా "పద్మావతి యింట్లో లేదా?" అన్నాడు.

"ఉందండి—మీ రెవరు?" అన్నాను.

"నువ్వెవరో తెలుసుకోవచ్చా?" అన్నాడాయన.

ఆయన చనువు కాశ్చర్యపడుతూ "నేనామె స్నేహితుణ్ణి" అన్నాను.

"ఎన్నాళ్ళయింది మీ స్నేహం ప్రారంభమై?" అన్నాడాయన చురుగ్గా నా కళ్ళలోకి చూస్తూ.

"ఓ వారంరోజు లవుతుంది" అన్నాను.

"చూశావా—ఈ విషయం పద్మావతి నా దగ్గర దాచి పెట్టింది...." అని "ప్రస్తుతం కొంతకాలంగా పద్మావతి ఆరోగ్యం బాగుండడం లేదు. ఆమె ఎటువంటి ఆవేశానికీ

గురికాకూడదు. పదిరోజుల్నించి నేనామెను స్వయంగా వచ్చి అయిదారు గంటల కొకసారి పరీక్షించి వెడుతున్నాను" అని "అన్నట్లు నేనెవరో నీకు చెప్పలేదు కదూ—వీళ్ళకు ఫామిలీ డాక్టర్ని. పేరు శ్రీనివాస మూర్తి...." అంటూ చేయి చాపాడు.

ఇద్దరం కరచాలనం చేసుకున్నాం.

ఆయన మళ్ళీ చెప్పసాగాడు. "నిన్న రాత్రి పది గంటలకైతే ఆమె పరిస్థితి బొత్తిగా బాగోలేదు. సాయంత్రం నాలుగింటినుంచి పదిలోగా అంత మార్పెలా వచ్చిందో నా కర్థం కాలేదు. ఈరోజుదయం ఎనిమిదికి, మధ్యాహ్నం రెండింటికీ కూడా ఆమెను పరీక్షించి మందిచ్చి వెళ్ళాను. అవతల నాకు బోలెడు ప్రాక్టీసు. మా యిల్లు చాలాదూరం. పద్మావతి అంతంత దూరం ప్రతిరోజూ ప్రయాణం చేయడం మంచిది కాదని నేనే బయలేరి వీళ్ళింటికి వస్తున్నాను....ఇప్పుడు నిన్ను చూడగానే నా కర్థమైంది. నువ్వు చాలా బాగున్నావు. నీతో పరిచయం ఆమెను ఎమోషనల్‌గా డిస్టర్బ్ చేస్తోంది. అదామె ఆరోగ్యానికి మంచిది కాదు. ఇప్పటి ఆమె అనారోగ్యానికి నువ్వే కారణం...."

నేను తెల్లబోయి ఆయన మాటలు వింటున్నాను. పద్మావతిని నిన్నరాత్రీ, ఈవేళా పరీక్షించానంటాడేమిటి? ఆమె ఊళ్ళో లేదుగదా....

నే నాలోచిస్తుండగానే పద్మావతి, ముత్యాలరావు తిరిగి వచ్చారు. ఏదో చెప్పబోయిన పద్మావతి డాక్టర్ శ్రీనివాసమూర్తిని చూసి తడబడి "నమస్తే డాక్టర్!" అంది.

ముత్యాలరావు కూడా తడబడుతూ "ఈ వేళప్పుడొచ్చా

లేమిటి డాక్టర్!" అన్నాడు.

శ్రీనివాసమూర్తి వెంటనే "మధ్యాహ్నం నేనిచ్చిన రెడ్ కాప్సూల్స్ చాలా పవర్ ఫుల్. వాటి రియాక్షనెలాగుందో తెలుసుకోవాలనిపించింది. ఉండబట్టలేక వచ్చేశాను. సరిగ్గా మూడింటికి వేసుకోమని చెప్పాను. వేసుకున్నావా?" అన్నాడు.

అప్పుడు చూడాలి పద్మావతి ముఖం. అందమైన ఆమె ముఖం వివర్ణమైంది. ఆమె క్షణకాలం నన్ను చూసి ముఖం తిప్పేసుకుంది. తర్వాత డాక్టరుతో "వేసుకున్నాను డాక్టర్! ఏమీ కాలేదు...." అంది.

ఆ తర్వాత శ్రీనివాసమూర్తీ, పద్మావతీ పక్కగదిలోకి వెళ్ళారు. తలుపులు మూసుకున్నారు. పదినిముషాల్లో యిద్దరూ తిరిగొచ్చారు. ఈ పదినిమిషాల్లోనూ నేను, ముత్యాల్రావు—ఒక్క మాటకూడా మాట్లాడుకోలేదు. నాలో చాలా ప్రశ్నలుదయించాయి. అవన్నీ పద్మావతి వచ్చేక అడగాలనుకుంటున్నాను. నే నడగబోయే ప్రశ్నలెలా వుంటాయో, వాటికేం సమాధానాలు చెప్పాలా అని ముత్యాల్రావాలోచిస్తున్నాడు కాబోలు!

తిరిగొచ్చేక శ్రీనివాసమూర్తి "నేను మరీ మరీ చెబుతున్నాను. నువ్వింటిపట్టునే వుండాలి. ఇంక సెలవు...." అని వెళ్ళిపోయాడు.

"డాక్టరుగారికి అమ్మాయంటే కన్నకూతురి కంటే అభిమానం...." అన్నాడు ముత్యాల్రావు నిట్టూర్చుతూ.

నేను చటుక్కున "ఆ అభిమానమే మీ అబద్ధాలను బయటపెట్టింది. ఆయన మీ అమ్మాయినీ యింట్లో నిన్న రాత్రి ఒకసారి, ఈ రోజుదయం, మధ్యాహ్నం పరీక్ష చేసి వెళ్ళానంటున్నాడు" అన్నాను.

"ఆయన నాకు తండ్రిలాంటివాడు. నన్నాయన పరీక్షించడంలో తప్పేముంది?" అంది పద్మావతి.

ఆమె విషయాన్ని తప్పుదారి పట్టిస్తోందని నాకర్థమైంది "తప్పేమీ లేదు. కానీ మీ ఇద్దరూ చెప్పిన ప్రకారం ఆ సమయంలో మీ రూల్లో ఎవ్వరూ లేరు...." అన్నాను.

పద్మావతి నిట్టూర్చి "మీరు సూట్ కేసు వెనక్కు తెచ్చియిచ్చి నాకు చాలా గొప్ప ఉపకారం చేశారు. మీ దగ్గర దాచకుండా నిజం చెప్పేయాలనిపిస్తోంది" అంది.

"ఏమిటా నిజం!" అన్నాను.

పద్మావతి ఏదో చెప్పబోగా ముత్యాలరావు వారిస్తూ "చూడమ్మా! మనకిది జీవన్మరణ సమస్య. ఇలాంటి విషయాల్లో తొందరపాటు పనికిరాదు. ఒకరోజంతా నిమ్మతంగా ఆలోచించుకుని అప్పుడేం చేయాలంటే అది చేయొచ్చు" అన్నాడు.

"ఇప్పటికే ఆయనకు చాలా కోపం వచ్చింది నాన్నా!" అంది పద్మావతి.

ముత్యాలరావు వెంటనే నావైపు తిరిగి "చూడు బాబూ! నువ్వు మా అమ్మాయి క్షేమం కోరే మంచి స్నేహితుడివని నమ్ముతున్నాను. దాని క్షేమం కోరి ప్రస్తుతానికి నిజమేమిటని వొత్తిడించవద్దు. సమయం వచ్చినపుడు—అన్నీ నేనే చెబుతాను. నువ్వుపొరపాటు చేసుకుంటావని భయపడి అది నిజం చెప్పేస్తానంటోంది. నిజం చెప్పడంవల్ల దాని ప్రాణాలే పోవచ్చు. అలా జరగడం నీ కిష్టముంటుందా?" అన్నాడు.

"అయితే నేను సెలవు తీసుకుంటాను...."అంటూ లేచాను. వెళ్ళేటప్పుడు పద్మావతి ఇంట్లోంచి బయటకు

వచ్చే సందు చివరదాకా నన్ననుసరించింది.

"నూతన్! నన్ననుమానించకు. రేపు నీకు నేను అన్నీ చెప్పేస్తాను. తప్పకుండా పార్కుకి రా.... ముందు మన మనుకున్న చోటుకే...." అంది పద్మావతి.

"ఆలోచించాలి!" అన్నాను.

"నువ్వలాగంటే ఈ రాత్రంతా నాకు నిద్రపట్టదు. ప్లీజ్....నన్ననుమానించడం లేదని ఒక్కమాట చెప్పు" అంది పద్మావతి.

"రేపు తప్పకుండా వస్తావా?" అన్నాను.

ఉన్నట్టుండి మా యిద్దరిమధ్యా అంతలా దూరం తగ్గి పోవడం నాకాశ్చర్యం కలిగించింది. ఆమె నన్ను నూతన్ అని పిలుస్తూంటే ఎంతో తీయగా, పరవశంగా వుంది. ఒక్కసారి మా యిద్దరిమధ్యా అంతటి చనువును కల్పించిన ఈనాటి అబద్ధాలకూడా నేను కృతజ్ఞుణ్ణి.

"తప్పకుండా వస్తాను. ఒకవేళ రాకపోతే మనమింక మళ్ళీ జీవితంలో కలుసుకోవద్దు. సరిగ్గా ఆరుకూ ఏడుకూ మధ్య వస్తాను. మధ్యలో విసిగి వెళ్ళిపోకు నువ్వు" అంది పద్మావతి.

"సరే!" అన్నాను.

# 6

ఆ రోజంతా నా మనసు మనసులో లేదు. పద్మావతిని వల్లో వేసుకుందామని ప్రయత్నించాను. వాటం చూస్తే నేనే ఆమె వల్లో పడ్డానా అనిపిస్తోంది.

మా పరిచయం కాకతాళీయంగా జరిగిందా, కావాలని ఆమే నన్నిందులోకి లాగిందా అన్నది ఎంత ఆలోచించినా నాకు అంతుబట్టడం లేదు. టీ పేరు చెప్పి నన్నామె తనింటికి పిలిచిన మాట నిజం! అయితే నా అంతట నేనే

ఆమెను టీ గురించి అడిగాను.

అదలాగుంచితే ఆమె తన ప్రయాణం గురించి అబద్ధమెందుకు చెప్పింది? ముత్యాల్రావా మె ఊళ్ళో లేదని తనకెందుకు చెప్పాడు? ఊరికి వెళ్ళకపోతే సూట్ కేసుల మార్పిడీ ఎలా జరిగింది? అసలు సూట్ కేసుల మార్పిడీ జరిగిందా?

అంతవరకూ ఆలోచించాక నా ఆలోచనలింక ముందుకు వెళ్ళలేదు. పద్మావతి నాతో అబద్ధాలు చెప్పి ఉంటే అవెందుకో అర్థంకావడం లేదు. అయితే అబద్ధాలు చెప్పిందని నాకామెపై కోపంలేదు. ఆ అబద్ధాల కారణంగా నాకామె లొంగిపోతే అంతకంటె నాక్కావలసిందేముంటుంది? ఎలాగో అలా ఆమెతో కొన్నాళ్ళు గడిపి ఆ తర్వాత వదిలిపెట్టేయడమే నా అభిమతం తప్పితే ఆమె పూర్తి చరిత్రతో నాకు నిమిత్తం లేదు.

ఏది ఏమైనా మర్నాడు సాయంత్రం ఆరింటికల్లా ఠంచనుగా పార్కుకి వెళ్ళి కూర్చున్నాను. ఆమె చెప్పేది వినాలన్న ఆత్రుతతోపాటు, ఆమె సమక్షమాధురి ననుభవించాలన్న కోరికకూడా వుంది.

అక్కడ బెంచీమీద నేను ఒంటరిగా కూర్చున్నాను. సెకన్లు, నిముషాలు గడిచిపోతున్నాయి. టైము నాకు భారంగా గడుస్తోంది.

పద్మావతి రావడంలేదు.

టైము ఆరుంపావయింది. ఆరున్నరయింది. ఆరూనలభై అయిదయింది. అంతవరకూ టైము భారంగా గడిచింది.

టైము ఏడైతే ఇంక పద్మావతి రానంది.

అప్పట్నించి గడియారం పరుగు తీయడం ప్రారంభిం

చేంది. కాలముక్కడ సంభించి పోవాలన్నది నా కోరిక. టైము ఏడు దాటిందంటే పద్మావతి రాదు. ఆ తర్వాత మేము మళ్ళీ జీవితంలో కలుసుకోము.

నేను దిగులుగా వాచీవంక చూసుకుంటూ దాన్నాపడానికి ప్రయత్నిస్తున్నాను. అది ఆగడం లేదు.

చూస్తూండగా టైము ఏడై పోయింది. నాకేమో ఏడుపొచ్చేసింద. ఇంక అక్కడుండడం వ్యర్థమనుకుంటూ లేచాను.

అప్పుడు నా ఎదురుగా పద్మావతి!

తెల్లబోయాను.

"సరిగ్గా ఒక్క సెకన్ ముందు వచ్చాను. నువ్వు వాచీ చూసుకుంటూ నన్ను చూడలేదు...." అంది పద్మావతి.

"నువ్వు నిజంగా వచ్చావా? ఇంక రావనుకున్నాను."

"ఈ రోజు రావడాని కిబ్బందే అయింది. మామూలుగా అయితే రాకపోదును. కానీ ఈ రోజు కలుసుకోకపోతే ఇక జీవితాంతం కలుసుకోమన్నానుగా. అందుకని వచ్చేశాను...." అంది పద్మావతి.

ఆమె బెంచీమీద కాస్త దూరంగా నా పక్కనే కూర్చుంది. నేనూ కూర్చున్నాను. నా మనసులో ఇప్పుడెంతో సంతోషంగా వుంది. పద్మావతి వచ్చేసింది. ఇంక ఈ జీవితానికే ఆమెను కలుసుకోవడం కుదరదేమోనని భయంవేసింది. ఆ భయమిప్పు డబద్ధమైంది.

"ఆలస్యమయిందేం?" అన్నాను.

"అన్న టైముకే వచ్చానుగా!" అంది పద్మావతి.

"అవును—ఏడుకి సరిగ్గా ఒక్క సెకను ముందు—" అన్నానుక్రోషంగా.

"రావడం ఆరూనలభై కే వచ్చాను కానీ నీ ఓపిక పరీక్షించాలనిపించింది. నిజంగా నీ ఓపిక మెచ్చుకో తగ్గది...."

"నా ఓపిక అంత గొప్పది కాదు. ఆ ఎదురుచూడ్డం నీకోసం కాబట్టి....యింత సేపున్నాను."

పద్మావతి ముఖం గంభీరంగా అయిపోయింది—"నీ సహనానికి కారణం నీకు నా మీదున్న ప్రేమ. ఆ ప్రేమకిక పరీక్ష పెట్టను. నా గురించిన అసలు నిజం చెప్పేస్తాను. అయితే ఆ నిజం నువ్వు భరించగలవా అని భయపడుతున్నాను...."

నేను కుతూహలంగా ఆమె వంక చూస్తూ-"నీ అందం గొప్పది. అది నన్నాకర్షిస్తోంది. ఆ ఆకర్షణలో ఎలాంటి నిజమూ నన్ను భయపెట్టలేదు—" అన్నాను.

"అయితే నువ్వు నన్ను పెళ్ళి చేసుకుంటావా?" అంది పద్మావతి.

ఆమె అంత సూటిగా అలా అడిగేస్తుందని నేననుకో లేదు. అయితే తెలివైన మగాడిక్కడే తటపటాయించ కూడదు. కేవలం మోసం చేయడానికే పరిచయం చేసు కుంటున్నప్పటికీ ప్రియురాలు పెళ్ళి ప్రసక్తి తీసుకు రాగానే ఊఁ అనేయాలి. ఊఁ అనడం పెళ్ళి కాదుగదా!

"అసలలాంటి అనుమానం నీకెందుకొచ్చింది?" అన్నాను.

"నీకు గోపీచంద్ తెలుసా?" అంది పద్మావతి.

"గోపీచంద్ ఎవరు?" అన్నాను ఆశ్చర్యంగా.

"పోనీ థియేటర్ చలిత తెలుసా?" అంది పద్మావతి.

"ఓహో—ఆ గోపీచందా" అన్నాను.... వెంటనే. మా ఊళ్లో "థియేటర్ చలిత" వెలసి ఏణ్ణర్థం

దాటింది. ఆ హాలు కట్టడానికి రమారమి కోటిన్నర అయిందని చెప్తుంటారు. థియేటర్లో సినిమా సంగతెలాగున్నా ఆ థియేటర్ చూడ్డమే ఓ అనుభవం.

ఆ థియేటర్ యజమాని గోపీచంద్. అంతకుముందాయనకు పెద్దగా పేరు లేకపోయినా థియేటర్ కట్టేక చలిత గోపీచంద్ అని ఆయన గురించి చెప్పుకుంటున్నారు. ఆయనకు రాష్ట్రం నుంచి కేంద్ర ప్రభుత్వందాకా గొప్ప పలుకుబడి వుందని అంతర్జాతీయ స్మగ్లరని కూడా చెప్పుకుంటారు. ఆయన తలచుకుంటే క్షణాలమీద నాయకుల్ని నేలమట్టం చేయగలడు. బిచ్చగాళ్ళను నాయకుల్ని చేయగలడు. దేశ ప్రధానికి ఆ పార్టీ ఎంపీలైనా భయపడక పోవచ్చు కానీ గోపీచంద్ మాటంటే ఆయన అనుచరులకు సుగ్రీవాజ్ఞ అంటారు. ఆయన అనుచరులందరూ ఎవరికి వారు సమాజాన్ని గుప్పిట్లో ఇరికించుకున్నవారే!

"అయితే గోపీచంద్ గురించి నీకు పూర్తిగా తెలుసా?" అంది పద్మావతి.

"ఊఁ" అన్నాను.

"నాకోసం నువ్వు గోపీచంద్‌ని హత్య చేయగలవా?"

ఉలిక్కిపడి—"ఏమిటీ?" అన్నాను.

"వినపడిందా—మళ్ళీ చెప్పాలా?"

"గోపీచంద్‌ని హత్య చేయడమెందుకూ?"

"నువ్వు చేయగలవా.... ముందు చెప్పు...."

"గోపీచంద్‌నే కాదు. ఏ మనిషినీ నేను హత్య చేయలేను...."

అప్పుడు పద్మావతి సాలోచనగా "పోనీ ఇంకోపని చెబుతాను" అంది.

పద్మావతి మాటలు తమాషాగా వున్నాయి. ఆమె ఏం చెప్పబోతోందా అని ఆలోచిస్తూ—"చెప్పు—" అన్నాను.

"నీకు దయానిధి తెలుసా?"

వినగానే ఆ పేరెక్కడో విన్నట్టే అనిపించింది. సాలోచనగా ఊళ్ళో వున్న ధియేటర్లు గుర్తు చేసుకుందుకు ప్రయత్నిస్తూ "ఏ ధియేటరో చెప్పు—" అన్నాను.

"ధియేటర్ కాదు—హోటల్-హోటల్ అవతార్."

అవతార్ దయానిధి అనగానే అర్థమైపోయింది. మా ఊరి చీకటి బజార్ పూర్తిగా ఆయన అధీనంలో వుందని చెప్పుకుంటారు. ఊళ్ళోని గూండాలందరూ ఆయన చెప్పు చేతల్లో ఉంటారంటారు. దయానిధికీ గోపీచంద్‌కీ అస్సలు పడదు.

"ఆఁ ఆ దయానిధి తెలుసు...." అన్నాను.

"అతడి దగ్గర పాతిక లక్షలు విలువచేసే రెండు అపురూప వజ్రాలున్నాయి. అవి దొంగతనం చేసి సంపాదించి నాకివ్వాలి..." అంది పద్మావతి.

"పద్మావతీ! నేను సినిమా హీరోను కాను. మామూలు ప్రేమికుణ్ణి. నా శక్తికి తగ్గ పని చెప్పు. చేస్తాను...." అన్నాను.

"నీ చేత పని చేయించుకోవడం నాకు సరదా కాదు—నీ శక్తికి తగ్గ పని చెప్పడానికి! నేను నీకు నా అవసరాన్ని బట్టి పనులు చెప్తాను...." అంది పద్మావతి.

అప్పుడామె ముఖం గంభీరంగా వుంది. సరదాగా ఆ మాటలన్నదని నాకనిపించలేదు-"గోపీచంద్ చావుకూ, దయానిధి వజ్రాలకూ, నీకూ నాకూ యేమిటి సంబంధం?" అన్నాను నేనూ గంభీరంగా.

"విడదీయలేని భయంకరమైన బలమైన అనుబంధమది చెబితే నువ్వు తట్టుకోగలవా?" అంది పద్మావతి.

"సస్పెన్సు వద్దు. వెంటనే చెప్పెసేయ్...."

"నేనో విషవలయంలో ఇరుక్కున్నాను. నన్నిరికించినవాడు గోపీచంద్—" అంది పద్మావతి.

"అయితే?"

"ప్రస్తుతం నేను గోపీచంద్‌కు స్మగ్లింగ్ వ్యవహారాల్లో సాయపడుతున్నాను...." అంది పద్మావతి.

ఉలిక్కిపడ్డాను. ఒక్కక్షణం నాకు బుర్ర పని చేయలేదు.

"ఈ విషయం నీకు చెప్పాలా చెప్పకూడదా అని నిన్న రాత్రి, ఈ పగలు-ఆలోచించి చివరకు చెప్పాలనే నిర్ణయానికి వచ్చాను—" అంటూ ప్రారంభించింది పద్మావతి.

"ఇదంతా ఎలా జరిగింది?" అన్నాను.

"మా నాన్న గోపీచంద్ దగ్గర మామూలుగా పని చేస్తూండేవాడు. ఒకరోజు నాన్న గోపీచంద్ డబ్బు బ్యాంకు నుంచి తెస్తూండగా యెవరో కొట్టేశారు. మొత్తం ముప్పైవేలు. అది కావాలని గోపీచందే యిరికించాడో, కాకతాళీయంగా జరిగిందో తెలియదు. గోపీచంద్ నాన్నను క్షమించి నన్నూ ఆయన్నూ కలిపి స్మగ్లింగ్‌లోకి దింపాడు. మొదట్లో మాకది స్మగ్లింగు వ్యవహారమని తెలియదు...."

"తెలియకుండా యెలా వుంటుంది—అందులోనూ స్మగ్లింగ్ వ్యవహారం?" అన్నాను. ఎందుకంటే అబద్ధమాడినా అది అతికినట్లుండాలి కదా!

"అయితే నాకు నువ్వు స్మగ్లింగు వ్యవహారంలో

తెలిసే సాయం చేశావా?" అంది పద్మావతి.

నేను తెల్లబోయాను. గిరిజ నాకిచ్చిన ప్యాకెట్లో స్మగ్లింగ్ గూడ్స్ వున్నాయట. అందుకు బదులుగా నేను డబ్బున్న బ్రీఫ్‌కేసు వాళ్ళకు అందించాను. అది స్మగ్లింగ్ వ్యవహారమనేసరికి నేను దెబ్బతిన్నప్పటికీ గతంలో నన్ను వేధిస్తున్న చిక్కు ప్రశ్నలకిప్పుడు జవాబులు దొరికాయి.

"నువ్వు స్మగ్లరు ముఠా మనిషివయుంటావని ఊహలో కూడా అనుకోలేక పోయాను...." అన్నాను.

"నువ్వు ఊహలోకూడా అనుకోలేని విషయం నాకు వాస్తవంలో యెంత భయంకరంగా వుంటుందో ఊహించుకో. అయితే గోపీచంద్ తెలివైనవాడు. ఆయన తను పోగొట్టుకొన్న ముప్పైవేల పేరూ చెప్పి మా వద్దనుంచి అంతకు వందరెట్లు ప్రతిఫలం పొందాడు. మా సాయం ఆయనకు బాగా వీలుగా వుంది. అయితే నాకిది ఇష్టం లేదని తెలుసాయనకు. అందుకని ఇది తాత్కాలికమేనని నాతో చెబుతూ వచ్చాడు.

అందులోనూ ఈ వ్యవహారంలోకి దిగాక నా ఆరోగ్యం పాడైంది. అందుకు కారణం మానసికాందోళన అని డాక్టర్ శ్రీనివాసమూర్తిగారంటారు. అందుకే ఇటీవల నేను స్వయంగా యే పనీ చేయకుండా నీలాంటి వాళ్ళను మాయచేసి మచ్చిక చేసుకొని వ్యవహారం నడుపుతున్నాను. కానీ యెందుకో నువ్వు నాకు బాగా నచ్చావు. నిన్ను మోసం చేస్తూంటే నాలో ఆవేదన పుట్టుకొస్తోంది. స్మగ్లింగ్ వ్యవహారం స్వయంగా చేయడానికి మించి నేనూళ్ళో లేనని నిన్ను మోసం చేసినపుడు నాకెక్కువ బాధ కలిగింది—" అంది

పద్మావతి.

పద్మావతి యెటువంటిదైనా ఆమె నన్నభిమానిస్తోంది. ప్రేమిస్తోంది. ఆమెది నా మనసుకు నచ్చిన అందం. ఆమెను నేను వల్లో వేసుకోవాలనుకున్నాను. ఆమె తన అందాన్ని ఎరగా చూపి నాచేత తన పనులు చేయించు కోవాలనుకుంది. కానీ మోహంలో పడింది.

"ఇప్పుడేం చేయాలి?" అన్నాను.

"ఈరోజు గోపీచంద్‌ను కోరాను—నన్ను విముక్తురాలిని చేయమని! ఆయన నన్నే నేను బ్రతికుండగా నీకు విముక్తి లేదన్నాడు. అందుకే నిన్నాయన్ను చంపేయమని కోరాను...." అంది పద్మావతి.

"మరి దయానిధి వజ్రాలు...."

"అదీ గోపీచందే చెప్పాడు. ఒకవేళ నేను బ్రతికుండగా నీకు విముక్తి కావాలనుకుంటే దయానిధి దగ్గరుండే అపురూపమైన రెండు వజ్రాలు తెచ్చి నాకివ్వాలి. వాటి విలువ ఒకోటి పాతిక లక్షలు చేస్తుంది. ఇది నీకు బ్రతికుండగా సాధ్యపడుతుందని నేననుకోను-అన్నాడు" అంది పద్మావతి.

ఇప్పుడు నాకు మొత్తం వ్యవహారమంతా అర్థమై పోయింది. పద్మావతి అంతా నిజం చెబుతోందని నేననుకోను. ప్రేమ పేరుతో ఆమె నన్ను లొంగదీసుకొని గోపీచంద్ హత్యకానీ, దయానిధినుంచి వజ్రాలు దొంగతనం కానీ చేయించాలనుకుంటోంది. ఇందువల్ల ఆమెకు గానీ, ఆమెను కాపాడుస్తున్న వారికీ ప్రత్యేకమైన ప్రయోజనాలేవో ఉండివుండాలి.

నేను రానికోపాన్ని తెచ్చిపెట్టుకొని — "నీ విలాంటి దానివని నేననుకోలేదు. ఎవరో నిన్ను కాపాడుస్తూంటే అ

నేరాలు నాచేత చేయించడానికే కట్టు కథ చెప్పావు. అయితే ఒక్క విషయం గుర్తుంచుకో. ఎట్టి పరిస్థితుల్లోనూ నేను హంతకుడినీ, దొంగనూ కాలేను. ఇప్పటికే నీకు స్మగ్లింగ్ వ్యవహారంలో సాయపడినందుకెంతో బాధపడుతున్నాను—" అన్నాను.

పద్మావతి దీనంగా నావంక చూసి-"నువ్వు నమ్మినా నమ్మకపోయినా నేను దీనావస్థలో వున్నాను. నన్నీ విష వలయం నుంచి నువ్వు రక్షించకపోతే నేనిందులో నే ఆహుతి అయిపోతాను" అంది.

"అలాంటప్పుడు నువ్వు నీవలను నాలాంటి వాళ్ళపై కాక ఏ గూండాలమీదకో విసరాల్సింది...." అన్నాను కాస్త కసిగా. హత్యలు, దొంగతనాలు పద్మావతి నాచేత చేయించాలనుకున్నందుకు నాకు కసిరాలేదు. అవి చేస్తే తప్ప పద్మావతి నాకు దక్కదు. ఆ పనులు నావల్ల కాదు. నా అసహాయత నాలో కసిని రేపుతోంది.

పద్మావతి చీర చెంగుతో కన్నీళ్ళు తుడుచుకొని— "నేను నటిని కాను. నాకు హృదయముంది. నా జీవన సహచారిని వెతుక్కునేటప్పుడు నా మనసుకు నచ్చిన మనిషిని తప్ప వేరొకరి నెన్నుకోలేకపోయాను. అది నా బలహీనత. నేను నిన్ను ప్రేమిస్తున్నాను—" అంది.

"నన్నెందుకు ప్రేమించావు పద్మా! నీ బలహీనతతో ఓ. బలహీనుణ్ణెందుకు ఎన్నిక చేసుకున్నావు?" అన్నాను.

"ప్రేమించడాని కారణం బలహీనతే కావచ్చు. కానీ ప్రేమ చీమకూడా మదపుటేనుగు బలాన్నివ్వ గలదని పుస్తకాల్లో చదివాను—" అంది పద్మావతి.

"కానీ నా శక్తికి మించిన పని నేను చేయలేను...."

పద్మావతి నిట్టూర్చి—"నీ శక్తికి మించనిదైనా చేయ

గలవని నమ్మక మేమిటి" అంది.

అప్పుడు నేను పద్మావతికి వాగ్దానం చేశాను—నా శక్తికి మించని పని ఏదైనా నేను చేయగలనని! ఆమె నా వాగ్దానాన్నంత సులభంగా నమ్మలేదు. చివరికి నేను "నీ నుంచి యే ప్రతిఫలమూ లేకుండా నీకోసంయేమైనా చేయగలనన్నాను. అయినా నువ్వు నమ్మడంలేదు—" అన్నాను.

"ప్రతిఫలం లేదంటావేం? నేను నీకు ప్రతిఫలం కానా?"

పద్మావతి అడిగిన ఈ ప్రశ్న నన్ను రోమాంచితుణ్ణి చేసింది — "పద్మా! నువ్వు నాకు ప్రతిఫలానివెలా గాతావు? నా జీవితానికే ఓ అపురూప వరానివి—" అన్నాను.

అప్పుడామె నిట్టూర్చి—"సరే—నీ మాటలు నమ్మతాను. ముమ్ముందు మనం జంటగా సుఖ జీవనం చేయగలమని నాకు నమ్మకం కలుగుతోంది. వ్యవహారాన్ని మనకు సానుకూలం చేయడానికి, నీ శక్తికి మించని సాయం నువ్వు నాకు చేయడానికి, నేను నా శక్తిమించి ప్రయత్నిస్తాను-" అంది.

## 7

ఆ రోజలా ఇద్దరం విడిపోయేక మళ్ళీ యిద్దరం కలుసుకోలేదు. పద్మావతిని కలుసుకోవాలంటే నాకు భయం వేసింది. నటనలో ఆమె నన్ను మించినదన్న అనుమానం నాక్కలిగింది. నాకు తెలియకుండా నాచేత ఆమె స్మగ్లింగు వ్యవహారంకూడా నడిపించింది. ఆ రోజు డాక్టర్ శ్రీనివాసమూర్తి వచ్చి వుండకపోతే ఆమె నాచేత ఇంకా చాలా పనులు చేయించుకొని వుండేది.

తర్వాతనుంచి నేను గోపీచంద్, దయానిధుల గురించి యెక్కువ వివరాలు తెలుసుకుందుకు ప్రయత్నించాను. తెలుసుకున్న కొద్దీ నాకు వాళ్ళంటే భయం పెరిగి పోయింది. వాళ్ళ జోలికి వెళ్ళడమంటే మృత్యువుతో చెలగాటమే!

అయితే పద్మావతి నన్ను ప్రేమిస్తోందన్న అనుమానం కూడా నాలో కలిగింది. ఆ ప్రేమను నేను సొమ్ము చేసుకోవాలి. అదంత సులభ సాధ్యమా?

సరిగ్గా వారం రోజుల తర్వాత పద్మావతి నాకు ఫోన్ చేసింది. ఆమె కోరిన ప్రకారం ఆ రోజే పార్కుకు వెళ్ళి ఆమెను కలుసుకున్నాను.

పద్మావతి చాలా ఉత్సాహంగా వుంది—"మొత్తం మీద అనుకున్నది సాధించాను...." అంది.

"ఏమిటది?" అన్నాను.

"ఇన్నాళ్ళుగా మనం ప్రేమించుకుంటున్నాం కానీ అసలు విషయం నేను కనిపెట్టలేకపోయాను. గోపీచంద్ కి హేట్సాఫ్!" అంది పద్మావతి.

"ఏమిటో చెప్పు!" అన్నాను ఆత్రుతగా.

"నీ శక్తికి మించనిదైతే తప్పకుండా చేస్తానని మాటిచ్చావు. నీ శక్తి యెంత గొప్పదో గోపీచంద్ చెప్పాడు...." అంది పద్మావతి.

"ఏమిటది?"

"నీ సీటు...."

ఉలిక్కి పడ్డాను.

చాలా కీలకమైన సీటు నాది. పెద్ద పెద్ద వాళ్ళ టెండర్సు నా దగ్గరకొస్తాయి. వాటిలో లోయెస్టు కొటేషను ఎంతకుందో తెలుసుకునేందుకు చాలామంది

ప్రయత్నిస్తారు. నేను కాన్ఫిడెన్షియల్ సెక్షన్లో వున్నాను.

మాకు కన్‌స్ట్రక్షన్ వర్కు చాలా వుంది. యేటా పది పన్నెండు బిల్డింగ్ కంట్రాక్ట్స్ వుంటాయి. మా కంట్రాక్టులేవీ పదిలక్షలకు తక్కువ వుండవు. తెలివైన కంట్రాక్టరు అందులో యెంతైనా మిగుల్చుకోవచ్చు.

మా వర్కు కోసం మేము పేపర్లో టెండరు నోటీసిస్తాం. ఫలానా పని ఎంతలో చేయగలరని కంట్రాక్టర్ల నడుగుతాం. మాకు అప్లికేషన్స్ వస్తాయి. అందరిలోకీ యెవరు తక్కువ మొత్తం అడుగుతారో కంట్రాక్టు వాళ్ళకు వెళ్ళిపోతుంది. ఉదాహరణకు ఒకడు పదిలక్షల యాభై వేలలో ఆ పని చేస్తాననవచ్చు. మరొకడు పది లక్షల నలభై తొమ్మిదివేల తొమ్మిది వందల తొంభై తొమ్మిది—అన్నాడంటే కంట్రాక్టు అతడికే వెళ్ళిపోతుంది.

లక్షల్లో కంట్రాక్టు వున్నప్పుడు పది వేలు అటూ యిటూలో లాభాల్లో తేడా వుండదు. అందుకే అందరూ లోయెస్టు కొటేషన్ తెలుసుకొందుకు ప్రయత్నిస్తారు. అందుకెంతైనా లంచంగా యిస్తారు. మా ఆఫీసులో నేనాపని చూస్తున్నాను. అయితే ఆ విషయం రహస్యం. ఈ లోయెస్టు కొటేషన్ల వ్యవహారం. ఎవరు చూస్తున్నారో పై ఆఫీసరుకి తప్ప ఇంకెవ్వరికీ తెలియదు.

నా గురించి పద్మావతికి తెలిసిపోయిందంటే అది చాలా గొప్ప విశేషమే! గోపీచంద్ ప్రభావం చాలా దూరముందన్నమాట!

పద్మావతి చెప్పుకుపోతోంది. వచ్చే సంవత్సరం మా

ఊళ్ళో ఓ అయిదు చుక్కల హోటలు రాబోతోంది. అందుకు యెనభై లక్షలు అంచనా. ఆ కంట్రాక్టు గోపీచంద్ కావాలి.

"అది నా చేతుల్లో లేదు ..." అన్నాను.

పద్మావతి నిరుత్సాహపడలేదు. గోపీచంద్ ఆమెకు చాలా పెద్ద జాబితా యిచ్చాడు. వాటిల్లో కొన్నిటి గురించి నాకే తెలియదు.

లోయర్ ఇన్‌కం గ్రూపువాళ్ళకు ప్రభుత్వం ఒకచోట ఇళ్ళు కట్టిపెడుతోంది. మొత్తం పన్నెండు బ్లాకులు. బ్లాకులో ఎనిమిదేసి ఇళ్ళుంటాయి. రెండు అంతస్థుల్లో అన్నీ ఒకరికే కాకుండా నాలుగేసి బ్లాకులు ఒకరికి చొప్పున కంట్రాక్టు యివ్వాలనుకుంటోంది ప్రభుత్వం. ఆ ఫైలు నేనే చూస్తున్నాను.

కొనుక్కునే వాళ్ళకోసం యిల్లు ఇరవై వేల రూపాయలకు మించకూడదు. ఇందులో లోయెస్టు కోటేవన్ను మూడు ఎన్నిక చేస్తాం. అందరికంటే తక్కువ అడిగిన మొత్తానికి మిగతా యిద్దరూ చేయగలరో లేదో విచారిస్తాం. పని అప్పగించేస్తాం.

మొత్తం ముగ్గురికి సంబంధించిన వ్యవహారం గావడం వల్ల ఇందులో పెద్దగా రిస్కు కూడా వుండదు.

నేను పద్మావతి దగ్గర వివరాలు తీసుకున్నాను.

"పద్మా! ఈ విషయంలో నేను నీకు తప్పక సాయ పడగలను—" అన్నాను.

"అయితే మన పెళ్ళి ఖాయం-" అంది పద్మావతి.

మగాడు ఆడదాని గురించి ఆలోచిస్తాడు. ఆడది పెళ్ళి గురించి ఆలోచిస్తుంది. పెళ్ళి చేసుకోకపోతే పద్మావతి నాకు దక్కని పక్షంలో ఆమెను పెళ్ళిచేసు

కోవాలనే అనుకున్నాను.

"పెళ్ళంటే నూరేళ్ళ పంట. నువ్వు నా గురించి బాగా ఆలోచించుకొన్నావా?" అన్నాను.

"ఆలోచించుకున్నాను. నువ్వు లేనిదే నేను బ్రతక లేను...."

పద్మావతిలాంటి అందమైన యువతి పెదవుల కదలిక లోంచి వచ్చిన ఆ మాటలు నాకు కలిగించిన పరవశ మింతా అంతా కాదు. అంత పరవశంలోనూ నేను దూరా లోచన చేస్తూనే వున్నాను. దురాలోచన వున్నవాడికి దూరాలోచన తప్పనిసరి.

"పద్మా మీ నాన్నకు చెప్పు. రెండు రోజుల్లో మన పెళ్ళి జరిగిపోతుంది. నీవు నన్నింతగా ప్రేమిస్తు న్నావని తెలిసేక ఆగలేను—" అన్నాను.

పద్మావతి తనకు మాత్రమే సాధ్యపడే అందమైన నవ్వుతో—"నీవు నా మనసు చదవగలిగితే తొందరపాటు నీది మాత్రమేనని అనుకోవు—" అంది.

# 8

మర్నాడాఫీసులో పద్మావతి చెప్పిన కేసుకు సంబం ధించిన ఫైల్సు శ్రద్ధగా పరీక్షించాను. టెండర్సు రావ డానికింకా పన్నెండు రోజులు గడువుంది. దీనికోసం ఊళ్ళో ఇద్దరు ప్రముఖులు ప్రయత్నిస్తున్నారు. అంత వరకూ వచ్చిన వాటిలో లోయెస్టు కొటేషన్ మొత్తం నోట్ చేసుకున్నాను.

ఆ రోజు పద్మావతిని కలుసుకుని క్లుప్తంగా వివరాలు చెప్పాను. ఆమె సంతోషంగా—"నూతన్—నీకెలా థాంక్సు చెప్పుకోవాలో తెలియడంలేదు. నా చుట్టూ వున్న ఆడపిల్లలందరికీ లాగే పెళ్ళి చేసుకొని మామూలు

జీవితం గడిపే అవకాశం అసలంటూ నాకొస్తుందా అని భయపడ్డాను. నీ పరిచయం నా అదృష్టం...." అంది.

"నేను మన పెళ్ళికి ఏర్పాట్లు చేస్తున్నాను...." అన్నాను.

"ఊఁ" అంది పద్మావతి సిగ్గుపడుతూ.

"కానీ ఒక యిబ్బంది వుంది...." అన్నాను. అప్పుడు పద్మావతి ముఖభావాలు గమనిస్తూ—"ఈ పెళ్ళికి మా పెద్దలొప్పుకోరు...." అన్నాను మళ్ళీ.

పద్మావతి కళ్ళలో కంగారు కనపడింది-"ఎందుకని?"

"నాకు చాలా పెద్ద పెద్ద సంబంధాలొస్తున్నాయి. లక్షరూపాయలు కట్నమివ్వడానికి సిద్ధంగా వున్న వాళ్ళిద్దరున్నారు...."

"అయితే మన పెళ్ళి జరగదా?" అంది పద్మావతి.

"పద్మా—నీకంటే నాకు కట్నం ముఖ్యం కాదు—లక్ష రూపాయలు కాదు, పదిలక్షలిచ్చినా నాకు నువ్వే కావాలి...."

పద్మావతి మాట్లాడలేదు.

"ఈ ప్రపంచాన్నంతా యెదిరించైనా సరే నేను నిన్నే పెళ్ళిచేసుకుంటాను...."

"వద్దు నూతన్—" అందామె—"నేనంత విలువ చేయను. ఈ రోజు కాకపోయినా మరో రోజున లక్ష రూపాయల విలువా నీకు తెలుస్తుంది. ఈ ప్రపంచంలో ప్రేమకూడా డబ్బు తర్వాతనే...."

"నా విషయంలో మాత్రం అలా జరగదు...." అని ఆమెకు నా గొప్పతనం గురించి వివరించి చెప్పాను.

ఆఫీసులో నా సీటే నాకు లక్షలకు లక్షలు సంపాదించి పెట్టగలదు. అయినప్పటికీ నేను కొన్ని ఆదర్శాలను

ప్రేమిస్తూ ఆ ప్రేమకోసం ఆ డబ్బును నిర్లక్ష్యం చేస్తున్నాను. ఉద్యోగంలో చేరాక మొదటిసారిగా ఈ టెండర్ సమాచారం లీక్ చేశాను. అదైనా డబ్బుకోసం కాదు. ప్రేమకోసం. అది సామాన్యమైన ప్రేమకాదు. పద్మావతిలాంటి అపురూప సౌందర్యవతిపై ప్రేమ! ఆ ప్రేమకోసం కట్నం డబ్బు లక్షలకై ఆశపడతానా?

పద్మావతి నేను చెప్పిందంతా విని—"మా నాన్న నిన్ను చూసిన తొలిరోజునే మనకీడూ జోడూ బాగుంటుందని అన్నాడు. అప్పుడు నేననుకోలేదు—నువ్వు దక్కుతావని! నేను గోపీచంద్ విషవలయంలో చిక్కుకున్నాక - నన్నందులోంచి ఏ మగాడూ తప్పించలేడని నిరాశ చేసుకున్నాను. కానీ నువ్వు...." అంటూ ఇక వాక్యం పూర్తిచేయలేక ఆగిపోయింది.

"పద్మా! మన వివాహం జరుగుతుంది కానీ అందుకే ఆర్భాటమూ వుండదు. రహస్యంగా గుళ్ళో పెళ్ళిచేసుకుందాం. ఆ ఏర్పాట్లు నేను చేస్తాను. తర్వాతకూడా మన వివాహానికి ప్రచారముండకూడదు. నువ్వు మీ ఇంట్లోనే వుంటావు. అలా కొంతకాలం గడిచేక నెమ్మది మీద మావాళ్ళకు నచ్చజెప్పి నిన్ను మా ఇంటికి తీసుకుని వెడతాను-" అన్నాను.

"నువ్వెలాగంటే అలాగే...." అంది పద్మావతి.

"రేపే మన పెళ్ళి!" అన్నానుత్సాహంగా.

పద్మావతి నవ్వి - "రేపే యెలా కుదురుతుంది. మనది టెండర్ లవ్ అని మర్చిపోతున్నావు-" అంది.

టెండర్ లవ్ అన్నమాట విని ఉలిక్కిపడ్డాను. టెండర్ అంటే-సున్నితమైనది, మృదువైనది సులభంగా భంగపడేది. మా ప్రేమ గురించి అర్థం చేసుకునే కావా

లని పద్మావతి ఈ మాటలన్నదా?

"మనది టెండర్ లవ్ కాదు. వెరీ స్ట్రాంగ్ లవ్..." అన్నాను.

పద్మావతి తడబడి - "అరే నా ఉద్దేశ్యమది కాదు. టెండర్ లవ్ అంటే - టెండర్ కోసం లవ్ అని.... ఆ హాస్ బిల్డింగ్ టెండర్ తేలేదాకా అంటే ఇంకో పన్నెండు రోజులదాకా మన పెళ్ళి జరగదు...." అంది.

నేను తేలికగా నిట్టూర్చాను. నా మనసులో దుర్మార్గముంది కాబట్టి కానీ ఆమె అన్నమాట వెంటనే అర్థం కావాల్సి వుంది. అయినా తెలిసో తెలియకో మా మధ్య నడుస్తున్న ప్రేమ వ్యవహారం అసలు స్వరూపాన్ని పద్మావతి చక్కగా వివరించగలిగింది.

మరి మాది నిజంగా టెండర్ లవ్!

## 9

నేను శతభిషాన్ని కలుసుకున్నాను.

శతభిషాన్ని చాలామంది శతవిషం అంటారు.

ఆడపిల్లల్ని మోసంచేసి వదిలిపెట్టడంలో అందెవేసిన చేయి వాడు.

శతభిషానికి అందంలేదు కాని చొరవ వుంది. ఆడపిల్లల్ని అందంతోకంటె చొరవతో బాగా లొంగదీసుకోవచ్చునని వాడి అభిప్రాయం. అమ్మాయిల వ్యాపారం చేస్తున్నాడు కాబట్టి అది సరైనదే అనుకోవచ్చు. ప్రేమ పేరు చెప్పి మోసంచేసి ఎందరినో వ్యభిచార గృహాలకు అమ్మేశాడు వాడు.

అప్పుడప్పుడు ఆడపిల్లలను వశపర్చుకునేందుకు నావంటి అందగాళ్ళ సాయంకూడా తీసుకుంటూంటాడు వాడు. నాకు అందం, చొరవకూడా వుంది. వాడి సహకారంతో

నేనూ ఓ ఇద్దరాడపిల్లల్ని మోసం చేశాను. శతభిషంతో సుఖమేమిటంటే మోసపోయిన ఆడదాని బాధ మన కుండదు. వాడే చూసుకుంటాడు.

పద్మావతి విషయంలో శతభిషం సాయం కోరానంటే అందుకా్కరణం మాత్రం వేరే వుంది.

దొంగ పెళ్ళిళ్ళు చేయించడానికి వాడేర్పాటు చేయ గలడు.

వాడికి అందుబాటులో నాలుగైదు దేవాలయా లున్నాయి. అక్కడ పెళ్ళి జరిగితే - పూజారికానీ, తంతు జరిపించిన బ్రాహ్మణుడు కానీ ఆ తర్వాత సాక్ష్యం చెప్పరు. అంటే పెళ్ళి శాస్త్ర ప్రకారమే జరుగుతుంది. కానీ పెళ్ళికి సాక్ష్యముండదు. ఈ పెళ్ళిళ్ళవల్ల ఆడ పిల్లల్ని మోసగించడం సులభమైపోతుంది. తనకు నిజంగా పెళ్ళయిపోయిందనుకొని-ఆ పిల్ల ఆ తర్వాత నుంచి మొగు డెలా చెబితే అలావింటుంది.

పద్మావతి విషయంలో శతభిషాన్ని కలుసుకోవాలా వద్దా అని ఆలోచించాన్నేను. ఎందుకంటే పద్మావతి అందం ఆమె అంటే కొంత గౌరవాన్నికూడా కలిగిం చింది. ఆమెను నిజంగానే ప్రేమిస్తున్నానా అని కూడా అనిపిస్తోంది. అయితే ఆమె నాకు కావాలి. పెళ్ళిచేసు కుంటే తప్ప ఆమె నాకు దక్కదు. ఈ పెళ్ళిలో నాకు శతభిషం సాయం తప్పదు.

"అమ్మాయి ఫోటో చూపించు...." అన్నాడు శతభిషం.

అయిష్టంగానే చూపించా.

"మంచి పిట్టను పట్టావు. నాకు మంచి బిజినెస్సు...." అన్నాడు శతభిషం.

"ఈ పిల్ల విషయంలో బిజినెస్ గురించి ఆలోచించకు. పెళ్ళివరకే నీ సాయం. ఆతర్వాత నువ్వు మరిచిపోవాలి."

"ఇంత అందాన్నెలా మరిచిపోతాను?" అన్నాడు శతభిషం.

"నేను సీరియస్‌గా చెబుతున్నాను. పద్మావతిని నేను మోసగించవచ్చు. కానీ ఆమెను పడుపు వృత్తిలో దింప లేను...."

"పోనీ నాకేం కాడా ఓ ఛాన్స్....?"

"మిస్టర్ శతభిషం....నువ్వామెను నా భార్యగానే గుర్తించి మాట్లాడాలి...." అన్నాను సీరియస్‌గా.

"నీ భార్యగా గుర్తించాలంటే దర్జాగా అందరికీ తెలిసేలా పెళ్ళి చేసుకోవచ్చుగా...." అన్నాడు శతభిషం.

నా మాటల్లోని తెలివితక్కువతనం అర్థమయింది. తను వివాహం చేసుకున్న అమ్మాయికి భార్య అన్న గుర్తింపు రాకుండా 'వుండాలనుకున్నవాడే పెళ్ళి విష యంలో శతభిషం సాయం కోరుకుంటాడు.

"సారీ మిస్టర్ శతభిషం! ప్రస్తుతానికి నేనామెను భార్యగానే భావిస్తాను. నా మానసిక స్థితి మారేవరకూ నువ్వామె గురించి తేలికగా మాట్లాడొద్దు...."

"సరే-స్నేహితుడి మనసు కష్టపెట్టనులే....కానీ నీ అవసరం తీరాక ఈ స్నేహితుణ్ణి మాత్రం గుర్తుంచు కోవాలి...." అన్నాడు శతభిషం వంకరగా నవ్వుతూ.

ఆ వంకర నవ్వు చూడగానే నాలో అదోరకమైన జుగుప్సాభావం కలిగింది. నేను తప్పు చేస్తున్నానా అన్న భావం కూడా తొలిసారిగా నాలో కలిగింది.

# 10

రోజూ సాయంత్రం పద్మావతిని కలుసుకుంటున్నాను. పద్మావతి నాతో తన కలల గురించి వివరిస్తూండేది.

"నాకు పెద్దగా కోరికలు లేవు. కార్లలో తిరగాలని లేదు. మేడల్లో నివశించాలని లేదు. చిన్న యిల్లు చాలు. ఆ యింటిని నా అభిరుచుల కనుగుణంగా తీర్చి దిద్దుకుంటాను. ఆ యింట్లో నేను, నా భర్త.... ఇద్దరం ఒకరినొకరు అర్థం చేసుకుని ఒకరికొకరుగా జీవించగలిగితే చాలు...." అందొక రోజు.

అప్పుడు నా మనసులో యేదో కలుక్కుమంది.

"పెళ్ళయ్యాక నువ్వు నన్నుద్యోగం చేయమనకూడదు. పెళ్ళయ్యాక స్త్రీని శాసించగల మగవాడు భర్త ఒక్కడే కాగలడు. ఉద్యోగినిని ఇంట్లో భర్త-ఆఫీసులో అధికారి శాసించగలుగుతారు. మరో మగవాడు నన్ను శాసించగలడన్న భావన నన్ను అసంతృప్తిరాలిని చేస్తుంది...." అందామె ఇంకో రోజు.

నేను వణికిపోయాను. నిండు మనసుతో ఈమె నన్ను ప్రేమిస్తోంది. నా గురించి యేమేమో వూహించుకుంటోంది. ఈమెకు నేనివ్వనున్న ప్రతిఫలమేమిటి?

"ఎప్పుడూ మనమిద్దరం కలిసే వుండాలి. నా దుస్తులు అలంకరణ నీ అభిరుచులను ప్రతిబింబించాలి. వివాహమైనాక భిన్నవ్యక్తిత్వాలుండవు. మనది ఏక వ్యక్తిత్వం కావాలి. ప్రతి విషయాన్ని అవగాహనలో చర్చించి— ఎవరి పాయింట్లో మంచి వుంటే, న్యాయముంటే అదే స్వీకరించాలి. నేనన్నదే సాగాలన్న పట్టుదల, అహం— ఇద్దరిలోనూ ఉండకూడదు, మన దాంపత్యజీవనం

ప్రపంచానికే ఆదర్శం కావాలి....” అందామె మళ్ళీ కోడా.

ఆమె మాటలు నాలో పాపభీతిని కలిగిస్తున్నాయి. ఆమెపట్ల ప్రేమాభిమానాలతో పాటు జాలిని కూడా పెంచుతున్నాయి. కానీ నాలో నిస్వార్థం నన్ను మోసానికే ప్రోత్సహిస్తోంది. పెళ్ళయ్యేవరకూ మరేమీ ఆలోచించవద్దని స్వార్థం నన్ను హెచ్చరిస్తోంది.

అనుకున్న ప్రకారం రెండరు పద్మావతి చెప్పిన పార్టీకే వెళ్ళింది. శతభిషం మా యిద్దరి పెళ్ళికీ అన్ని యేర్పాట్లూ చేశాడు. మధ్య మధ్యలో నన్ను బాధ పెట్టకుండా అంతరాత్మ పీక నొక్కుతూ ముందడుగు వేస్తున్నాను.

# 11

ఆ రోజు రాత్రి యెనిమిది గంటల సమయం.

నేను పద్మావతింట్లో వున్నాను.

నేను, పద్మావతి, ముత్యాల్రావు ఊరి చివరి రామాలయానికి వెళ్ళవలసి వుంది టాక్సీలో. టాక్సీ శతభిషం ముత్యాల్రావింటికి పంపుతాడు.

మేము ముగ్గరం టాక్సీకోసం యెదురుచూస్తున్నాం.

పద్మావతి ముఖంలో పట్టరాని సంతోషం.

ఎప్పటికీ తప్పించుకోలేననుకున్న గోపీచంద్ విష వలయం నుంచి తప్పించుకుందామె. అటుపైన వేరెవ్వరి విషవలయంలోకీ చిక్కుకోనవసరం లేకుండా నా వంటి భర్త రక్షణ లభిస్తోంది.

ఆడదాని కంత కంటె కావలసిందేముంది?

ఇలాగనుకునే పద్మావతి, ఆమె తండ్రి ముత్యాల్రావు

మహదానంద పడిపోతున్నారు.

ఎనిమిది గంటల ఇరవై నిముషాలకి టాక్సీ యింటి ముందాగింది. ముగ్గురం టాక్సీ యెక్కాం. ముగ్గురమూ వెనుక సీట్లోనే కూర్చున్నాం. నాకూ పద్మావతికీ మధ్యగా కూర్చున్నాడు ముత్యాలరావు.

టాక్సీ కొంత దూరం వెళ్ళాక—"సార్—మన టాక్సీని మరో టాక్సీ వెంటాడుతోంది—" అన్నాడు డ్రైవర్.

నేను కంగారుపడి వెనక్కి చూశాను. పద్మావతి మాత్రం చలించకుండా—"అది వెంటాడడం కాదు. అందులో నా ఫ్రెండ్స్ వస్తున్నారు—" అంది.

"నీ ఫ్రెండ్సా—నాకు చెప్పలేదేం?" అన్నాను.

"నేను నాన్నక్కూడా తెలియకుండా పెళ్ళి చేసుకో గలనేమో కానీ నా ఫ్రెండ్సుకి తెలియకుండా కుదరదు. వాళ్ళు మొత్తం నలుగురు...." అంది పద్మావతి.

అంటే పద్మావతి పెళ్ళికి సాక్ష్యాన్ని తెచ్చుకొస్తోం దన్నమాట. ఇంతవరకూ ఈ విషయాన్ని రహస్యంగా వుంచిందంటే ఆమె నన్ననుమానించిందా? ఈ సాక్ష్యాలు ముమ్ముందు నా కిబ్బందిని కలిగిస్తాయా?

"వీళ్ళ విషయం ముందుగా నాకు చెప్పాల్సింది...." అన్నాను.

ముత్యాలరావు వెంటనే—"నీకేం భయంలేదు. ఈ పెళ్ళి విషయం వాళ్ళెక్కడా అనరు. రహస్యాన్ని వాళ్ళకులా నువ్వుకూడా కాపాడలేవు-" అన్నాడు.

కోట్లో తలదూర్చి కోకటిపోటుకు వెరచి ఏమి లాభం? ముందు పద్మావతిని నాదాన్ని చేసుకోవాలి, ఆ

తర్వాత ఆమె మాత్రం నన్నేం చేయగలదు?

పద్మావతి ముందు జాగ్రత్తకోసం తన స్నేహితులను పిలిచిందా లేక వాళ్ళామెకంతటి గాఢ స్నేహితులా? తనను ప్రతినిత్యం కాపాడుతున్న డాక్టర్ శ్రీనివాసమూర్తిని కూడా ఆమె పెళ్ళికి ఆహ్వానించడం లేదని చెప్పింది. అంటే ఈ స్నేహితులాయనకంటె ముఖ్యులై వుండాలి.

టాక్సీ రామాలయం ముందాగింది. అక్కడ పూజారి, పురోహితుడు సిద్ధంగా వున్నారు. పురోహితుడు నన్ను చూస్తూనే - "అయ్యా! దండలు తెప్పించాము. అన్నీ సిద్ధంగా వున్నాయి. ముహూర్తానిక్కూడా ఇంక ఇరవై నిమిషాలే గడువుంది_" అన్నాడు.

ఈలోగా మా వెనుక ఓ టాక్సీ ఆగింది. అందులోంచి ఓ యువకుడు దిగాడు. మనిషి బలంగా, ఎత్తుగా ఆకర్షణీయంగా వున్నాడు. అంతకుముందే అతడినెక్కడో చూశాననిపించింది. క్షణంలోనే గుర్తుకూడా వచ్చింది.

అతడు సుకుమార్.

పద్మావతి టాక్సీ దిగి చనువుగా అతణ్ణి సమీపించి "వాళ్ళనుకూడా తీసుకొచ్చావా?" అంది.

"ఊఁ" అన్నాడు సుకుమార్.

పద్మావతి పురోహితున్ని సమీపించి - "అయ్యా! మేమే వధూవరులం. ఇంక తంతు ప్రారంభించవచ్చు-" అంది.

నేను ప్రమాన్పడిపోయాను. ఆమె పురోహితుడికి సుకుమార్ని వరుడిగా పరిచయం చేసింది. నేనేదో అనేలోగా - "నూతన్! టాక్సీలో నా ఫ్రెండ్సున్నారు.

నువ్వు రిసీవ్ చేసుకోవాలి....” అందామె.

అప్పుడే టాక్సీ వెనుక డోర్ తెరుచుకుని-ఓ యువతి దిగింది. ఆమె వెనుక నే....

“మై గాడ్!” అనుకున్నాను.

ఆ యువతి నా భార్య. ఆమె వెనుక నే అయిదు, మూడేండ్ల వయసుగల మా పాప, బాబు దిగారు.

నాకు కాళ్ళూ చేతులూ ఆడలేదు.

శ్రీమతి నన్ను సమీపించింది-“ఎంత మంచి హృదయు మండీ మీది! ఇద్దరు ప్రేమికులను కలపడం కోసం మీరు యెంతగా కష్టపడ్డారో పద్మావతి చెప్పింది. రహస్యంగా మీరిలాంటి పనులుకూడా చేస్తూంటారని నాకు తెలియదు. సోదాహరణగా చూపిస్తానని ఆమె ఈ రోజు నన్నీ పెళ్ళికి ఆహ్వానించింది.”

శ్రీమతి నన్ను వేళాకోళం చేస్తోందా అని ఆమెవంక పరీక్షగా చూశాను. ఆమె కనులలో ఆరాధన కనబడింది.

అప్పుడు నేను సుకుమార్ వంక తిరిగాను. అతడి కనుల్లో కొట్టవచ్చినట్లు నాపట్ల కృతజ్ఞతా భావం కన బడుతోంది.

“వాళ్ళు పుణ్య దంపతులు సుకుమార్! వారి ఆశీర్వాదంతో మనం కలకాలం సుఖంగా వుంటాం-” అంది పద్మావతి.

“యాభై వేలు లంచమిచ్చినా జరుగని పని పైసా ఖర్చు లేకుండా జరిగిపోయింది. మన పెళ్ళి జరిగితే తన ప్రాణాలు తీసుకుంటానన్న నాన్న ఈ కంట్రాక్టు సంపాదించగానే అంతా నా యిష్ట మన్నాడు. మన పెళ్ళికింత కష్టమైన షరతు విధించి

నందుకు నేను నిన్న నాన్న ఆధ్వర్యంలో కాకుండా నాకై నేనే పెళ్ళి చేసుకోవాలనుకున్నాను. నాన్న పెట్టిన షరతును సులభసాధ్యం చేసిన నూతనరావుగారి ఆధ్వర్యంలో మన పెళ్ళి జరగడం మన అదృష్టం...."
అన్నాడు సుకుమార్.

నాకు మతిపోయినట్లయింది. కానీ విషయం అర్థమవుతోంది. ఈ కథలో గోపీచంద్, దయానిధి, స్మగ్లింగు-ఆఖరికి శ్రీనివాసమూర్తితోసహా అంతా పద్మావతి తండ్రితో కలిసి ఆడిన నాటకం. ఆమె సుకుమార్ని ప్రేమించింది. సుకుమార్ ఆమెను ప్రేమించాడు. ఇద్దరి పెళ్ళి సాక్షిగా జరపడానికి నానుండి టెండరు సమాచారం కావాల్సొచ్చింది.

పద్మావతి తెలివిగా నన్నుపయోగించుకుంది. ఎంతో తెలివైన ఆమె నా గురించీ, నా సంసార జీవితం గురించీ పూర్తి అరాతీయకుండా ఉంటుందనుకోవడం నేను చేసిన పెద్ద పొరపాటు. ప్రస్తుతమున్న పరిస్థితిలో నేను తేలుకుట్టిన దొంగలా వూరుకోవలసి వచ్చింది. అయినా ఓ అవకాశం కల్పించుకొని పద్మావతితో నెమ్మదిగా—"అయితే నువ్వెప్పుడూ నన్ను ప్రేమించి లేదా?" అన్నాను.

"శ్లోకం....ఎటొచ్చీ అది టెండర్ లవ్!" అందామె.

శరభివం తన ఏర్పాట్లతో ఇలాంటి పెళ్ళి జరిపిస్తానని అనుకుని వుండడు. అందుకు నేను ఆధ్వర్యం వహిస్తానని నేనూ ఊహించలేను.

ఆ తర్వాత మాత్రం నేను గమనించిందేమిటంటే— పద్మావతి జీవితం తను కన్న కలలకు అనుగుణంగానే

నడిచింది. అలాంటి కోరికలు నా భార్యకూ వుంటాయని గ్రహించి నేనూ నా భార్య కలలు పండించడానికి ప్రయత్నిస్తున్నాను. తనకు తెలిసినప్పటికీ నా దౌష్ట్యాన్ని తన భర్తకూ, నా భార్యకూ తెలియకుండా దాచిన పద్మావతి వంటి ఆడపిల్ల అస్తమానూ నాకు తగలక పోవచ్చు. అందుకే నేను మళ్ళీ పరాయి ఆడపిల్లల జోలికి వెళ్ళలేదు.

—: అయిపోయింది :—

# సుల్తాన్! సైతాన్!!

## బొమ్మిడి అచ్చారావు

ఉదయాన్నే వాకిలి వూడ్చి ముగ్గులు పెడుతోంది భ్రమరాంబ. ఆమె వయసు దాదాపు ఏభైఏళ్ళుండ వచ్చు. ఆమె ముఖం నిండా వయసు తెచ్చిన హుందా తనంతోబాటు, జీవితంలో ఎన్నో ఆటుపోట్లు అనుభ వించిన పెద్దరికం కూడా వుంది.

అప్పటికింకా పూర్తిగా వెల్తురు రాలేదు. జనం వీధుల్లోకి యింకా రావటం ప్రారంభించలేదు. ఎక్కడ్నుంచో ఓ అంబాసిడర్ కారు ఆ వీధిలోకి సర్రున దూసుకొచ్చింది. ఒక్క క్షణం మాత్రం ఆగింది. ఆ ఒక్క క్షణంలోనే ఏదో బరువైన వస్తువును కిందికి తోసేసి, వచ్చినంత వేగంగాను దూసుకుపోయింది.

భ్రమరాంబ శబ్దానికి అటు తిరిగి చూసింది. ఆ దృశ్యం ఆమె దృష్టి నాకర్షించింది. కిందకి తోసి వేయబడ్డ వస్తువు మానవాకారమని గ్రహించింది. కాస్త పరీక్షగా చూస్తే ఆ ఆకారం తనకి చిరపరిచితమయినదిగా తోచింది.

చేతిలోని ముగ్గు గిన్నె అలాగే వదిలేసి దగ్గరగా వెళ్ళింది. అప్పటికే మేలుకొని వున్న వీధిలోని జనం ఒక రొకరే గుంపులుగా పోగైవారు.

భ్రమరాంబ ఆ వ్యక్తిని చూస్తూనే గొల్లుమన్నది.

"బాబూ, రవీంద్రా!" అంటూ కుప్పకూలిపోయింది.

అప్పటికే వీధిలోని జనం ఆ వ్యక్తిని ముట్టుకొని చూసి, "ప్రాణంపోయింది" అనుకొంటున్నారు. అతను భ్రమరాంబ పెద్దకొడుకు రవీంద్ర అని గుర్తుపట్టారు.

భ్రమరాంబ వాళ్ళింట్లోనించి ఓ యిరవై రెండేళ్ళ యువకుడు, పంతొమ్మిదేళ్ళ అమ్మాయి పరుగెత్తుకొని వచ్చారు.

"అన్నయ్యా!" అంటూ శవంమీదపడి భోరున ఏడవటం మొదలెట్టారు.

గుమికూడిన ప్రజలు సానుభూతి వాక్యాలు పలుకుతున్నారు. కొందరు "ఇది హత్యలాగా వుంది, పోలీసులకి కబురుచేస్తే మంచిది" అన్నారు. మరికొందరు "అనవసరం. శవాన్ని దక్కనివ్వరు సరికదా, పోలీసు కేసు పెట్టి బాధపడుతున్న వీళ్ళని యింకా నరకయాతనికి గురిచేస్తారు. గుట్టుచప్పుడు కాకుండా దహనం చేసేస్తేనే మంచిది" అన్నారు.

అయితే యిరవై రెండేళ్ళ రవీంద్ర తమ్ముడు మాత్రం అన్న శవాన్ని చూస్తూ చాలాసేపు నిస్తేజంగా, నిర్వికారంగా వుండిపోయాడు. ఆ తర్వాత మనసులోనే శపథం చేశాడు—"నిన్ను చంపిన వాళ్ళపై ఈ వీరేంద్ర పగతీర్చుకుంటాడు రవన్నాయ్యా! నీ ఆత్మకు శాంతి చేకూరుస్తాను."

ఆ తర్వాత జరగవలసిన కర్మకాండ యాంత్రికంగా జరిపించేశాడు వీరేంద్ర. అతని కళ్ళలో దుఃఖంలేదు. పగ, ప్రతీకారం దావానలంలా రాజుకుంటున్నాయి.

తన అన్న సంఘ విద్రోహులతో చేతులు కలిపి అతి ప్రమాదకరమైన జీవితం గడుపుతున్న నిజం తనకి వారం రోజుల క్రితమే తెలిసింది. అంతకాలం రవీంద్ర ఎక్కడో ప్రయివేటు కంపెనీలో ఉద్యోగం చేస్తున్నట్టుగా తనని, తల్లిని, చెల్లిని నమ్మించాడు. కాని వారంరోజుల క్రితం, మొదటిసారిగా తమ యింటికి పోలీసులు వచ్చినప్పుడు, అన్నమీద తనకి మొదటిసారిగా అనుమానం కలిగింది.

అంతక్రితం రెండు మూడు రోజుల కోసారయినా యింటికొచ్చే అన్నయ్య పోలీసులు తనకోసం వెతకటం మొదలెట్టాక యింటికి రావటమే పూర్తిగా మానేశాడు. దాంతో యింట్లో అందరికీ అతని ఉద్యోగం పట్ల అనుమానాలు తలెత్తాయి.

రెండు రోజుల క్రితం అర్ధరాత్రి దాటాక రవీంద్ర తను నిద్రపోతున్న మంచం దగ్గిర నిల్చుని మెల్లగా తనని తట్టి లేపాడు. ఉలిక్కిపడి లేచిన తను ఆశ్చర్యంతో గట్టిగా ఏదో అడగబోయాడు.

"ఉష్" అంటూ వారించాడు రవీంద్ర. "గట్టిగా మాట్లాడొద్దు. అమ్మవాళ్ళు లేస్తే నన్ను వెళ్ళనివ్వరు. నేను వెంటనే వెళ్ళిపోవాల్సి వుంది!" అన్నాడు.

"నీకోసం పోలీసులు...." తను చెప్పబోయాడు.

"నాకు తెలుసు. నేనో స్మగ్లింగ్ కేసులో గొంతు దాకా కూరుకుపోయి వున్నాను. నన్నెవరూ రక్షించలేరు. నేను కనపడితేచాలు వెంటనే అరెస్టుచేసి జైల్లో పెడతారు. మన పరువు మర్యాదలు బజారుకెక్కటం

నాకిష్టంలేదు. పోలీసులు మళ్ళీ వచ్చి అడిగితే నాతో మీ కెలాంటి సంబంధం లేదని, నే నెక్కడికి పోయానో తెలీదనీ చెప్పేయండి. మళ్ళీ యిక్కడికి పోలీసులు రాకుండా సమాధానం చెప్పు. అది నీకే సాధ్యమవుతుంది...."

"కాని, అన్నయ్యా...."

"ఇంకేం చెప్పొద్దు. నా మూలంగా మీరందరూ చిక్కుల్లో పడటం నాకిష్టంలేదు. నేనంత దుర్మార్గుణ్ణి కాదు."

"అన్నయ్యా, నాతో నిజం చెప్పవూ....నీకోసం పోలీసులు ఎందుకు తిరుగుతున్నారు? స్మగ్లింగ్ కేసేమిటి? ఎందుకిలా మారిపోయావు? నీ చదువు, సంస్కారం, ఏమయిపోయాయి?"

"అవన్నీ అడక్కు వీరేన్. నా చదువు మన నలుగురి కడుపులు నింపలేకపోయింది. అందుకే, మిమ్మల్ని పస్తుల్లో మాడ్చటం యిష్టంలేక తప్పనిసరి పరిస్థితుల్లో యీ దారి ఎన్నుకున్నాను. ఏదో ప్రయివేటు కంపెనీలో ఉద్యోగం చేస్తున్నానని అబద్ధం చెప్పాను. కాని నేను ఆశ్రయించిన సుల్తాన్ పరమ నీచుడు.

మొదట్లో స్మగ్లింగ్ ముఠా అని తెలియక అతని దగ్గర పనికి కుదిరాను. తర్వాత తర్వాత తెలిసింది; సుల్తాన్ కి అంతర్జాతీయ ముఠాలతో సంబంధ ముందని, పోలీసులకి అతను బాగా తెలిసిన నేరస్తుడని, అందుకని, కొత్త వాడినీ, చదువుకున్న వాడినీ అయిన నన్ను అతని కిరాతక చర్యలకు యెన్నుకున్నాడనీ. కానీ అప్పటికే ఆలస్యమయిపోయింది. నేను రెండు ముఠాల మధ్య దొంగ బంగారాన్ని, దొంగ కరెన్సీని మారకం చేస్తున్నానన్న

నిజం నాకు తెలియకుండానే యాంత్రికంగా జరిగిపో యింది.

పోలీసులు వెంటాడారు. బంగారం వున్న సూట్ కేసు వదిలి పారిపోయాను. పోలీసుల బారినుంచి తప్పించు కున్నాను. కాని, ఆ నీచుడైన సుల్తాన్ నన్ను ప్రాణాలతో వదుల్తాడనే నమ్మకం నాకు లేదు...."

"అన్నయ్యా...."

"అవును వీరేన్.... నేను పోతే ఈ కుటుంబం వీధుల పాలుకాకూడదు. నువ్వు బాధ్యత తీసుకోవాలి. చెల్లినో యింటిదాన్ని చెయ్యి. అమ్మను కడదాకా కనిపెట్టుకుని వుండు!"

తనకి అన్న అలా అప్పగింతలు పెడుతుంటే దుఃఖం తన్ముకొచ్చేసింది. బలవంతాన నిగ్రహించుకున్నాడు.

"అన్నయ్యా....నువ్వీ వృత్తిని వదిలేసి మాతోనే వుండిపో! ఆ సుల్తాన్ దగ్గరికి పోవద్దు. మనం రాత్రికి రాత్రే యీ వూరే వదిలేసి పోదాం. మనిద్దరం కష్టపడి యేదో పనిచేస్తే మన కడుపుకింత తిండి దొరక్కపోదు. నువ్వు వెళ్ళొద్దన్నయ్యా...."

"వీరేన్...." అన్న యేదో చెప్పబోయేంతలో తల్లి లేచిన అలికిడయ్యింది. రవీంద్ర దొంగలా నక్కి నక్కి బయటికి వెళ్ళి చీకట్లో కలిసిపోయాడు.

అదే తను అన్నను చివరిసారిగా చూడటం! మళ్ళీ శవరూపంలో....

వీరేంద్ర కళ్ళనుంచి వెచ్చటి కన్నీటిబొట్లు అతనితో ప్రమేయం లేకుండానే జలజల రాలిపోయాయి.

"సుల్తాన్....నిన్ను చంపి నా అన్న ఆత్మకు శాంతి

చేజూరుస్తాను!" మరోసారి దృఢంగా తనలో తాను ప్రతిజ్ఞ చేశాడు.

## 2

వీరేంద్ర రెండు రోజులు గా దీర్ఘాలోచనలో వున్నాడు. వేళకు తిండి నిద్ర లేవు. పగ....పగ.... ప్రతీకారం. ఇదే ఆలోచన. అతని అణువణువూ ప్రజ్వరిల్లి పోతోంది.

సుల్తాన్ ఎక్కడుంటాడు? ఎలా వుంటాడు? అతన్ని ఎక్కడని వెతకాలి? తన ప్రతీకారం ఎలా తీర్చుకోవాలి? ఓ. పక్క అన్న చివరసారిగా కోరిన కోరిక — తల్లినీ, చెల్లినీ జాగ్రత్తగా చూసుకోమని! మరోపక్క నరాల్ని కాల్చేస్తున్న ప్రతీకార జ్వాల. రెండిటికీ చుక్కెదురు. తన మనసు ప్రతీకారం వైపే మొగ్గుతోంది.

వీరేంద్రకో ఆలోచన తట్టింది. అన్నయ్య తాలూకు వస్తువుల్ని వెతికితే ఏమయినా సమాచారం దొరుకు తుందేమో చూడాలి! సుల్తాన్ గురించి ఏ చిన్న వివరం దొరికినా అది తన కెంతో ఉపకరిస్తుంది.

వీరేంద్ర అన్న దుస్తులున్న పెట్టెను వెతికాడు. అన్న తన స్వంత విషయాలంటూ యేవైనా వుంటే వాటిని ఆ పెట్టెలోనే దాస్తాడు. అతనికున్న ఏకైక ఆస్తి ఆ పాతకాలంనాటి ట్రంకు పెట్టె మాత్రమే!

పెట్టెలో వున్నవి రెండే రెండు జతల గుడ్డలు. అవి కూడా అక్కడక్కడ చిరుగుపట్టాయి. ఈమధ్య రవీంద్ర ఎక్కువ సమయం బయటే గడుపుతూ వేరే గుడ్డలు — ఖరీదయినవి — వేసుకుంటున్నాడు. అతనికవి యెలా వచ్చాయో అప్పుడర్థంకాలేదుగాని, రెండు రోజుల క్రితం అతనొచ్చిం తర్వాత అర్థమయింది.

పెట్టె అడుగున పాత న్యూస్ పేపరు కాగితం పరచి వుండటం గమనించాడు వీరేంద్ర. గుడ్డలకి యినప మరకలు పడకుండా వేసిన కాగితం అది! గుడ్డల్లో ఏమీ దొరక్క-పోవటంతో నిరాశ పడిపోయాడు వీరేంద్ర. చివరిగా, అడుగున పరచివున్న కాగితం కిందకూడా చూశాడు.

చిన్న స్లిప్ కనిపించింది. మడత పెట్టిన చిన్న కాగితం అది! దానిమీద ఎవరిదో అడ్రసు వుంది. పేరు చూశాడు. సుల్తాన్ కాదు.

ఎస్.బి. తివారి, నల్గొండ చౌరస్తా అని మాత్రంవుంది. వివరాలేం లేవు.

వీరేంద్ర చకచక బయటికొచ్చాడు. మధ్యాహ్నం రెండు గంటల సమయం. ఎండ ఫెళ్ళున కాస్తోంది. గాడ్పు వీస్తోంది. అవేమీ అతన్ని భయపెట్టలేదు.

"ఈ వేళప్పుడు ఎక్కడికిరా, కాస్త చల్లబడనివ్వు" అన్నది తల్లి అతను బయట వెళ్తుంటే.

వీరేంద్ర "ఇప్పుడే వచ్చేస్తానమ్మా!" అంటూనే రోడ్డెక్కాడు.

నిప్పులు చెరిగే ఎండలో నాలుగు కిలోమీటర్లు కాలి నడకన నడిచాడు రవీంద్ర. నల్గొండ చౌరస్తా చేరుకున్నాడు.

ఇప్పుడు ఈ పేరుగల వ్యక్తి గురించి ఆరాతియ్యాలి. చీకటి పనులు చేసే వ్యక్తి అయితే సాధారణంగా పేరు తెల్సుకోవటం కష్టం. అసలు పేరు ఒకటైతే దొంగ పేర్లు అనేకం వుంటాయి. తన అన్న పెట్లో దొరికిన కాగితంలో వున్న ఈ పేరు నిజమైనదో కాదో... అసలతనికి సుల్తాన్ వ్యవహారాలతో సంబంధమున్నదో లేక తను గాల్లో రాయి విసుర్తున్నాడో....?

సెంటర్లోని పాన్ షాపతన్ని, జనరల్ స్టోర్ యజమానిని, ఉడిపి హోటల్ ప్రొప్రయిటర్ని అడిగాడు. యెవరూ తనకు తెలియదన్నారు. చౌక దుకాణం వ్యక్తిని అడుగుదామనుకున్నాడు. కాని, యింతలోనే దాదాలా వున్న ఓ వ్యక్తి వీరేంద్రని అటకాయించాడు.

వీరేంద్ర అతనికంక చూసి ఉలిక్కిపడ్డాడు. అతను చాలా క్రూరంగా తనవంకే చూస్తున్నాడు.

"నీ పేరు రవీంద్ర కదూ...." అన్నాడు. మనిషి క్రూరంగా వున్నా గొంతు సన్నగా, కీచుగా వుంది.

వీరేంద్ర వెంటనే సమాధానం చెప్పలేదు. తన అన్న పేరు ఉచ్చరించిన ఆ వ్యక్తి తను వెతుకుతున్న తివారీ కాదు గదా! అప్పుడు గుర్తొచ్చింది వీరేంద్రకు—ఇందాక పాన్ షాపు దగ్గర తను తివారి గురించి అడిగినప్పుడు కారా కిళ్ళీ నములూ ఈ వ్యక్తి అక్కడ వున్నాడు. తను తివారి పేరు అడుగుతుంటే పరీక్షగా తనవంక చూశాడు. ఇప్పుడు రవీంద్ర పేరు చెపుతుంటే ఖచ్చితంగా యితను తనకు కావలసిన వ్యక్తే.

మళ్ళీ అదే ప్రశ్న వేశాడు. ఉర్దూలోనే అడిగాడు. హైదరాబాదులో పుట్టి బుద్ధెరిగినపప్పట్నుంచీ వుంటున్న వీరేంద్రకు ఉర్దూ బాగానే వచ్చును.

ఈసారి సమాధానం చెప్పాడు. "అవును, నే నే..."

"అయితే, నాతో రా!" అన్నాడతను ముందుకి నడుస్తూ. మౌనంగా అతన్ననుసరించాడు వీరేంద్ర.

చంచల్ గూడా జైలుపక్క నుంచి దారితీశాడతను. వీరేంద్ర అతన్ననుసరిస్తూనే వున్నాడుగాని, మెదడునిండా జోరీగల్లాంటి ఆలోచనలు తొలిచేస్తున్నాయి. ఇంతకీ ఎవరితను? ఇతను ఎస్.బి. తివారీయా? చూడబోతే ఇతను

ముస్లింలా వున్నాడు. ముస్లిమ్స్‌కి తివారీ అనే పేరుండదు. ఈ తరహా హిందూ-పాన్సంలో వాడుకలో వున్న పేరది!

దాదా ఓ పాడుబడ్డ యింటి ముందాగి వెనక్కి చూసి తలూపాడు రమ్మంటూ. వీరేంద్ర అతన్ని సమీపించాడు. పాడుబడ్డ యిల్లయినా, చాలా పెద్ద భవంతి అది! ఆలనాపాలనా లేక అలా వుంది. హైదరాబాదు నగరంలో అలాంటిచోట యిల్లు పాడుపెట్టరు. పాతది పోతే యీనాటికి పునాదులతో సహా పడగొట్టి ఆకాశ హార్మ్యం నిర్మించి వుండాలి! కాని, అలా జరగలేదు.

దాదా ముఖద్వారంమీద టన్‌టనే....టన్‌టనే.... అంటూ కోడ్‌వర్డులాగా సంకేత ధ్వనితో తలుపు తట్టాడు.

రెండు నిమిషాలు నిశ్శబ్దం. తర్వాత యెవరో నడిచి వచ్చిన అడుగుల చప్పుడు. తలుపుకి కుడివైపు పైభాగంలో అమర్చబడ్డ చిన్న చెక్క తొలగించి రెండు కళ్ళు బయటకి చూశాయి. తర్వాత తలుపు ఓరవాకిలిగా తెరవబడింది. ముందు దాదా, వెనుక వీరేంద్ర లోపలికి అడుగు పెట్టగానే తలుపు మూసుకున్నది.

వీరేంద్రలో ఆ క్షణంలో తెగింపు, ఏదో తెలియని మొండి ధైర్యం చోటు చేసుకున్నాయి. పులి బోనులోకి అడుగు పెడుతున్న భావన.

# 3

లోపలి కడుగు పెడుతూనే ఆశ్చర్యంతో విస్తుపోయి చూశాడు వీరేంద్ర. లోపలికి బయటకి అసలు పోలికే లేదు. బయట చవుకు రాలిపోతున్న గోడలు. లోపల సిమెంటులో దృఢంగా వున్న కోట బురుజాల్లాంటి గోడలు.

దాదా ముందుకి నడిచాడు. విశాలమైన వరండా, దాటగానే అధునాతనమైన గదులు అందంగా పెయింటుతో కళకళ్ళాడే గోడలు! లోపల ఓ ఇంద్రభవనం లాగా వుంది.

దాదా ఓ గది ముందర ఆగి కాలింగ్ బజర్ నొక్కాడు. చక్కటి సంగీత ధ్వనులు వినపించాయి.

"కమిన్ అఫ్జల్!" అని వినిపించింది.

దాదా తలుపు తెరచుకొని లోపలకు వెళ్ళాడు. వీరేంద్రవైపు రమ్మని సైగ చేశాడు.

లోపల ఓ కుషన్ చైర్లో విశాలమైన శాల్తీ కూచుని వున్నది. తలనుంచి కాళ్ళవరకు పోతపోసిన సిలిండర్లా వున్నాడతను. కళ్ళకు నల్ల కళ్ళద్దాలున్నాయి. ఎర్రగా సిద్దీలా వున్నాడు. చేతి వ్రేళ్ళకు వజ్రపుటుంగరాలున్నాయి. బాగా ఖరీదైన దుస్తులు ధరించి వున్నాడు.

"ఇతను మీ గురించి పబ్లిక్ ప్లేస్‌లో యెంక్వయిరీ చేస్తూంటే తీసుకొచ్చాను సాబ్!" అన్నాడు అఫ్జల్ ఉర్దూలో నే.

కుర్చీలోని వ్యక్తి తలాడించాడు.

"ఎవరు నువ్వు? నీ పేరేమిటి? నువ్వు నా గురించి యెందుకు ఎంక్వయిరీ చేస్తున్నావు?" అనడిగాడు.

తనెవరో అతనికి తెలియదని అర్థమైపోయింది వీరేంద్రకి. అఫ్జల్ తనని ట్రాప్ చేశాడు. అయినా ఫరవాలేదు. తను అమాయకుడిలా నటించాలి!

"నా పేరు వీరేంద్ర. మా అన్నయ్య అర్థాంతరంగా చనిపోయాడు. అతని పేరు రవీంద్ర. అతని పెట్లో మీ పేరు రాసివున్న కాగితం దొరికింది. మీరు మా అన్నయ్యా స్నేహితులై వుంటారని, మిమ్మల్ని కల్సుకుంటే ఏదైనా

పని చూపిస్తారని, మా ఇంటికో ఆధారం దొరుకుతుందని వచ్చాను. అదృష్టవశాత్తు మిమ్మల్ని కలుసుకోగలిగాను. మా అన్నయ్యకు యింత గొప్ప స్నేహితులున్నారని ప్రత్యక్షంగా తెలుసుకోగలిగాను" అన్నాడు వీరేంద్ర.

ఈ మాటలతో ఆ వ్యక్తి ముఖంలో వీరేంద్ర ఆశించిన మార్పు కనిపించింది.

"నేనే మీ అన్నయ్య స్నేహితుడని ఎలా అనుకున్నావు?" అనడిగాడా వ్యక్తి.

"ఎస్.బి. తివారీ మీరే అయితే మీరు మా అన్నయ్య స్నేహితులే! అతను మీ పేరున్న కాగితం పదిలంగా దాచుకున్నాడు. మీ గురించి యెంక్వయిరీ చేస్తూంటే యీాయన—అఫ్జల్ సాబ్—మీ దగ్గరికి సరాసరి తీసుకొచ్చాడు. కాబట్టి మీరే ఎస్.బి. తివారి."

ఆ వ్యక్తి మొహంలో చిరునవ్వు చోటుచేసుకుంది.

"ఎక్సెస్. యు ఆర్ రైట్! ఇంతకీ మీ అన్న ఎలా చనిపోయాడు?"

"ఏమో సార్. అప్పుడప్పుడు అన్నయ్యకు కడుపులో విపరీతమైన నొప్పి వస్తూండేది. కడుపులో ఏదో అల్సరుందని డాక్టర్లు చెప్పారు. అన్నయ్య అశ్రద్ధకారణంగా అది పగిలి చనిపోయి వుంటాడు. పొట్టనుంచి రక్తంకూడా వచ్చింది" అన్నాడు వీరేంద్ర అమాయకంగా చూస్తూ.

"కరెక్ట్! అదే అయ్యుండాలి. నేను కూడా చాలా సార్లు చికిత్స చేయించుకోమని చెప్పాను. అతను వినలేదు."

"పోనీండి. మాకు అదృష్టంలేదు. ఇన్నాళ్ళు అన్నయ్యే మా కుటుంబానికి జీవనాధారం."

"మీ అన్నయ్య ఇన్నాళ్ళు ఏం చేసేవాడు? అంటే,

ఏం పని చేస్తూండేవాడు?"

"ఏదో ప్రయివేట్ కంపెనీలో పని చేస్తూండేవాడు. రాత్రింబవళ్ళు కష్టపడుతుండేవాడు. సరైన తిండితిప్పలు వుండేవి కాదు. చనిపోయే ముందు వారంరోజులుగా కంపెనీ పనిమీద యెక్కడికో వెళ్ళాడు. తిరిగివస్తూ తెల్లవారుఝామున మా యింటిముందే పడిపోయాడు. అల్సరు పగిలి అప్పటికప్పుడే చనిపోయాడు."

"అయ్యో పాపం! మీ అన్నయ్య నాకు బాగా కావలసినవాడు. వయసులో మా యిద్దరికీ పదిహేనేళ్ళ తేడా వున్నా మా స్నేహం చెప్పుకోదగ్గది. నువ్వు నా దగ్గరకొచ్చి మంచి పని చేశావు...ఇంతకీ నువ్వు ప్రస్తుతం ఏం చేస్తున్నావు?"

"డిగ్రీ పూర్తిచేశాను. పైకి చదివే స్తోమత లేక ఆపేశాను. రెండేళ్ళుగా ఖాళీగా వుంటున్నాను. మీ రెలాంటి పని యిప్పించినా చేస్తాను."

"అలాగే యిప్పిస్తాను. కొన్ని రోజులు నువ్విక్కడే వుండి కొంత ట్రయినింగ్ అవాల్సి వుంటుంది."

"అలాగే. మీ రేం చెప్పినా చేయటానికి సిద్ధంగా వున్నాను. నా కుటుంబాన్ని పోషించాల్సిన బాధ్యత నామీద వుంది."

"ష్యూర్, ష్యూర్....అఫ్‌జల్, యితన్ని లోపలికి తీసుకు వెళ్ళి, సిరాజ్ కి అప్పగించు. ఇతని కేపని అప్పగించాలో అతను చూస్తాడు" అన్నాడు తివారి.

అఫ్‌జల్ వీరేంద్రని వెంటబెట్టుకొని లోనికి వెళ్ళిపోయాడు.

తివారి కొద్దిక్షణాలు మౌనంగా అలాగే కూచు

న్నాడు. ఆ తర్వాత వైర్‌లెస్‌వంటి సెట్‌ని ముందుకు లాక్కుని ఏదో అన్నాడు.

## 4

వీరేంద్రను ఓ గదిలో తీసుకువెళ్ళాడు అఫ్‌జల్. గది చాలా అందంగా వుంది. ఓ టేబుల్, కుర్చీ, ఓ ట్యూబ్యులర్ మంచం, దానిమీద పరుపు, సీలింగ్ ఫాన్, టి.వి. సెట్, ఫోన్, గోడల్లో అమర్చిన ఛానెల్ మ్యూజిక్ స్పీకర్లు—చాలా అధునాతనంగా, అందంగా వుంది గది.

"ఇది నీ గది!" అన్నాడు అఫ్‌జల్. కాలింగ్ బెల్ నొక్కాడు. బయట యెక్కడో సంగీత ధ్వనులు విని పించాయి. యూనిఫాంలో వున్న నౌకరు వచ్చాడు.

"సిరాజ్‌ని పిలు!" అన్నాడు అఫ్‌జల్ అధికార పూర్వకంగా!

నౌకరు వెళ్ళిన అయిదు నిమిషాలకి సన్నగా, పొడ వుగా వున్న ముప్ఫయ్యేళ్ళ వ్యక్తి అక్కడికొచ్చాడు.

"ఇతను వీరేంద్ర. ఇతను సిరాజ్" అని పరిచయాలు చేశాడు అఫ్‌జల్.

"బాస్ నీ కితన్ని అప్పగించమన్నాడు. నీవు ఇతనికే పని అప్పగిస్తావో నీ యిష్టం!" అని, వీరేంద్రవైపు తిరిగి "ఇకమీదట నీ అవసరాలు, నీ పనులు సిరాజ్ చూస్తాడు. బై" అని చెప్పి వెళ్ళిపోయాడు అఫ్‌జల్.

వీరేంద్రకి స్వర్గంలో వున్నట్టుగా వుంది. పాతబడ్డ ఆ భవనంలో యింత అత్యాధునికమైన గదులు, ఫర్నిచరు, ఎలక్ట్రానిక్ పరికరాలు, నౌకర్లు చాకర్లు సిబ్బంది— యిదంతా చాలా పెద్ద ముఠా అని గ్రహించాడు. తన అన్న ఎందుకు వీళ్ళకి అమ్ముడుపోయాడో శ్లేష్మంలోపడ్డ

యీగలా యిక్కడ్నుంచి యెందుకు బయటపడలేక పోయాడో అర్థమయింది. తను వీళ్ళని నమ్మినట్టు నటించి నమ్మించి, ప్రతీకారం తీర్చుకోవాలి!

"ఏమిటి ఆలోచిస్తున్నావు?" అన్నాడు సిరాజ్ సూటిగా వీరేంద్ర కళ్ళలోకి చూస్తూ. అతనివి పిల్లికళ్ళు. చాలా తీక్షణంగా యెదుటి మనిషి మనసుని ఎక్స్‌రే తీస్తున్నంత చురుగ్గా వున్నాయి.

"ఏం లేదు.... నేనడిగింది చిన్న ఉద్యోగం. కాని తివారిసాబ్ నాకింత ఖరీదైన గది వసతికోసం ఇచ్చారు. ఆయనెంత దయామయుడో కదా అని నాలో నేనే ఆనందపడి, ఆశ్చర్యపోతున్నాను" అన్నాడు వీరేంద్ర తన మనసులోని భావాలు ఏమాత్రం బయటికి ప్రకటితం కాకుండా జాగ్రత్తపడుతూ.

"దానిదేముంది? బాస్ నమ్మాలేగాని, చెయ్యలేనిది చెయ్యనిది ఏదీ వుండదు. తన దగ్గర పనిచేసేవాళ్ళంటే ఆయనకి చాలా యిష్టం."

"నేనే పని చేయాల్సి వుంటుంది?"

"నెమ్మదిమీద చెపుతాను. నువ్వేం చదువుకున్నావు."

"డిగ్రీ పూర్తిచేశాను."

"గుడ్....నీకు కొంత టెక్నికల్ వర్కు అప్పగిస్తాను. తర్వాత బాస్ సూచనల మేరకు నీ ఉద్యోగ బాధ్యతలు రూపాంతరం చెందుతుంటాయి."

"అలాగే....ఏమిటా టెక్నికల్ వర్క్?"

"నాతోరా" అన్నాడు సిరాజ్ గది బయటికి దారి తీస్తూ. వీరేంద్ర అతన్ననుసరించాడు.

సిరాజ్ పెద్ద హాల్లోకి తీసుకువెళ్ళాడు. అక్కడ టేబిల్సు పొడవుగా వేసివున్నాయి. వాటిమీద వైర్లెస్

సెట్లు, టి.వి. సెట్లలా వున్న సెట్స్, కీబోర్డు, టెలిఫోన్ ఎక్స్చేంజిలో వున్నట్లు వుంది. వైర్లు గజిబిజిగా కనెక్టు చేయబడ్డ నిలువెత్తు బోర్డు వున్నాయి.

వాటి పేర్లు, వాటినెలా ఆపరేట్ చేయాలో, మెసేజ్ నెలా రిసీవ్ చేసుకోవాలో, కోడ్, అండ్ డీకోడ్ అంటే యేమిటో, వివరంగా చెప్పుకుంటూ పోతున్నాడు సిరాజ్. వీరేంద్ర శ్రద్ధగా ఆలకించాడు. అనుమానాలు వస్తే వెంటనే నివృత్తి చేసుకుంటున్నాడు.

అలా రెండు మూడు గంటలు గడిచాక, "ఈ రోజుకి చాలు. రాత్రికి విశ్రాంతి తీసుకో. రేపు మరికొన్ని విషయాలు చెప్తాను" అన్నాడు సిరాజ్.

వీరేంద్ర తలూపి వెళ్ళిపోయాడు తనకి ఎలాట్ చేసిన గదిలోకి. అక్కడ సిరాజ్ మాత్రం మిగిలాడు.

వైర్లెస్‌లో ఏదో మెసేజ్ వస్తూన్న సూచనగా బీప్....బీప్....మన్న శబ్దం వచ్చింది.

సిరాజ్ రిసీవ్ చేసుకున్నాడు. అవతలనుంచి తివారి మాట్లాడుతున్నాడు.

"ఎట్టి పరిస్థితుల్లోను మన గురించిన రహస్యాలు బయటికి పొక్కకూడదు. వీరేంద్రని అనుక్షణం కనిపెట్టి చూడమని మనవాళ్ళకి చెప్పు. అతనేదైనా కూపీలాగటానికొచ్చినట్లు అనుమానం వస్తే వెంటనే కాల్చి నుసి చేసెయ్యి. నాకు తర్వాత తెలియపర్చినా చాలు. ఓ.కే!?"

"ఓ.కే. బాస్" అన్నాడు సిరాజ్.

"మెసేజ్ ఓవర్" అన్నాడు తివారి.

గదిలోకి తిరిగి వచ్చిన వీరేంద్ర మంచంమీద కూచుని ఆలోచిస్తున్నాడు. అతనికి చాలావరకు పరిస్థితి అర్థమయ్యింది. వీళ్ళు చాలా పెద్ద ఎత్తున ఏదో అక్రమ

వ్యాపారం—స్మగ్లింగ్ కన్న పెద్దదేదో చేస్తున్నారు. పకడ్బందీగా జరుగుతోందది. బయటి ప్రపంచానికి తెలియకుండా, ఎలక్ట్రానిక్ పరికరాల ద్వారా వార్తా ప్రసారం జరుగుతోంది.

బహుశా తన అన్నకు వీళ్ళ పూర్తి రహస్యాలు తెలిసే వుంటాయి. పోలీసులకి పట్టుబడిపోతే వాటిని బయట పెట్టేస్తాడేమోనని నిర్దాక్షిణ్యంగా అతన్ని చంపేశారు. తను ఈ ఉద్దేశ్యంతో వచ్చినట్టు ఏమాత్రం అనుమానం వచ్చినా తక్షణం తననీ చంపేస్తారు.

తను మాత్రం తొందరపడకూడదు. పొరపాటు దొర్లనీయకూడదు. పూర్తి అమాయకుడిలా నటించాలి. సుల్తాన్ గురించి నెమ్మదిగా తెలుసుకోవాలి. తన అనుమానమే నిజమయితే తివారీకి, సుల్తాన్‌కి సంబంధముండి తీరుతుంది!

## 5

మర్నాడుదయం సిరాజ్ వచ్చి వీరేంద్రని తీసుకుని హాల్లోకి వెళ్ళాడు. వేళ తప్పకుండా వీరేంద్రకి కావలసిన సదుపాయాలన్నీ యూనిఫాండ్ నౌకర్లు అమర్చి పెడ్తున్నారు.

వీరేంద్ర సిరాజ్ చెప్పిన విషయాలని శ్రద్ధగా విన్నాడు. పొరపాటునకూడా, అక్కడ ఏం జరుగుతోందనిగాని, ఆ ఎలక్ట్రానిక్ పరికరాలతో ఏం చేస్తారని గాని ప్రశ్నించలేదు వీరేంద్ర. వాళ్ళు చెప్పింది వినటమే తన ఉద్యోగంలాగా, అంతకన్న తనకి ముఖ్యమైనదేదీ ప్రపంచంలో లేదన్నంత శ్రద్ధగా విన్నాడు సిరాజ్ చెప్పిన సాంకేతికపరమైన సూచనలు, సలహాలు.

రెండు రోజుల తర్వాత సిరాజ్ వీరేంద్ర భుజంతట్టి,

"రికార్డు బ్రెయిన్‌లో టెక్నికల్ నాలెడ్జి సంపాదించావు. ఐ అప్రిషియేట్ యూ!" అన్నాడు.

"థాంక్స్!" అన్నాడు వీరేంద్ర.

"ఇక నీవు పోయి విశ్రాంతి తీసుకో!" అన్నాడు సిరాజ్. వీరేంద్ర వెళ్ళిపోయాక వైర్లెస్ ఆన్ చేసి తివారీతో మాట్లాడాడు.

"అతను పూర్తిగా నమ్మకస్తుడు. మనమీద నిఘా వేయటానికి రాలేదు. నేను ఈ మూడు రోజులుగా బాగా అబ్జర్వ్ చేశాను. అతనికి రహస్యాలు చెప్పటంవల్ల ప్రమాదంలేదు. తెలివైనవాడే! కాని అమాయకుడు. నమ్మవచ్చును" అన్నాడు.

తివారి, "శభాష్, నీ పరిశీలనమీద నాకు పూర్తి విశ్వాసముంది. నేను కూడా రహస్యంగా అతన్ని వాచ్ చేస్తున్నాను. అతను తన గదిలో ప్రతి క్షణం ఎలా మూవ్ అవుతున్నాడో మూవీ కెమెరా నిర్విరామంగా ఫిల్మ్‌తీసి నా గదిలోని విడియో సెట్‌మీద ప్రొజెక్ట్ చేస్తోంది. అనుమానించదగ్గ వ్యక్తి కాదు. మన సీక్రెట్ మెసేజెస్ డీకోడ్ చేయటానికి అతన్ని ఉపయోగించు రేపట్నుంచి" అన్నాడు.

అక్కడే తివారి పప్పులో కాలేశాడు. ఆ తర్వాత అతను ఆ తప్పును సరిదిద్దుకోవాలన్నా అతని చేతుల్లో లేకుండా పోయింది. వీరేంద్ర మెదడు అతి ప్రతిభావంతమైన కంప్యూటర్ అనీ, అందులో రికార్డయిన ప్రతి విషయం తన పతనానికి ఒకో గొయ్యి తీస్తుందన్న నిజం గ్రహించలేక పోవటం తివారిచేసిన పెద్ద పొరపాటు!

మర్నాటి నుంచి వీరేంద్ర తివారీకి వచ్చే మెసేజెస్ చాలా శ్రద్ధగా రికార్డుచేస్తూ వచ్చాడు. వాటిని డీకోడ్

చేసినపుడు యిన్నో అసక్తికరమైన, ఆశ్చర్యకరమైన విషయాలు, అతి రహస్యమైన విషయాలు తెలిశాయి.

అయితే ఆతన్ని ఆ పనికి నియోగించే ముందు సిరాజ్ ఖచ్చితంగా చెప్పాడు. "నువ్వికమీదట మీ యింటికి వెళ్ళటానికి వీలుండదు. మరీ అవసరమైతే మీ వాళ్ళనే యిక్కడికి రప్పిస్తాం. లేదా మరోచోట సమావేశ పరుస్తాం. నువ్వు వాళ్ళతో మాట్లాడే సమయంలో మేమెవరమో తప్పకుండా వుంటాం. వాళ్ళని చూడాల్సిన పనేం లేదంటే మరీ మంచిది. నీ జీతం పూర్తిగా మీ వాళ్ళకు అందజేయబడుతుంది. నీ కిక్కడ భోజన వసతి సదుపాయాలన్నీ ఉచితం!"

వీరేంద్ర అంగీకారంగా తలూపి, "నాకింత గొప్ప ఆదరణ లభిస్తుందని కల్లోకూడా ఊహించలేదు. బాస్‌కి ఋణపడి వున్నాను" అన్నాడు.

ఇదంతా తివారి విడియోలో చూసి సంతృప్తి చెందాడు.

ఆ క్షణం నించే వీరేంద్ర మనసులో స్థిరంగా నిర్ణయించుకున్నాడు. తివారి చేస్తూన్న విద్రోహక చర్యల్ని సంఘ విద్రోహ కార్యకలాపాల్ని తన ప్రాణం బలిచేసి అయినా సరే బయటి ప్రపంచానికి తెలియచెయ్యాలి. తివారిని ప్రభుత్వానికి అప్పగించాలి!....అయితే అతను తన ప్రధాన ఆశయమైన సుల్తాన్ మీది ప్రతీకారం గురించి ఏ క్షణంలోను మరచిపోలేదు.

త్వరలోనే అతనికి సుల్తాన్‌ని ముఖాముఖి చూసే అవకాశం దొరికింది.

ఆ రోజు వైర్లెస్ మెసేజ్‌ని రికార్డు చేస్తూండగా పక్కనున్న మరో సెట్‌నించి అర్జంట్ మెసేజ్ అంటూ

వార్త వచ్చింది. దాన్ని రిసీవ్ చేసుకున్నాడు.

అది సుల్తాన్ నించి వచ్చింది. అరేబియన్ దేశాలనుంచి ఖరీదైన వజ్రాలు వచ్చాయి. వాటిని కొనుగోలు చేసి రహస్యంగా అక్కడికి చేరవేయటానికి తగిన యేర్పాట్లు చేయవలసిందిగా తివారీకి తెలియజేయమని!

సమయానికి సిరాజ్, అఫ్జల్, యింకా ముఖ్యమైన కొంతమంది అనుచరులు బంగారం బిస్కట్స్ బోంబే తీసుకువెళ్ళాల్సి వెళ్ళారు. స్థావరంలో తివారి, వీరేంద్ర, తక్కిన పరిచారక బృందం మాత్రమే వున్నారు. అవతల కోట్లరూపాయల విలువచేసే వ్యాపారం! నమ్మకస్తులైన వాళ్ళు లేరు!

ఇంటర్ కంలో తివారికి సుల్తాన్ మెసేజ్ గురించి చెప్పాడు వీరేంద్ర. తివారి కొద్ది క్షణాల్లోనే నిర్ణయం తీసుకున్నాడు.

"నువ్వు వెంటనే సుల్తాన్‌ని కలుసుకో! అతనేం చెయ్యాల్సిందీ చెపుతాడు. హోటల్ ఎంపైర్‌లో రూం నంబర్ ఎయిటీ ఎయిట్‌లో సుల్తాన్ నీ కోసం యెదురు చూస్తూంటాడు. వెళ్ళి కల్సుకో!" అన్నాడు తివారి.

"అలాగే సాబ్!" అన్నాడు వీరేంద్ర.

"అతనెలా వుంటాడో నీకు తెలుసా?" అడిగాడు తివారి.

వీరేంద్ర జరిగిన పొరబాటుని వెంటనే సరిదిద్దుకుని, "రూం నంబర్ చెప్పారు, హోటల్ పేరు చెప్పారు, ఆ మాత్రం వివరాలు చాలు నాకు. అవసరమైతే మీరే చెపుతారని నాకు తెలుసు. అందుకే ప్రశ్నించలేదు!" అన్నాడు.

"గుడ్ మేనర్స్! ఐ లైక్ ఇట్" అంటూ సుల్తాన్ ఆకార

లక్షణాల గురించిన వివరాలు చెప్పి, "అతను నిన్న ఇదివరకే వీడియోలో చూశాడు. ఇక్కడ జరిగే ప్రతి విషయం సుల్తాన్ కెప్పటికప్పుడు తెలుస్తుంది. అతను మనకి అత్యంత ఆప్తుడు. శ్రేయోభిలాషి. వెంటనే బయల్దేరు!" అన్నాడు తివారి.

వీరేంద్ర బయల్దేరుతుండగా తివారి హెచ్చరించాడు.

"మనవాళ్ళు నీకు తెలియకుండా నిన్ను అనుక్షణం అనుసరిస్తూ వుంటారు. ఇక్కడి విషయాలు నువ్వు యెవరికైనా చేరవేయాలని ప్రయత్నిస్తే దానికి వెంటనే ఫలితమనుభవిస్తావు!"

"నామీద నమ్మకం లేదా సాబ్!" అన్నాడు అమాయకంగా వీరేంద్ర.

"నేను మనుషుల్ని నమ్మతాను. పరిస్థితుల్ని నమ్మను. పరిస్థితులు మనిషిని మార్చేస్తాయి" అన్నాడు తివారి వేదాంతిలాగా.

## 6

హోటల్ ఎంపైర్‌లో ఎనభై ఎనిమిదో నంబర్ రూం ముందు నిల్చుని కాలింగ్ బజ్జర్ నొక్కాడు వీరేంద్ర.

తలుపులు తెరిచిన వ్యక్తికేసి వంక పరీక్షగా చూశాడు వీరేంద్ర. ఆరడుగుల విగ్రహంతో పోతపోసిన కంచు విగ్రహంలా వున్నాడు. నైలెక్స్ బనియన్‌ను పాంటులోకి టక్ చేసుకుని, పైన వెడల్పాటి బెల్టు పెట్టుకున్నాడు. చూడగానే నరరూప రాక్షసుడిలాగా కనిపిస్తున్నాడు.

కళ్ళముందు నిలిచిన తన ప్రత్యక్ష శత్రువుని పరీక్షగా చూశాడు వీరేంద్ర. నిర్దాక్షిణ్యంగా తన అన్నను చంపిన

హంతకుడు! ప్రస్తుతం ఈ హోటల్ గదిలో ఒంటరిగా దొరికాడు.

'చంపెయ్యి' అంటూ మనసు తొందర పెడుతుంటే 'ఇది అనువైన సమయం, సందర్భంకాదు. వేచి చూడు' అని వివేకం హెచ్చరించింది.

సుల్తాన్ వీరేంద్రని నఖశిఖపర్యంతం పరిశీలనగా చూశాడు. "కమిన్" అన్నాడు ద్వారానికి అడ్డుతొలిగి. వీరేంద్ర లోనికి రాగానే తలుపు మూశాడు.

"నువ్వేనా వీరేంద్ర?" అన్నాడు సుల్తాన్.

వీరేంద్ర తలూపి, "ఔను" అన్నాడు.

"నీ అన్న పాపం అకస్మాత్తుగా చనిపోయాడటగా!" అన్నాడు సుల్తాన్ యథాలాపంగా.

వీరేంద్ర గదిని పరిశీలనగా చూస్తూ సుల్తాన్ ప్రశ్నలకు అటెంటివ్‌గా సమాధానాలిస్తున్నాడు.

గదిలో ఫర్నిచర్ చాలా అందంగా ఖరీదుగా వుంది. డ్రెస్సింగ్ టేబిల్ మీద నిగనిగ మెరుస్తోన్న రివాల్వర్ వీరేంద్ర దృష్టిని ఆకర్షించింది. దాన్ని చూడగానే ప్రతీకారం వెన్నుతట్టింది. ఒక్క క్షణంలో దాన్నందుకుని సుల్తాన్‌ని కాల్చెయ్యగలడు. కాని సుల్తాన్‌ని అలా చంపటం తనకిష్టంలేదు. తన అన్నను చంపినవాడ్ని ఒక్కొక్క కాలు, ఒక్కొక్క చెయ్యి తొలగిస్తూ చిత్రహింసచేసి చంపాలి. ఒకేసారి ప్రాణం తీసేస్తే ఎలా? తను ప్రతీకారం తీర్చుకుంటున్న సంగతి అతనికి అర్థమయ్యేలా చెప్పి మరీ చంపాలి!

సుల్తాన్ వీరేంద్రతో మాట్లాడ్తూనే రివాల్వర్ చేతిలోకి తీసుకుని, మేగజైన్ తెరిచాడు. డ్రాయర్ సొరుగులోనుంచి బుల్లెట్ తీసి ఒక్కొక్కటే లోడ్ చేశాడు.

తిరిగి రివాల్వర్‌ని టేబిల్ మీద నే పెట్టాడు.

"నిల్చుండిపోయావేం, అలా కూచో!" అన్నాడు సుల్తాన్.

వీరేంద్ర సోఫాలో కూచున్నాడు. "ఏం తీసుకుంటావు? హాట్ డ్రింకా, సాఫ్టా?" అన్నాడు సుల్తాన్.

"కాఫీ చాలు" అన్నాడు వీరేంద్ర. ఫోనెత్తి "రెండు కాఫీ" చెప్పాడు సుల్తాన్.

"డబ్బు తెచ్చావా?" అడిగాడు సుల్తాన్.

వీరేంద్ర తనవెంట తెచ్చిన బ్రీఫ్ కేస్‌ని సుల్తాన్‌కందించాడు. సుల్తాన్ దాన్ని తెరిచాడు. లోపల నోట్ల కట్టలు వరసగా పేర్చబడి వున్నాయి. వీరేంద్ర ప్రాణం లేని ఆ నోట్లవంక నిర్లిప్తంగా చూస్తున్నాడు.

"ఈ డబ్బు పట్టుకుని పారిపోవాలనిపించలేదా నీకు?" అన్నాడు సుల్తాన్ నవ్వుతూ.

వీరేంద్ర చురుగ్గా చూశాడతనివంక. "ద్రోహబుద్ధి నా రక్తంలోనే లేదు. అందులో డబ్బున్న సంగతి నాకిప్పటిదాకా తెలియదు. తెలిసినా నాలో యెలాంటి మార్పూ వచ్చి వుండేదికాదు. అన్నం పెట్టే చెయ్యిని నరికే తత్వంకాదు నాది" అన్నాడు.-సుల్తాన్ నవ్వేశాడు.

"వెరీ గుడ్. మాక్కావలసింది నీలాంటి నమ్మకస్తులే. ఐ లైక్ యువర్ సిన్సియారిటీ" అన్నాడు ఈ మాటలు చెపుతూనే బాత్ రూంకి వెళ్ళాడు.

రివాల్వర్ టేబిల్ మీద అలాగే వున్నది. వీరేంద్ర కళ్ళు దానిమీద నే వున్నాయి. అతనికి అకస్మాత్తుగా తట్టింది—కావాలనే సుల్తాన్ రివాల్వర్‌ని తనకి అందుబాటులో వుంచుతున్నాడని! తను నిజంగా భుక్తికోసం తివారి దగ్గర చేరాడో, లేక పగ సాధించడానికో

తెలుసుకోవటానికి ప్రయత్నిస్తున్నాడు సుల్తాన్ — తనే మాత్రం బయటపడకూడదు. అవకాశం రాకపోదు. అప్పుడు తన విశ్వరూపం చూపించాలి!

సుల్తాన్ కావాలనే ఆలస్యంగా బయటికొచ్చాడు. అతనొచ్చేవరకు న్యూస్ పేపరు చదువుతూ అలాగే కూచున్నాడు వీరేంద్ర.

"పద, వెళ్దాం!" అంటూ రివాల్వర్ పేంటు జేబులో పెట్టుకుని బ్రీఫ్ కేసు మరో చేత్తో పట్టుకుని గది బయటకు దారితీశాడు సుల్తాన్.

రోడ్ మీది కొచ్చాక టాక్సీ పిలిచాడు సుల్తాన్.

కూకట్ పల్లి పోనివ్వమన్నాడు డ్రయివర్ తో.

కూకట్ పల్లి చేరాక రోడ్ మీద దిగిపోయి ఫేర్ చెల్లించి "కొంతదూరం నడవాలి" అన్నాడు సుల్తాన్ వీరేంద్రతో.

తలూపాడు వీరేంద్ర. దాదాపు పది నిమిషాల నడక తర్వాత ఓ యింటి ముందాగాడు సుల్తాన్. బాగా పాత యిల్లు. గోడలు సున్నం మొఖం మాసి చాన్నాళ్ళయి నట్టున్నాయి. చిన్న పెంకుటిల్లు.

వీరేంద్ర మనసులో తివారి పాత భవనం మెదిలింది. వీళ్ళు కావాలనే యిలాంటి పాత యిళ్లు తమ స్థావరాలుగా యెన్నుకుని లోపల యింద్రభవనాలని కట్టుకున్నారు. బహుశా యిదికూడా తివారి స్థావరంలాంటిదే నేమో!

సుల్తాన్ తలుపుమీద కోడ్ శబ్దం చేశాడు. తలుపు కిర్రుమంటూ తెరుచుకున్నది. సుల్తాన్ లోపలికి అడుగు పెట్టాడు.

వీరేంద్ర వూహించినట్టు లోపల ఆధునికంగా లేదు.

రెండే గదులున్నాయి. అవికూడా చవుడు రాలిపోతున్నట్టు అసహ్యంగా వున్నాయి.

ఓ గదిలో యిద్దరు అరేబియన్స్ కూచుని షాంపేన్ సేవిస్తున్నారు వాళ్ళిద్దరుకాక మరో వ్యక్తి వున్నాడు. సుల్తాన్‌ని చూసి ఆ వ్యక్తి వినయంగా తలవంచి అభివాదం చేసి అరేబియన్స్‌కి పరిచయం చేశాడు. అరేబియన్స్ ఇద్దరు తలలు వంచి గుండెల మీదికి చేతులు చేర్చి అభివాదాలు చేశారు.

బ్రీఫ్‌కేసుని ముందుకి చాపాడు సుల్తాన్. వాళ్ళు తమ పక్కనే వున్న బ్రీఫ్‌కేసుని సుల్తాన్‌కి అందించారు. అచ్చం తను తెచ్చిన బ్రీఫ్‌కేసులాంటిదే అది! వీరేంద్ర మౌనంగా పరిశీలిస్తున్నాడు. అవసరానికి వాడుకుంటున్న సలహేగాని, అది వీళ్ళ స్థావరం కాదని అర్థమయ్యిందతనికి.

సుల్తాన్ వారి గౌరవార్థం ఓ గ్లాసు అందుకుని షాంపేన్ సేవించి వారివద్ద సెలవు తీసుకుని బయటికొచ్చేశాడు. కనీసం బ్రీఫ్‌లో యేముందో సుల్తాన్ తెరవలేదు. అరేబియన్స్ కూడా తను తెచ్చిన బ్రీఫ్ తెరవలేదు. అంటే దృఢమైన నమ్మకంతో జరిగే వ్యాపారం! కోట్ల రూపాయల దొంగ వ్యాపారం. దేశద్రోహం!

వీరేంద్ర రక్తం సలసల మరిగింది.

బయటికి రాగానే పోతున్న ఆటో ఆపాడు సుల్తాన్.

"హోటల్ ఎంపైర్!" అన్నాడు సుల్తాన్.

హోటల్ దగ్గర ఆటో దిగారిద్దరు. సుల్తాన్ తన గదికి నడిచాడు, వీరేంద్ర వెంటరాగా. అంతదాకా బ్రీఫ్‌కేసు సుల్తాన్ తనతోనే వుంచుకున్నాడు.

హోటల్ రూం చేరగానే. "నేనిక వెళ్తాను. బ్రీఫ్

ఇవ్వండి" అన్నాడు వీరేంద్ర.

సుల్తాన్ వికటంగా నవ్వి, "ఇవ్వను. ఏం చేస్తావ్?" అన్నాడు.

వీరేంద్ర ఆశ్చర్యపోయాడు.

"నేను తివారి సాబ్ కి అందచెయ్యాలి. అప్పటికిగాని నా కప్పగించిన పని పూర్తికాదు. ప్లీజ్ ....ఇవ్వండి."

"ఇది నీ కివ్వను. నువ్వెళ్లొచ్చు."

"బ్రీఫ్ కేసు లేకుండా వెళ్ళటం జరగదు."

"ఏం చేస్తావ్?"

"అది తీసుకునే వెళ్తాను."

"అది నీతరంకాదు."

"సారీ, బలప్రయోగం చేయాల్సి వస్తుంది."

"అంత మొనగాడివా.." సుల్తాన్ నోటినుంచి మాట లింకా పూర్తిగా బయటకు రానేలేదు. వీరేంద్ర అతని చేతిమీద, రెండు చేతుల్ని బిగించి ఆయుధంలాగా చేసి బలంగా మోదాడు.

సుల్తాన్ చేతినుంచి బ్రీఫ్ ఎగిరి దూరంగా పడింది. సుల్తాన్ తేరుకునేలోపల అతని మెడమీద మళ్ళీ రెండు చేతులు బిగించి గట్టిగా మోదాడు వీరేంద్ర.

సుల్తాన్ తూలబోయి నిలదొక్కుకున్నాడు కోపంగా చేతులు చాకులా చేసి వీరేంద్రమీదికి ఉరికాడు. అప్పటికే వీరేంద్ర బ్రీఫ్ చేతిలోకి తీసుకుని ఒక్క అంగలో తలుపు దగ్గరికి ఉరికాడు.

సుల్తాన్ తన దగ్గరకు చేరుకునేలోపల తలుపు తెరిచి బయటకి మాసుకుపోయాడు. లిఫ్ట్ లో కిందికి దిగి, రోడ్ మీదికి చేరుకుని, పోతున్న ఆటో ఆపి యెక్కాడు.

పదిహేను నిమిషాల తర్వాత అతను వజ్రాలున్న బ్రీఫ్ కేసుతో తివారిముందు నిలబడ్డాడు.

## 7

"వెల్‌కం మైడియర్ వీరేంద్రా! నీ స్వామి భక్తి అమోఘం, అపూర్వం! నా మనిషి అనికూడా లెక్క చేయకుండా సుల్తాన్‌కి బుద్ధి చెప్పి నీ కప్పగించిన బాధ్యత విజయవంతంగా నెరవేర్చావు. హేట్సాఫ్ టు యూ!" అన్నాడు తివారి వీరేంద్ర అందించిన బ్రీఫ్ యెడమ చేతితో అందుకుని, కుడిచేత్తో వీరేంద్రతో గాఢంగా కరచాలనం చేస్తూ.

వీరేంద్రకి తెలుసు. సుల్తాన్ కావాలనే తనని పరీక్షించటానికి తనతో గొడవ పెట్టుకున్నాడని. తను సిన్సియర్ అనిపించుకోవటానికి సుల్తాన్‌తో ఉత్తుత్తి ఫైట్ చేసినట్టు సుల్తాన్‌గాని, తివారిగాని అనుమానించలేని విధంగా నటించిన విషయం వాళ్ళకు తెలీదు.

"సుల్తాన్ యిప్పుడే మెసేజ్ ద్వారా అక్కడ జరిగిన విషయం తెలియచేశాడు. నిన్ను టెస్టుచేయటానికే నిన్ను రెచ్చగొట్టాడట. నీకు కంగ్రాట్స్ చెప్పమన్నాడు. నువ్వంటే ఇప్పటికిగాని సుల్తాన్‌కి గురికుదర్లేదు."

"అదేమిటి సాబ్, నేను యెలాంటి వాడినో మీకు తెలీదా? సుల్తాన్‌కి నామీద అనుమానమా?"

"అనుమానం కాదు. నమ్మకం పూర్తిగా యేర్పడితే నీకింకా ముఖ్యమైన పనులు నిస్సంకోచంగా అప్పచెప్పగలం. అందుకే సుల్తాన్ చిన్న టెస్టు చేశాడు."

"ఓహ్, బ్రిలియంట్ అయిడియా!" మెచ్చుకున్నట్టుగా నటించాడు వీరేంద్ర.

"వెల్ మైడియర్. వెళ్ళి పూర్తిగా విశ్రాంతి తీసుకో.

మంచి భోజనం నీకోసం యెదురుచూస్తోంది. టేక్ మీల్స్ అండ్ రెస్టు!" అన్నాడు తివారి.

వీరేంద్ర తన గదిలోకి వెళ్ళాడు.

భోంచేసి విశ్రాంతిగా మంచంమీద వాలాడు వీరేంద్ర. అతన్ని ఆలోచనలు తేనెటీగల్లా ముసిరాయి. ఇప్పటివరకు తను సాధించిందేమీ లేదు—ఓ స్మగ్లింగ్ నేరం తన చేతులమీదుగా కమిట్ చేయటంతప్ప! అందుకు తన మనసంతో క్షోభకు గురవుతున్నా భరించాడు. తన ధ్యేయం నెరవేరాలంటే ఇంకా కొన్నాళ్ళు తనకీ రంపపుకోత తప్పదు.

వీరేంద్రకి మెరుపులాంటి ఆలోచన వచ్చింది. లేచి తివారి గదివైపు నడిచాడు. కాలింగ్ బజర్ మీద చేయి వేయబోతుండగా "కమిన్ మై బోయ్!" అన్న తివారి పిలుపు వినిపించింది.

తన చర్యల్ని అతనెంత జాగ్రత్తగా గమనిస్తున్నాడో అర్థమయ్యింది వీరేంద్రకు.

తలుపు తోసుకుని లోనికి వెళ్ళాడు.

తివారి కుర్చీలో విశ్రాంతిగా కూచుని వున్నాడు. నవ్వుతూ వీరేంద్రవైపు చూశాడు.

వీరేంద్ర కొద్ది క్షణాలు మౌనంగా అతనివైపు చూశాడు. తర్వాత మెల్లగా, భయపడుతున్నట్టు అన్నాడు. "అమ్మనీ, చెల్లాయినీ చూడాలనిపించింది."

"ఓస్, అంతేనా? వాళ్ళకి చెప్పకుండా వచ్చావా?"

"అవును. మిమ్మల్ని కల్సుకుని వెంటనే వెళ్ళిపోవాలనుకున్నాను. ఇక్కడే వుండిపోవలసి వచ్చింది."

"సిరాజ్ చెప్పాడనుకుంటాను; ఇక్కడికొచ్చాక బయటి ప్రపంచంతో—ముఖ్యంగా తన వాళ్ళు అనుకున్న

వాళ్ళతో—సంబంధాలు తెంచుకోవాల్సి వుంటుందని!"

"చెప్పాడు. నేను వెళ్ళను. వాళ్ళనొక్కసారి ఇక్కడో, మరోచోటనో కల్సుకునే అవకాశం కలిగిస్తే చాలు!"

"అందుకు నా కభ్యంతరం లేదు, కాని, ఎట్టి పరిస్థితులోను రహస్యాలు పెదవి దాటి రాకూడదు. అఫ్‌కోర్స్, నువ్వు మాట్లాడే ప్రతి చిన్న విషయం రికార్డయిపోతుందనుకో! మరుక్షణం నీ శరీరంలో ప్రాణాలుండవు."

"తెలుసు సాబ్. నేను మాటతప్పే మనిషిని కాదు. చేజేతులా ప్రాణాలు పోగొట్టుకోలేను."

"దట్స్ గుడ్! నీకింకా నావద్ద పెద్ద ఉద్యోగమిస్తాను. లాభాల్లో నీకు పర్సంటేజికూడా కల్పించాలనుకుంటున్నాను. సుల్తాన్‌తో సమాన హోదా నిస్తాను."

"ధాంక్యూ సాబ్. మీ విశ్వాసం చూరగొంటాను."

"హోటల్ ఎంపైర్‌లోనే రూం నంబర్ సిక్స్టీ ఎయిట్‌లో రేపు ఉదయం పది గంటలకు నువ్వు మీ వాళ్ళని కల్సుకోవచ్చు. వాళ్ళకి యెలాంటి హానీ కలక్కుండా మావాళ్ళు అన్ని జాగ్రత్తలు తీసుకుంటారు. తీసుకొచ్చి మళ్ళీ జాగ్రత్తగా ఇంట్లో దిగపెడతారు. సరేనా....?"

"ధాంక్యూ వెరీమచ్ సాబ్. కృతజ్ఞణి!"

వీరేంద్ర తన గదికొచ్చేశాడు.

# 8

మరునాడు ఉదయం ఎంపైర్ హోటల్లోని రూం నంబర్ అరవై ఎనిమిదికి వీరేంద్ర బయల్దేరి వెళ్ళాడు. అతనితోబాటు తివారి పంపిన మనిషి వెళ్ళాడు.

హోటల్ గదిలో తల్లి, చెల్లెలుగాక, మరో ఇద్దరు

తివారి మనుషులున్నారు. ఏర్పాట్లన్నీ చాలా పకడ్బందీగా చేశాడు తివారి.

వీరేంద్రని చూడగానే, "ఇన్నాళ్ళు చెప్పకుండా ఎక్కడికి పోయావు బాబూ! మాకు కంటికి నిద్రలేదు నువ్వు వెళ్ళినప్పట్నుంచి తిండికూడా సయించటంలేదు. నీ అన్న అర్థాంతరంగా పోయి నా కడుపులో చిచ్చు పెట్టాడు. నువ్వు చూడబోతే అకస్మాత్తుగా మాయ మయ్యావు. యెలా వున్నావురా తండ్రీ!" అంటూ కొడుకును కావలించుకుని ఏడ్చినంత పనిచేసింది వీరేంద్ర తల్లి భ్రమరాంబ.

చెల్లెలు వాణి ఆప్యాయంగా అన్నను పలకరించింది. ఆమె కళ్ళనుంచి ఆనందబాష్పాలు!

"నిన్ను మళ్ళీ చూడగలనో లేదోనని భయపడ్డానురా అన్నాయ్!" అన్నది ఆనందంగా.

తల్లిని, చెల్లిని చూడగానే వీరేంద్రకు కూడా కళ్ళు చెమ్మగిల్లాయి.

"నేను క్షేమంగానే వున్నానమ్మా. మంచి ఉద్యోగం దొరికింది. అన్నయ్య స్నేహితుడొకాయన సాయం చేశాడు" అన్నాడు చాలా క్లుప్తంగా వీరేంద్ర.

గదిలో వున్న ముగ్గురు మనుషులు అతని ప్రతిచర్యా వేయి కళ్ళతో గమనిస్తున్నారని వీరేంద్రకు తెలుసు. అంతేకాదు, ఈ గదిలో తివారి ఎలక్ట్రానిక్ సంబంధాలు కలిగివుంటాయని కూడా తెలుసు. ఏ మాత్రం తను తొందర పడినా మొదటికే మోసం వస్తుంది.

వచ్చేముందు తివారి తన తల్లికి యివ్వమని రెండువేల రూపాయలిచ్చాడు వీరేంద్రకు.

వీరేంద్ర అందరూ చూస్తూండగానే యిరవై వంద

రూపాయల నోట్లను లెక్కించి తల్లి చేతికిచ్చాడు.

"ఈ డబ్బు నా నెల జీతం అమ్మా! ప్రతి నెలా మీకు రెండువేల రూపాయలు అందచేస్తాను. ప్రతిసారీ నేను రావటం కుదరదు. ఎవరిచేతనైనా పంపిస్తాను" అన్నాడు వీరేంద్ర.

భ్రమరాంబకు, వాణికి ఆనందంతో నోట మాట రాలేదు. నెలకి రెండువేల జీతం! యెంత అదృష్టం! భ్రమరాంబకు రవీంద్రపోయిన దుఃఖం సాసే ఆనందం చోటు చేసుకుంది. తన కొడుకు ప్రయోజకుడయ్యాడు. తమ కష్టాలు గట్టెక్కాయి.

వాణి అన్నయ్య వంక ఆరాధనగా చూస్తోంది.

"మీరిక వెళ్ళిరండమ్మా! నాకు అర్జంటు పను లున్నాయి" అన్నాడు వీరేంద్ర వెళ్ళడానికి లేచినించుని.

భ్రమరాంబకు అప్పుడే వెళ్ళాలనిపించటంలేదు. కొడుకుతో తనివితీరా మాట్లాడుకోవాలని వుంది. వాణికి కూడా అన్నయ్యతో యెన్నో చెప్పాలని వుంది. కాని ఆ గదిలోని పరిచయంలేని ముగ్గురు మొరటు మనుషులు తమని పరీక్షగా, పరిశీలనగా చూడటంతో ముళ్ళమీద నించున్నట్టుందా మెకు.

వీరేంద్ర తివారి మనుషులవంక చూసి, "మా అమ్మ గారిని, చెల్లాయిని జాగ్రత్తగా ఇంట్లో దించిరండి" అన్నాడు.

"ఎంతమాట సాబ్. అలాగే. మీరు చెప్పాలా?" అన్నారు వాళ్ళు. వీరేంద్రతో ఫాలో అయిన వ్యక్తి వీరేంద్ర వంక సాభిప్రాయంగా చూశాడు.

"వెళ్దాం పద!" అన్నాడు వీరేంద్ర.

భ్రమరాంబ, వాణి ఆ ఇద్దరు వ్యక్తులతోను "మేం

వెళ్ళాగలం!" అని చెప్పినా, వాళ్ళు "మేము తోడువచ్చి దిగబెడతాం అమ్మా! అయ్యగారి ఆజ్ఞ పాటించాలి!" అన్నాడు వినయంగా.

వీరేంద్ర కూడా చెప్పినమీదట భ్రమరాంబ, వాణి వాళ్ళతో వెళ్ళిపోయారు.

## 9

"మీ వాళ్ళను చూసివచ్చావనుకుంటాను. ఎవ్విరిథింగ్ ఓ.కే....!?" అన్నాడు తివారి యెదురొచ్చి.

వీరేంద్ర చిరునవ్వుతో తలూపాడు. "ధాంక్యూ సాబ్ మీ మేలు మరవను" అన్నాడు.

తివారి చిన్నగా నవ్వి, "నేను చాలా అర్జంటు పని మీద బయటికి వెళుతున్నాను. ఓ అరగంటలో తిరిగొస్తాను. మెసేజ్ యేదయినా వస్తే నువ్వే యిన్‌చార్జ్. సిరాజ్, అఫ్‌జల్ ఇంకా రాలేదు" అన్నాడు.

"ఓ.కే. సాబ్. మీరు వెళ్ళిరండి" అన్నాడు వీరేంద్ర.

తివారి వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత వీరేంద్ర చకచక తను అనుకున్న కార్య క్రమాన్ని అముల్లో పెట్టేశాడు.

తన గదికొచ్చి తలుపు మూసి బల్బువేశాడు. గది గోడలు, అల్మాయిరా వెతికి, మూవింగ్ కెమెరా పెట్టిన స్థలం కనిపెట్టాడు. రెండు గోడలు కలిసే జంక్షన్ స్థలంలో బోలుగా కనిపించింది. గోడ లోపల్నుంచి కనపడీ కనపడకుండా లెన్స్ కనిపించింది.

సన్నపాటి గీతలాగా నలుచదురంగా కనిపించింది. షేవింగ్ సెట్‌లోనించి బ్లేడుతీసి గీతల వెంట కోశాడు. నలుచదురం చెక్కముక్క చేతిలోకి వూడివచ్చింది. మని

పర్సు సైజులో వున్న కెమెరా బయటికి తొంగిచూసింది. దానితోబాటు ఎన్నో వైర్లు, మైక్రోఫోన్, అన్నీ బయట పడ్డాయి.

వీటి సహాయంతో ఈ గదిలో జరుగుతున్న ప్రతి విషయమూ తివారి గదిలో వున్న టి.వి. తెరమీద ఫోకస్ అవుతున్నదని అర్థమయింది వీరేంద్రకు. వాటిని తెంచేశాడు. ఇప్పుడు ఈ గదిలో జరుగుతున్న విషయాలు బయటి ప్రపంచానికి తెలిసే ప్రమాదంలేదు.

వీరేంద్ర తను యెప్పటికప్పుడు డీకోడ్ చేసిన మెసేజ్ స్ తాలూకు కాపీలను ఆ గదిలోని బాత్ రూం గోడపైన టాయిలెట్ వాటర్ టాంక్ వెనుక దాచి వుంచాడు. అది బయటకు తీశాడు. మూవీ కెమెరాలో అదంతా ఫిల్ముతీశాడు. ఆ తర్వాత ఆ ఫిల్ముని కెమెరాలోంచి బయటికి తీశాడు.

పూర్తిగా ప్రోసెస్ అయిపోయిన ఫిల్ము బయటి కొచ్చింది. అది చాలా పవర్ ఫుల్ కెమెరా! అప్పటి కప్పుడే ఫిల్ము డెవలప్ కావటం, ప్రింటుకూడా తయారు కావటం అంతా ఆటోమాటిక్ గా కెమెరాలోని ప్రోసెసింగ్ పూర్తయింది. వీరేంద్ర "హాట్స్ ఆఫ్ టు ఎడ్వాన్స్డ్ టెక్నాలజీ!" అనుకున్నాడు మనసులో.

ఫిల్ముఠోల్ ని భద్రంగా లోపల దాచుకున్నాడు. బొడ్డుకింద పాంటు పిలు చుట్టూ లైనింగ్ లాగా చుట్టుకున్నాడు. గుడ్డలు విప్పేసినా బయటకి ఫిల్ము కనపడనంత కట్టుదిట్టంగా దాచుకున్నాడు.

ఈ ఫిల్మ్ ఠోల్ ఒక్కటి చాలు—తివారికి ఉరిశిక్ష విధించటానికి! ఈ ఫిల్ము బయటి ప్రపంచానికి వెల్లడయితే ప్రజలే తివారిని రాళ్ళతో కొట్టికొట్టి చంపేయగలరు.

ప్రభుత్వమే అక్కర్లేదు.

తివారి చాలా భయంకరమైన సీక్రెట్ ఏజెంట్. దేశ వ్యవహారాలకు సంబంధించిన ఎన్నో రహస్యాలని శత్రు దేశాలకి చేరవేస్తున్నాడు. అందుకోసం అతను ఎంతో పకడ్బందీగా ఎలక్ట్రానిక్ మెషీన్లను ఉపయోగించుకుని తనకెంతో నమ్మకస్తులైన వారిని అనుయాయులుగా చేసుకుని ఇంటర్నేషనల్ బిజినెస్ చేస్తున్నాడు. స్మగ్లింగ్ అందులో ఓ భాగం మాత్రమే!

తివారి ప్రస్తుతం తాతా బిర్లాలకంటె కూడా ఎన్నో కోట్లకు అధిపతి.

వీరేంద్ర ఒక్కక్షణం కూడా ఆలస్యం చెయ్యకుండా చకచక ఎలక్ట్రానిక్స్ పరికరాలున్న గదిలోకి వెళ్ళాడు. సాధారణంగా అతన్నెవరూ అనుమానించరు. అందుచేత అతనికి ఎలాంటి ఆటంకాలు ఎదురుకాలేదు. ప్రతిరోజూ అతనా హాల్లోనే డ్యూటీ చేసేది!

హాలు పక్కనుంచి వేర్వేరు గదులకి దారి వుంది. హాలు తలుపులు దగ్గరగా వేసి అవతలి పక్క తలుపులు తెరిచి గదులవైపు నడిచాడు వీరేంద్ర.

అక్కడ ఓ అనుచరుడు కాపలా వున్నాడు.

వీరేంద్రని చూసి ఆశ్చర్యంగా ముందు కడుగువేసి ఏదో అడగబోయాడు.

వీరేంద్ర మెరుపు వేగంతో అతనిమీద కెగిరి తన్నాడు. ఆ అనుచరుడు వెల్లకిలా నేలమీద పడిపోయాడు. పక్క వున్న గన్ అందుకోబోయాడు. వీరేంద్ర చువ్వలా లేచి గన్ తనే అందుకుని దాని మడమతో అతని తలమీద గట్టిగా మోదాడు.

అనుచరుడు కిక్కురుమనకుండా తల వాల్చేశాడు.

వీరేంద్ర ఆ గదిలోకి వెళ్ళాడు. లోపల నాలుగు ఐరన్ సేఫ్‌లున్నాయి. వాటి తాళాలు తెరవటం అసాధ్యం! వాటిలో గోల్డ్ బిస్కట్సుగాని, కరెన్సీగాని వుండొచ్చునని ఊహించాడు వీరేంద్ర. అనుచరుడ్ని ఆ గదిలోకి లాగేసి బయటనుంచి తలుపు గడియపెట్టేశాడు.

మరో గదిలోకి వెళ్ళాడు. దాన్నిండా గన్స్, రివాల్వర్స్, బుల్లెట్స్ బల్లలమీద పేర్చి వున్నాయి. ఓ మూలగా హేండ్ గ్రెనెడ్స్ మొదలయిన ఎక్స్‌ప్లోజివ్స్ అట్టపెట్టెల్లో వున్నాయి. ఓ రివాల్వర్ తీసి లోడ్ చేసుకున్నాడు.

వీరేంద్ర ఆ గదిలో అంత మందుగుండు సామాను వుంటుందని కల్లోనైనా వూహించలేదు.

మూడో గదిలోకి వెళ్తుండగా వెనకనుంచి ఎవరో వస్తూన్న అలికిడి వినిపించింది. తల తిప్పేలోపల ఎవరో అతన్ని వెనకనుంచి గట్టిగా వాటేసుకున్నారు.

వీరేంద్ర ప్రమాదాన్ని శంకించి చటుక్కున శరీరాన్ని వంచి అతని పట్టునుంచి లాఘవంగా తప్పించుకుని రెండు చేతుల్ని ఆయుధంలా మడిచి అతని మెడమీద కత్తివాటులాగా వేశాడు.

అతను నేలమీద కుప్పకూలిపోయాడు. జేబునించి రివాల్వర్ తీసి మడమతో గట్టిగా రెండుసార్లు అతని తల మీద కొట్టాడు. మరో గంటన్నర వరకు అతనికి స్పృహ రాదు. వీరేంద్ర ఆ అనుచరుడ్ని ఆయుధాలున్న గదిలోకి నెట్టి బయట గడియపెట్టేశాడు.

మూడో గదిలో టెలిఫోన్ ఎక్స్ఛేంజిలో వుండే స్విచ్‌బోర్డు. దానినుంచి వేర్వేరు గదుల్లోకి కనెక్షన్స్

వున్నాయి. ఓ పక్కగా టేబిల్ మీద వైర్లెస్ సెట్సు న్నాయి. దాదాపు హాల్లో వున్న ఎలక్ట్రానిక్ పరికరాలు అన్నీ అక్కడే వున్నాయి.

ఆ గదిలో నుంచి పక్క గదిలోకి దారి వుంది. తలుపు తోశాడు. వెంటనే తెరుచుకున్నది. ఆ గదిలోకి అడుగు పెడుతూనే ఆశ్చర్యంతో నోట మాటరాలేదు వీరేంద్రకు.

ఆ గది తివారీది!

నిజానికి అది తను పనిచేసే హాలుకి ఆ పక్కగా వుంటుంది. ఈ గదుల్లోకి తివారి గదికి దారి వున్నదన్న నిజం మొదటిసారిగా అప్పుడే తెలిసిందతనికి.

అయితే అంతకన్న ఆశ్చర్యపరచిన విషయం మరొక టున్నది!

అది—గుడ్డలున్న అల్మయిరా. గాడ్రెజ్ అల్మయిరా. హేంగర్స్‌కి తగిలించిన సుల్తాన్ వేసుకునే నైలెక్స్ బని యన్స్, పాంట్సు, అతను పెట్టుకునే వెడల్పాటి బెల్టు—అల్మయిరాలో వేలాడుతున్నాయి. అల్మయిరా తలుపులు తివారి మూయటం మరచిపోయినట్టున్నాడు!

ఓ అరలో తివారి వేసుకునే ఖరీదైన సిల్కు లాల్చీ, కుర్తాలు వరసగా పేర్చి వున్నాయి.

మరో అరలో మధ్యగా—ఖరీదైన స్లాక్స్, పాంట్సు వున్నాయి.

సుల్తాన్ గుడ్డలు తివారీ అల్మయిరాలో ఎందుకున్నట్టు? ఫ్లాష్ వెలిగింది వీరేంద్ర మస్తిష్కంలో.

తను నిన్న సాయంత్రం సుల్తాన్‌తో పెనుగులాడినప్పుడు అతని తల హోటల్ గది తలుపుకి కొట్టుకుంది. బొప్పి కట్టేటంత గట్టిగానే కొట్టుకున్నది.

తను తివారీ స్థావరానికి వచ్చి బ్రీఫ్‌ని అతని కందించే

టప్పుడు గమనించలేదు గాని, తర్వాత తల్లిని చెల్లెల్ని చూడాలని వుందన్న విషయం చెప్పటానికి వెళ్ళినపుడు తివారి నుదుటిమీదున్న బొప్పిని స్పష్టంగా చూశాడు. అయితే అప్పుడు దాని కంత ప్రాధాన్యత నివ్వలేదు.

కాని, ఇప్పుడు సుల్తాన్ డ్రస్సు తివారీ అల్మయిరాలో చూడగానే అనుమానం నివృత్తి అయిపోయింది.

అయితే తివారి, సుల్తాన్ ....?

చిరునవ్వు వెలిగింది వీరేంద్ర పెదాలమీద.

తివారి యిందాకా యీ గదిలోనించి బయటకి రావటం తాను చూడలేదు! అంటే, యీ గదిలో నుంచి ఏదో సొరంగమార్గమో, మరో రహస్య మార్గమో వుండి వుండాలి!

తన ఊహే నిజమయితే....?

ఈ ఆలోచన రాగానే యిక ఆలస్యం చేయలేదు వీరేంద్ర. గోడల్ని తడిమాడు.

అతని ప్రయత్నం పదినిమిషాల తర్వాత ఫలించింది అల్మయిరా వెనకనున్న గోడ కొంచెం పక్కకి జరిగింది. రెండడుగుల వెడల్పు, ఆరడుగుల ఎత్తు వున్న ఓ ద్వారం ఏర్పడింది.

వీరేంద్ర వాచ్ చూసుకున్నాడు. తివారి అరగంటలో వస్తానని చెప్పి వెళ్ళాడు. ఇరవై అయిదు నిమిషాలయింది. ఇంక అయిదు నిమిషాల్లో తిరిగి రావచ్చు!

వీరేంద్ర ఆ ద్వారం గుండా ముందుకి నడవసాగాడు. సన్నగా పొడవుగా వున్నది దారి! లోపల లైట్లు వెలుగుతున్నాయి. దారి స్పష్టంగా కనిపిస్తోంది.

వీరేంద్ర రివాల్వర్ తీసి చేత్తో పట్టుకున్నాడు. ఏ క్షణంలోనైనా ఊహించని ప్రమాదం ఏ రూపంలోనైనా

వచ్చి మీద పడొచ్చునని అతని సిక్స్త్ సెన్స్ చెపుతోంది.

కాషన్ గా నడుస్తున్నాడు. ఓ అయిదు నిమిషాలు నడిచాక పైకి మెట్లు కనిపించాయి. మెట్లెక్కాడు. తల పైన ఏదో చెక్కతలుపున్నట్టు తోచింది. పక్కకి తోశాడు. సర్రున గోడలోకి వెళ్ళిపోయింది.

పైన మనిషి చాలా సునాయాసంగా ప్రవేశించగల బిలం లాంటి ద్వారం ఏర్పడింది.

అతను పైకొచ్చాడు. అది అత్యాధునికమైన గది!

తలెత్తి చూసిన వీరేంద్ర చేష్టలుడిగి అలాగే నించుండి పోయాడు.

ఎదురుగా రివాల్వర్ సూటిగా వీరేంద్రను గురిచేసి వక్రంగా నవ్వుతున్నాడు సుల్తాన్!

# 10

"వెల్ మైడియర్ ఫ్రెండ్! నువ్వింత గుండెలు తీసిన బంటువని గ్రహించలేక పోవటం నాదే పొరపాటు. నీ అన్నను నమ్మినట్టే నిన్నూ నమ్మాను. కాని, నువ్వు ఇంతకు తెగిస్తా వనుకోలేదు."

"నా అన్నను నువ్వే చంపావని నాకు తెలుసు మిస్టర్ సుల్తాన్ ఉరఫ్ తివారీ!" ధైర్యంగా అతని కళ్ళలోకి చూస్తూ అన్నాడు వీరేంద్ర.

"ఓహ్! నేనే తివారీనని గ్రహించావన్న మాట. తెలివైనవాడవే! అయితే మరో సంగతి నీకు తెలియదు. అది నేను చెపుతున్నాను విను. ఈ గది నీకు పరిచయమైన హోటల్ ఎంపైర్ లోని ఎనభై ఎనిమిదో నంబర్ రూం. అది నువ్వు గ్రహించే వుంటావు. నీ ఊహాకందని మరో నిజం చెపుతున్నాను— నేనే హోటల్ ప్రొప్రయిటర్,

అరవింద్ లాల్ జలానీ. ఇది నా అసలు పేరు. ఈ సంగతి కూడా తెల్సుకుంటే నువ్వు ఆనందిస్తావని చెప్పాను. ఇక దేవుడ్ని స్మరించుకో! నీకు రెండే నిమిషాలుంది ఆయూ రాద్యం! ఒన్ ....టు...." సుల్తాన్ అంకెలు లెక్కించటం మొదలెట్టాడు.

సుల్తాన్ కంట పడకుండా అంతదాకా దాచిన రివాల్వర్ మెరుపులా బయటకి తీసి అతని చేతికి గురిచూసి కాల్చాడు వీరేంద్ర.

సుల్తాన్ చేతిలోని రివాల్వర్ ఎగిరి గోడకి తగిలి ఖంగున శబ్దం చేసి కిందపడింది.

సుల్తాన్ చేతినుంచి రక్తం కారోంది.

"రాస్కెల్! నిన్ను కనికరించకూడదు" కింద పడ్డ రివాల్వర్ అందుకోవటానికి ఒంగుతున్నట్టు నటించి, వీరేంద్ర కాళ్ళకు తన కాళ్ళను పెనవేసి అతన్ని కింద పడేశాడు సుల్తాన్.

ఆ అదుటుకు వీరేంద్ర చేతిలోని రివాల్వర్ ఎగిరి దూరంగా పడింది. వీరేంద్ర గాయపడిన సుల్తాన్ చేతి మీద రెండు చేతులు బిగించి మోదాడు.

బాధతో మెలికలు తిరిగిపోయాడు సుల్తాన్. అదే అదనుగా కాళ్ళతో అతని డొక్కల్లో తన్నాడు వీరేంద్ర.

సుల్తాన్ భారీ శరీరం మెలికలు తిరిగింది బాధతో. ఈ సారి అతని మొహంమీద చేతులను మడిచి బాదాడు వీరేంద్ర. సుల్తాన్ ముఖం పగిలింది. ముక్కునించి ధారా పాతంగా రక్తం కారింది.

సుల్తాన్ లేవబోతున్న వీరేంద్రను ఎడమచేతో అతని తలను తన గుండెల కదిమిపట్టి లేవకుండా చేయటానికి

ప్రయత్నించాడు. అతనిది ఉడుంపట్టు. తప్పించుకోవటం వీరేంద్రకు ఓ పట్టాన సాధ్యం కాలేదు!

వీరేంద్రకు తెలిసిన విద్య కండరాల్ని కుంచించటం! అదే చేశాడు. చువ్వలా ఒంగాడు. సుల్తాన్ పట్టు సడలింది. ఆ కాస్త అవకాశం చాలు వీరేంద్రకు.

మెరుపు వేగంతో లేచాడు. ఒక్క అంగలో రివాల్వర్స్ అందుకున్నాడు. రెండు చేతుల్లోను రివాల్వర్స్ పట్టుకున్నాడు. అతను నరసింహావతారం దాల్చిన విష్ణుమూర్తిలా వున్నాడు.

"మిస్టర్ సుల్తాన్ ఉరఫ్ తివారీ అలియాస్ అరవింద్ లాల్ జలానీ—గెటప్! లేచి నించో. నీ ఆఖరి క్షణాలు సమీపించాయి. నీ ఆయుర్దాయం యిక రెండే రెండు నిమిషాల్లో తీరిపోతుంది. నా అన్నను నిర్దాక్షిణ్యంగా కాల్చి చంపినందుకు నిన్నిప్పుడు కుక్కను కాల్చినట్టు కాలుస్తాను. నా రివాల్వర్ లో అయిదు, నీ రివాల్వర్ లో ఆరు—మొత్తం పదకొండు బుల్లెట్లున్నాయి. నీ శరీరమంతా కాలినుంచి తలవరకు పదకొండు తూట్లు చేస్తాను వీటితో. చచ్చావా సరే, లేక బతికి బయటపడితే అక్కడితో నిన్నొదిలేస్తాను. నా ప్రతీకారం, నా పగ, చల్లారుంది. బస్ గెట్ రెడీ! వన్ ....టూ....లే, లేచి నిల్చో.

"....అదీ....అ గోడవారగా నించో....పిచ్చి వేషాలు వెయ్యకు. ఒకటి కాదు రెండు రివాల్వర్సు....నా గురి ఎంత తీక్షణమయిందో నువ్వు ప్రత్యక్షంగా చూశావు. కమాన్ ....దేవుడ్ని స్మరించుకో!" వీరేంద్ర చేతి వేళ్ళు రివాల్వర్స్ మీద బిగుసుకుంటున్నాయి.

ఇంతలో బిలబిలమంటూ రహస్య మార్గంనుంచి పోలీ

సులు మెట్లెక్కి ఆ గదిలోకి వచ్చేశారు. ముందుగా ఇన్స్పెక్టర్ చూశాడు కాల రుద్రుడిలా కనిపిస్తున్న వీరేంద్రను.

"మిస్టర్. స్టాపిట్!....అతన్నెలా శిక్షించాలో మేం చూసుకుంటాం!" అన్నాడు ఇన్స్పెక్టర్.

ప్రతీకారం తీర్చుకునే అవకాశం తప్పిపోయినందుకు నిరాశపడిపోయాడు వీరేంద్ర.

పోలీసుల వెనకనే వీరేంద్ర తల్లి భ్రమరాంబ, చెల్లెలు వాణి లోపలికొచ్చారు.

వాణి చెప్పింది: "అన్నయ్యా! మాకిచ్చిన వంద రూపాయల నోట్లలో ఓదానిమీద పోలీసుల్ని తీసుకుని చంచల్ గూడా రమ్మని నువ్వు రాసిన వాక్యాలు అల స్యంగా నా కళ్ళబడ్డాయి. లేకుంటేయింత క్రితమే వచ్చి వుండేవాళ్ళం!" అని.

ఇన్స్పెక్టర్ వీరేంద్రవైపు ప్రశంసగా చూసి, "థాంక్యూ మిస్టర్! మీరు చేసిన మహోపకారం ప్రభుత్వం గుర్తిస్తుంది! మీకు రాష్ట్రపతి అవార్డు తప్పక లభిస్తుంది" అన్నాడు.

—:అయిపోయింది:—

# భద్రకాళి

## టెంపోరావ్

వెంకట్రావు ఆమె కారువైపు రెండు నెలల నుంచి చూస్తున్నాడు. కారును స్పీడుగా పోనిస్తూ, సడెన్ బ్రేక్‌తో ఆమె కారును ఆఫీసు ముందు ఆపుతుంది. వయ్యారంగా నడుస్తూ ఆమె ఆఫీసులోకి వెళ్తుంది.

వెంకట్రావుకి నాలుగేళ్ళ క్రితం పెళ్ళయిపోయింది. మేనత్తకూతుర్ని పెళ్ళాడాడు. స్టెనో టైపిస్టుగా ఒక కంపెనీలో పనిచేస్తున్నాడు.

కాని అతడి జీవితం తృప్తికరంగా సాగడంలేదు. పెళ్ళాం ఎక్కువగా చదువుకోలేదు. తను బి.ఏ. పాసయ్యాడు. ఉద్యోగం ఎక్కడా దొరక్క టైపింగ్, షార్టుహేండ్ నేర్చుకున్నాడు. అటుపైన స్టెనో టైపిస్టుగా వుద్యోగం సంపాదించగల్గాడు. జీతం బాగానే వస్తోంది. కాని డబ్బు ఆనందాన్నివ్వలేదు!

ఆరోజు ఆదివారం. ఆమె కార్లోంచి దిగి హోటల్ పిక్నిక్‌కి వెళ్ళింది. అతడు వుషారుగా లోపలకు నడి

చాడు. ఎక్కడా కుర్చీలు ఖాళీగా లేవు. ఆమె కూర్చున్న చోట ఒక కుర్చీ ఖాళీగా వుంది. ధైర్యంచేసి అతడామె టేబుల్ వైపు నడిచాడు. ఆమె కెదురుగావున్న కుర్చీలో కూర్చున్నాడు.

ఆమె మొహాన్ని పక్కకు తిప్పుకుంది, విసుగ్గా.

"క్షమించండి! పొమ్మంటే పోతాను" అన్నాడతను.

ఆమె నవ్వింది.

"ఈ హోటల్ నా ప్రాపర్టీ కాదు. కూర్చోండి!" అందామె.

"నా పేరు వెంకట్రావు!" అన్నాడతను.

"మంచి పేరు!" అందామె.

తన పేరు చెప్పలేదు!

బాయ్ వచ్చి ఆమె ముందు కొన్ని ప్లేట్లు పెట్టాడు. ఆమె తినడం ప్రారంభించింది. అతడివైపు చూడ్డం లేదామె!

తనకేం కావాలో అతడు బాయ్‌తో చెప్పాడు.

"టైమెంత?" అడిగాడతను.

"మీ వాచ్ నడవడం లేదా?" అడిగిందామె.

"ఫాస్టుగా పోతోంది" అన్నాడతను.

"ఆరూ నలభై" అందామె, అతడివంక చూడకుండా.

అరగంటసేపూ యిద్దరూ యెదురెదురుగా కుర్చీలో కూర్చున్నారు. అరగంట గడిచేసరికి వాళ్ళు స్నేహితులు అయిపోయారు.

"మీరు ధనవంతుల బిడ్డలా వున్నారు!" అన్నాడతను.

ఆమె తీయగా నవ్వింది.

"డబ్బు మనుషులను విభజించకూడదని నా ఆశయం" అందామె.

"మిమ్మల్ని మెచ్చుకొంటున్నాను" అన్నాడతను.

"రిక్షావాలా సినిమా చూశారా? అందులో ఒక కోటీశ్వరుని కూతురు రిక్షావాలాని ప్రేమిస్తుంది" అంది ఆమె.

"పదిసార్లు చూశాను" అన్నాడతను.

"అందులో మీకు ఏం నచ్చింది?" అంది ఆమె.

"హీరోగా నటించిన మధుకుమార్ నటన" అన్నాడతను.

"మధుకుమార్ నా తండ్రి!" అంది ఆమె.

అతడు వులిక్కిపడ్డాడు. మధుకుమార్ కోటీశ్వరుడు. గత ముప్ఫయి ఏళ్ళనుంచి అతడు సినిమాల్లో నటిస్తున్నాడు. అతడి వయస్సు 60 ఏళ్ళు దాటినా నటిస్తూనే వున్నాడు.

మధుకుమార్ హైద్రాబాద్‌లో స్టూడియో కట్టించాడు. ఇంతవరకూ నాలుగువందలు చిత్రాల్లో అతడు నటించాడు.

"మీ నాన్న చాలా గొప్ప యాక్టర్!" అన్నాడతను.

"నాన్న జీవితంలో కూడా నటిస్తాడు. గ్రేట్ యాక్టర్!" అంది ఆమె.

ఇద్దరి బిల్లూ ఆమె చెల్లించింది.

వెంకటావు ఆమెతో కారుదాకా నడిచాడు.

"కూర్చోండి, కావలసినచోట మిమ్మల్ని దింపేస్తాను" అంది ఆమె.

"ఎందుకు మీకా శ్రమ?"

"శ్రమ నాకేముంది? కారుకుంటే వుండొచ్చు!" అంది ఆమె నవ్వుతూ.

అతడు ముందు సీటులో కూర్చుని తలుపు మూశాడు. స్టీరింగ్ వీల్ వెనక కూర్చొని ఆమె కారును పోనిచ్చింది.

"బీచ్‌కి వెళ్దామా?" అంది ఆమె.

"పదండి" అన్నాడతను.

ఆమె కారును వేగంగా పోనిచ్చింది.

## 2

బీచ్ లోపల రోడ్డుమీద ఆమె కారు ఆపింది. ఇద్దరూ దిగి సముద్రంవైపు నడిచారు. కెరటాల హోరు విపరీతంగా వుంది.

ఒక పడవ ప్రక్కనే వాళ్ళు కూర్చున్నారు. కెరటాలు హోరు చేస్తూ ముందుకొచ్చి వెనక్కుపోతున్నాయి.

వెంకట్రావు సముద్రంవైపు చూసి ఆమెకేసి తిరిగాడు. సరైన జీవితం యిదే అనిపించింది అతడికి!

అతడామె చెయ్యిని పట్టుకున్నాడు. మెల్లిగా పైకెత్తి ముద్దెట్టుకున్నాడు.

"ఐ లవ్ యూ!" అన్నాడతను.

"నీకు పెళ్ళి కాలేదా?" అడిగిందామె.

"నాకింకా పెళ్ళికాలేదు" అన్నాడతను.

"నన్ను పెళ్ళాడ్తావా?" అంది ఆమె.

"పెళ్ళాడ్తాను" అన్నాడతను.

"రేపు మా యింటికి రా!" అంది ఆమె.

ఆమె అడ్రసు చెప్పింది.

"వస్తాను. ఎన్నింటికి?"

"ఆరు తర్వాత" అంది ఆమె.

"నా ఆఫీసునుంచి తిన్నగా నీ యింటికి వస్తాను"

అన్నాడతను.

ఇసుకలో ఆమె పడుకుంది. పక్కనే అతనూ పడుకున్నాడు. ఆమె ఎర్రటి పెదిమలవైపు ఆత్రంగా చూశాడు. కాని ఆమెలో చలనంలేదు.

చేతుల్తో ఆమెను చుట్టేశాడు.

"తొందర పడకు!" అంది ఆమె.

"నీ పేరు చెప్పలేదు!" అన్నాడతను.

"నా పేరు రాజేశ్వరి" అంది ఆమె.

"చక్కటి పేరు" అన్నాడతను.

వేళ్ళను నిముర్తూ అతడామెవైపు చూశాడు. చంద్రకాంతిలో ఆమె కళ్ళు మెరుస్తున్నాయి. పాంటు, స్లాక్‌లో వుందామె. సన్నటి నడుముకు తెల్లటి బెల్టును బిగించింది. ఎడంచేతికున్న ఖరీదైన వాచ్ తళ తళ మెరుస్తోంది.

అమాంతంగా పెద్ద కెరటం వాళ్ళవైపు దూసుకొచ్చింది.

"రాజీ, గెటప్!" అరిచాడతను, పైకి లేస్తూ.

ఆమె లేచేలోపల కెరటం ఆమెమీద నుంచి వెళ్ళి పడకు కొట్టుకుని నురగలు కక్కుతూ వెనక్కి తరలింది. సముద్రపు నీళ్ళలో ఆమె తడిసిపోయింది.

కాని ఆమె లేవలేదు. తడి యిసుకలో అలాగే పడుకుని వుంది. తన రుమాల్తో ఆమె ముఖాన్ని తుడిచాడు.

"మరోచోట కూర్చుందాం, లే!" అన్నాడతను.

"డోంట్ బాదర్! తడిసే హాయిగా వుంది. ఇంటికెళ్ళాక స్నానం చెయ్యొచ్చు" అంది ఆమె.

తడి యిసుకలో ఆమె పక్కనే కూర్చున్నాడతను.

"నీ తండ్రి ఎక్కడున్నారిప్పుడు?"

"నాన్న ఎప్పుడూ తిరుగుతూ వుంటాడు, ఎక్కడెక్కడో షూటింగ్ సాగుతూ వుంటుంది" అంది ఆమె.

"నువ్వు ఇక్కడ ఒంటరిగా వుంటున్నావా?" అడిగాడతను.

"మా యింట్లో అరడజన్ నౌఖర్లు వున్నారు. ఇరవై నాలుగ్గంటలూ వాళ్ళు అక్కడే వుంటారు" అంది ఆమె.

"వాళ్ళు నన్ను నీ యింట్లోకి రానిస్తారా?" ప్రశ్నించాడతను నవ్వుతూ.

ఆమె కిలకిల నవ్వింది.

"వచ్చి నువ్వే చూస్తావుగా!" అంది ఆమె.

ఆమె టైమ్ చూసింది. తటాలున లేచి నిలబడింది.

"నాన్న ఫోన్ చేస్తాడు తొమ్మిదింటికి, వెళ్ళాలి" అంది ఆమె.

ఇద్దరూ కారువైపు నడిచారు. ముందుసీటుమీద కూర్చున్నారు. ఆమె కారును పోనిచ్చింది.

"నా గురించి నీ తండ్రితో చెప్తావా?" అడిగాడతను.

"చెప్పొద్దా?"

"తర్వాత చెప్పొచ్చు!"

"అలాగే చేద్దాం" అంది ఆమె.

అతడు చెప్పిన చోట ఆమె కారును ఆపింది. వెంకట్రావు కిందకి దిగాడు, నవ్వుతూ ఆమెవైపు చూశాడు.

"అదే మా యిల్లు, మూడోది!" అన్నాడతను.

"గుడ్ నైట్" అని ఆమె కారును ముందుకు పోనిచ్చింది.

## 3

సాయంత్రం సమయం. ఆరు కావస్తోంది.

ఆమె యింటిముందు వెంకట్రావు రెండుసార్లు యిటూ,

అటూ తిరిగాడు.

పెద్ద గేటు. తోట నలువైపులా ప్రహారీగోడ వుంది. నీలిరంగులో మేడ కనిపిస్తోంది. తోటలో యిద్దరు నౌఖర్లు పనిచేస్తున్నారు.

గేటుముందు గూర్ఖా స్టూలుమీద కూర్చుని వున్నాడు. ఆ గూర్ఖా తనను లోపలకు వెళ్ళనిస్తాడా?

గేటు వూచల మధ్యనుంచి అతడు లోపలకు చూశాడు రాజేశ్వరి తోటలో ఎక్కడేనా తనకోసం వుందేమోనని. కాని ఆమె రూపం ఎక్కడా కనబడలేదు.

గూర్ఖా అతడిని "సాబ్!" అని పిల్చాడు.

వెంకట్రావు దగ్గరగా వెళ్ళాడు.

"చిన్నమ్మకోసం వచ్చారా?" అడిగాడు గూర్ఖా హిందీలో.

వెంకట్రావు తలాడించాడు.

"వెళ్ళండి లోపలకు" అన్నాడతను.

అతను లోపలకు నడిచాడు. సిమెంట్ రోడ్డు! రోడ్డు కిరువైపులా పూల మొక్కలు! తోటలో పనిచేసే నౌఖర్లు అతడివైపు చూసి వూరుకున్నారు.

అతడు పోర్టికోలోకి చేరుకున్నాడు. నౌఖరు సుబ్బయ్య వంటుతూ అతడి దగ్గరకొచ్చాడు.

"చిన్నమ్మకోసమా?" అడిగాడు సుబ్బయ్య.

"అవును. నా పేరు వెంకట్రావు" అన్నాడతను.

"రండి" అని సుబ్బయ్య లోపలకు వెళ్ళాడు.

వెనకనే కదిలాడు వెంకట్రావు.

విశాలమైన హాల్లో యిరవై సోఫాలు పైన వున్నాయి. వెంకట్రావుని ఒక సోఫాలో కూర్చోమని సుబ్బయ్య వంటుతూ లోపలకు పోయాడు.

రాజేశ్వరి ఎక్కడుంది? కింద గదుల్లోనా, మేడ మీదా? వెంకట్రావు ఆలోచిస్తూ కూర్చున్నాడు. అనేక సినిమాలలోని దృశ్యాల ఫోటోలు అందంగా గోడలమీద అమర్చబడి వున్నాయి. అతడు లేచి వాటివైపు నడిచాడు.

ప్రతి ఫోటో కింద ఆ చిత్రం పేరు రాయబడి వుంది. ప్రతి ఫోటోలోనూ ముఖ్యమైన నటుడు మధుకుమార్ అని తెలుస్తోంది!

పదినిమిషాలు గడిచిపోయాయి. ఆమె ఇంకా రాలేదు. మధ్య వయస్సులో వున్న స్త్రీ ట్రేను తెచ్చి టీపాయి మీద పెట్టింది.

"చిన్నమ్మ స్నానం చేస్తున్నారు. మీరు టిఫిన్ తిని, కాఫీ తాగండి. అమ్మగారు వచ్చేస్తారు" అంది ఆమె.

ఆమెవంక నవ్వుతూ చూశాడతను.

"అలాగేనండి" అని టీపాయి పక్కకు వెళ్ళి సోఫాలో కూర్చున్నాడు.

ప్లేటలో స్వీట్లు, హాట్లు అన్నీ వున్నాయి. కెటిల్లో కాఫీ వుంది.

మైసూరుపాక్ ముక్కలను తిని అతడు పకోడీలను నవిలేశాడు. వేడి కాఫీ కప్పులో రెండుసార్లు పోసుకుని తాగాడు.

హాల్లోని ఫ్లోరసెంట్ లైట్లు వెలుగుతున్నాయి. ఎవరో స్విచ్ లు నొక్కి వెళ్ళిపోయారు. టైము ఏడు కావస్తోంది. ఆమె యిప్పుడు రావచ్చు!

మూడు అరేషియన్ ఖక్కలు గడపదాటి ప్రత్యక్షమయ్యాయి. వెంకట్రావు వంక చూసి అవి మొరగసాగాయి.

అతడి గుండె దడదడలాడింది. మరో క్షణంలో వాటి వెనకనే రాజేశ్వరి కనిపించింది. నవ్వుతూ అతడి వంక చూసింది.

"టామ్, లూసీ, స్కాట్ కీప్ క్వయిట్!" అరిచింది ఆమె.

కుక్కలు మొరగడం మానేశాయి. అతడిని కూర్చోమని ఆమె యెదురుగా వున్న సోఫాలో కూర్చుంది. మూడు కుక్కలూ ఆమె సోఫా పక్కనే మొజయిక్ ఫ్లోర్ మీద పడుకున్నాయి.

ఆమె అర్థరివ్వగానే కుక్కలు నోరు మూసుకోడం గమనించి అతడు ఆశ్చర్యపోయాడు.

"మీ కుక్కలు చాలా బాగున్నాయి!" అన్నాడతను మాటవరసకి.

కుక్కలంటే అతడికి భయం. రోడ్డుమీద రెండు కుక్కలు దూరంలో కనిపిస్తే అతడు మరో రోడ్డమ్మట నడిచిపోతాడు.

"ఐ లవ్ దీజ్ డాగ్స్" అంది ఆమె.

"ఐ టూ లవ్ డాగ్స్" అన్నాడతను.

"లవ్ మి, లవ్ మై డాగ్" సామెత అతడికి గుర్తొచ్చింది. రాజేశ్వరి తనను ప్రేమించాలంటే ఆమె కుక్కలను తను లవ్ చెయ్యాలి!

"ఈ కుక్కలు యెప్పుడూ నన్ను మోసం చెయ్యవు. నేను చెప్పినట్లు నడుచుకుంటాయి. ఎప్పుడూ నాతోనే వుంటాయి. నన్నువిడిచి పోవు" అంది ఆమె.

"నువ్వు చెప్పింది నిజం!" అన్నాడతను.

హాల్లో వాళ్ళిద్దరూ, కుక్కలూ తప్ప మరెవ్వరూ లేరు. కొంతసేపు వాళ్ళు ఏమీ మాట్లాడకుండా కూర్చున్నారు.

"నువ్వు ఏ కంపెనీలో పని చేస్తున్నావు?"

"కబీర్ ఏజన్సీస్, టీ నగర్‌లో వుంది."

అతడివైపు ఆమె సూటిగా చూసింది.

"నేను యీ శనివారం హంటింగ్‌కి వెళ్తాను. నువ్వూ వస్తావా?" అడిగింది ఆమె.

"వేటకా? ఎక్కడికి?"

"ముదుమలై అడవుల్లోకి. జీప్‌లో వెళ్తాను. రైఫిల్స్, పిస్టల్స్ అన్నీ నా దగ్గర వున్నాయి."

"నాకు షూటింగ్ తెలియదు!" అన్నాడతను.

"నేను నేర్పుతాను. అది బ్రహ్మ విద్యకాదు."

శాస్త్రీపు వెంకట్రావు కళ్ళు మూసుకుని ఆలోచిస్తూ వుండిపోయాడు. అడవిలో క్రూరమృగాలు వుంటాయి. అక్కడకు వెళ్ళే ధైర్యం అతడికి లేదు. కాని రానంటే ఆమె ఏమనుకుంటుందో! ఆమెకోసం తను ధైర్యాన్ని తెచ్చుకోవాలి. కొత్త ప్రదేశాలకు వెళ్ళాలి. ఆమె పక్కనే నడవాలి!

"మీతో సంతోషంగా వస్తాను" అన్నాడతను.

"గుడ్! అక్కడ హాయిగా వుంటుంది. ప్రజలకు దూరంగా అక్కడ ఎంతో ఆనందంగా వుంటుంది. నువ్వు బాగా ఎంజాయ్ చేస్తావు!" అంది ఆమె.

టెలిఫోన్ మ్రోగింది. వెళ్ళి ఆమె రిసీవర్ని అందుకుంది. ఆమె వెనకనే కుక్కలు వెళ్ళాయి.

పది నిమిషాలపాటు మాట్లాడి ఆమె నవ్వుతూ తిరిగొచ్చి సోఫాలో కూర్చుంది.

"ఎక్కడున్నా నాన్న రోజూ ఫోన్ చేస్తాడు" అంది ఆమె.

"ఆయనెక్కడున్నా రిప్పుడు?"

"కాశ్మీర్‌లో. అక్కడ షూటింగ్ జరుగుతోంది."

"నీ తల్లి?"

"ఆమె మరణించింది. నాన్న ఆరోగ్యం ఆమెకు లేదు."

అతడామె వంక నవ్వుతూ చూశాడు.

"ఈ హాల్లో మీ ఫోటోలు లేవు!" అన్నాడతను.

"నావి పైనున్నాయి. వెళ్దాం పద" అంది ఆమె.

ఆమె పక్కనే అతడు మెట్లు ఎక్కసాగాడు.

కుక్కలు ముందు వెళ్తున్నాయి.

"ఈ కుక్కల్ని యెప్పుడూ కట్టరా?"

"అవి ఎవర్నీ కరవ్వు, నేను చెప్తేగాని. కొత్త వాళ్ళను చూసి మొరుగుతాయి, అంతే!"

"వెల్‌కమ్ టు మై రూమ్స్" అంది ఆమె.

పెద్ద హాల్లోకి వాళ్ళిద్దరూ నడిచారు. ఖరీదైన సోఫాలు. గోడలకు ఆమె కలర్ ఫోటోలు వేళ్ళాడుతున్నాయి.

పక్కనున్న పడగ్గదిలోకి ఆమె అతడిని తీసుకువెళ్ళింది. స్వర్గంలా వుంది. అన్ని గదులూ ఏర్‌కండిషండ్.

పెద్ద మంచంమీద రెండు ఫోమ్ పరుపులు వేయబడ్డాయి. గదిలోని గాడ్‌రెజ్ బీరువాలు మెరుస్తున్నాయి.

యటాచ్‌డ్ బాత్‌రూమ్‌వైపు చూశాడతను. బేదింగ్ టబ్, కమోడ్ వగైరా వున్నాయి. తెల్లటి మార్బుల్ ఫ్లోర్. ఆమె యిల్లు నిజంగా యింద్రభవనంలా వుంది.

ఆమె పక్కన తనిలా వుంటాడని అతడు కలలోకూడా అనుకోలేదు. విధి తన్ని ఆమె దగ్గరకు ఎత్తి లాక్కు

పోయింది!

ఇదంతా తెలిస్తే తన భార్య బాధపడొచ్చు. కాని రాజేశ్వరి లాంటి యువతితో తిరిగే అవకాశం యువకు లకు ఎప్పుడోగాని దొరకదు! రాజేశ్వరిని తను పెళ్ళాడక పోవచ్చు! అయినా కొంతకాలం పాటు ఆమెతో స్వర్గా నికి నిచ్చెనలు వేయొచ్చు!

"విస్కీ తాగుతావా?" అడిగింది ఆమె.

"థాంక్స్, తాగుతాను."

ఆమె రెండు గ్లాసుల్లో స్కాచ్ విస్కీ పోసి సోడా కలిపి, ఐస్ క్యూబ్స్ పడేసి తెచ్చింది.

"చియర్స్!" అందామె.

"చియర్స్" అన్నాడతను, విస్కీ గ్లాసును అందు కొని.

## 4

సుబ్బయ్య రెండు పెట్టెలు, ఏర్ బాగ్స్ వగైరా జీప్‌లో పెట్టాడు. వెంకట్రావు జీప్ పక్కనే నిలబడి వున్నాడు. అతడు తెచ్చుకున్న ఏర్ బాగ్ జీప్‌లో వుంది.

రెండు రైఫిల్స్ పట్టుకుని రాజేశ్వరి జీప్ దగ్గర కొచ్చింది.

సూర్యుడి లేత కిరణాలు నలువైపులా ప్రసరిస్తు న్నాయి. ఆమె వంక వెంకట్రావు ఆత్రంగా చూశాడు.

టర్లీన్ పాంట్, పోలీయస్టర్ స్లాక్ ఆమె ధరించింది. బెల్టుకు కట్టిన తోలుసంచిలో అమెరికన్ పిస్టల్ వుంది.

బాబ్డ్ హెయిర్. కళ్ళకు నల్లటి గాగిల్స్. కాళ్ళకు గమ్ బూట్స్. ఆమె అచ్చంగా వేటకు వెళ్తున్న షికా రీలా వుంది.

"గాటిన్!" అంటూ ఆమె వెంకట్రావు వంక చూస్తూ.

అతడు జీప్ ముందుసీట్లో కూర్చున్నాడు. పక్కనున్న మూడు కుక్కలను ఆమె వెనుక సీటుమీద కూర్చో బెట్టింది.

ఒక కుక్క వెనకనుంచి వెంకట్రావు మెడను నాకింది. అతడు త్రుళ్ళిపడ్డాడు.

ఆమె ముందుసీట్లో కూర్చుంది.

"వీటికి గొలుసులు లేడంలేదా?" అడిగాడతను.

"అవసరం లేదు. నేను ఏం చేయమంటే అవి అలా చేస్తాయి. వెల్ బ్రెడ్, వెల్ ట్రెయిన్డ్!" అని ఆమె జీప్‌ని పోనిచ్చింది.

సుబ్బయ్య జీప్ కేసి చూస్తూ వుండిపోయాడు.

ట్రంక్ రోడ్డుమ్మీట ఆమె జీప్‌ను శరవేగంగా పోనిస్తోంది.

"నువ్వు కారును బాగా డ్రయివ్ చేస్తావు!" అన్నాడతను.

ఆమె నవ్వింది.

"పోలవరం ఆడవాళ్ళ కారుపందాల్లో నాకు ఫస్టు ప్రయిజ్ వచ్చింది. ఆనాటి కారు రేసును నాన్న చూశాడు. తర్వాత రేసుల్లో నన్ను పాల్గొనవద్దన్నాడు. యాక్సిడెంట్ అయి నేను చస్తానేమో అని నాన్న భయం!" అంది ఆమె.

"కారు రేసులు ప్రమాదకరమైనవి! నువ్వు మానేసినందుకు సంతోషిస్తున్నాను."

"నాన్నకి ఒక్కగానొక్క కూతుర్ని. నాన్న బాగా ముసలివాడయిపోయాడు. అందుకని నాగురించి భయపడ్డాడు!"

"నీ తండ్రి ముసలివారైనా ఎవర్ గ్రీన్ హీరో! ఈనాడు కూడా పదహారేళ్ళ అమ్మాయితో యుగళగీతం పాడుతూ ఆయన స్టెప్స్ వేస్తూంటే ప్రేక్షకులకు పిచ్చెక్కుతుంది" అన్నాడతను.

రెండింటికి అడవి ప్రాంతంలో వున్న చిన్న బంగళా ముందు ఆమె కారు ఆపింది. కరుపయ్య పరుగెత్తుకొచ్చాడు.

అతడివైపు ఆమె నవ్వుతూ చూసింది.

"కరుపయ్యా, ఎలా వున్నావు?"

"మీ దయమ్మా" అన్నాడతను.

కరుపయ్య నల్లగా ఎలుగుబంటిలా వున్నాడు. ఒంటి నిండా నల్లటి వెంట్రుకలు. బుర్రమీసాలు. ఖాకీ నిక్కర్, చారల బనియన్‌లో వున్నాడతను. కాళ్ళకు పల్లెలో కుట్టిన చెప్పులు. తలపాగా వుంది. పొడుగ్గా లావుగా వున్నాడు.

"వంటామె వచ్చిందమ్మా. అన్నీ మీకు సిద్ధంగా వుంచాను" అన్నాడతను.

"ఈ పెట్టెలు నా గదిలో పెట్టు. అతడు గెస్టు రూమ్‌లో వుంటాడు" అని ఆమె కిందకు దిగింది.

కుక్కలు కిందకు దూకాయి.

వెంకట్రావు వైపు చూసింది.

"ఫీల్ ఎట్ హోమ్! ఏం కావలసినా కరుపయ్యనడుగు" అని ఆమె లోపలకు వెళ్ళిపోయింది.

తన గదిలోకి కుక్కలతో సహా ఆమె నడిచింది. వంటామె ఆమెను పలకరించింది.

"హై!" అంది రాజేశ్వరి.

"ఏదేనా తాగుతారా?"

"హాట్ కాఫీ" అంది ఆమె.

వంటామె వెళ్ళిపోయింది. పడగ్గది అఖండంగా వుంది. గదిలో ఫాన్ తిరుగుతోంది. జనరేటర్ చప్పుడు బయట నుంచి వినపడ్తోంది.

ఆమె తండ్రి యీ బంగళాను కట్టించి పదేళ్ళు దాటింది. తలిదండ్రులతో ఆమె ఇక్కడకు యెన్నిసార్లో వచ్చింది. నాన్నకు హంటింగ్ అంటే మహా సరదా.

అలసటగా ఆమె పరుపుమీద వెల్లకిలా పడుకుంది. పెట్టెలు వగైరా గదిలో పెట్టి కరుపయ్య మెల్లిగా బయటకు వెళ్ళిపోయాడు. కుక్కలు మంచం ముందు పడుకున్నాయి.

# 5

భోజనాలు ముగించి ఓ గంటసేపు రాజేశ్వరి, వెంకట్రావు వాళ్ళ గదుల్లో పడుకున్నారు.

సరిగ్గా ఐదింటికి వాళ్ళు అడవిలోకి నడిచారు. కుక్కలు వుషారుగా ముందు పరుగెడ్తున్నాయి.

కరుపయ్య కూడా రానందుకు వెంకట్రావు సంతోషించాడు. ఆమె పక్కనే అతడు అడుగులు వేస్తున్నాడు. ఎండుటాకులు బూట్లకింద నలిగి చప్పుడు చేస్తున్నాయి.

"ఇక్కడ పెద్దపులులు సంచరిస్తూ వుంటాయా?" అడిగాడతను.

"చిరుతపులులు మాత్రం వున్నాయి. ఎలుగుబంట్లు యెక్కువగా వుంటాయి. రాత్రిళ్ళు ఇంటికొచ్చి అవి తలుపుమీద బాదుతూ వుంటాయి" అందామె.

"డేంజరస్!"

"అన్ని ప్రమాదాలనూ యెదుర్కోడానికి సిద్ధపడి ఇక్కడకు రావాలి" అందామె.

అతడి చేతిలో రైఫిల్ వుంది. ఆమె చేతిలో మరో రైఫిల్ వుంది.

"క్రితంసారి ఏమైందో తెలుసా?"

"ఏమైంది?" అడిగాడతను.

"ఒక ఎలుగుబంటితో యీ మూడు కుక్కలూ ఘోరంగా పోట్లాడాయి. వాటిని యెదిరించలేక ఎలుగు బంటి పారిపోయింది!" అందామె నవ్వుతూ.

"నీ కుక్కలు చాలా బలంగా వున్నాయి. వాటిని చూసి ఏనుగు కూడా పారిపోవచ్చు."

"ఏనుగు అంత సులువుగా లొంగదు. ఐదేళ్ళక్రితం నాన్నతో వచ్చాను. అప్పుడు మా దగ్గర నాలుగు కుక్కలు వుండేవి. ఒక ఏనుగుల మంద మాకు కనిపించింది. కుక్కలు మొరుగుతూ అటువైపు పరుగెత్తాయి."

ఆమె ఆగింది. అతడివంక చూసింది.

"కుక్కల్ని పిలవమన్నాను. నాన్న వద్దన్నాడు. ఏం జరుగుతుందో చూద్దామన్నాడు. ఒక కుక్కను తొండంతో చుట్టి పట్టుకుని, చెట్టు కొమ్మకేసి కొట్టి దూరంగా విసిరింది ఏనుగు. ఆ కుక్క కాళ్ళు విరిగాయి. దాన్ని నాన్న షూట్ చేసి చంపేశాడు."

"పాపం!" అన్నాడతను.

"ఆ కుక్క చాలా బాధపడ్తోంది. అందుకని దానికి విముక్తినిచ్చాడు నాన్న. శింపతిటిక్ కిల్లింగ్! మెర్సీ కిల్లింగ్ అంటారు కొందరు" అందామె.

హఠాత్తుగా అతడు వెనక్కి గెంతాడు. ఆమెను పక్కకు లాగాడు. పెద్ద కొండచిలువ చెట్టుకొమ్మనుంచి కిందకు వేళ్ళాడుతోంది.

భయంగా దానివైపు చూశాడతను.

"అది మనిషిని మింగేస్తుంది. షూట్ చేసి చంపనా?" అడిగిందామె.

"దాని స్థలానికి వచ్చి దాన్ని చంపడ మెందుకు? పక్కనుంచి పోదాం" అన్నాడతను.

"నీకు సింపతీ యెక్కువ! నీలాంటివాడు వేటకి రాకూడదు" అందామె.

"నేను వేటకు రావడం ఇదే మొదటిసారి" అన్నాడతను.

"ఇదే ఆఖరిసారి అవుతుందేమో!" అందామె.

అతడామెవైపు గాభరాగా చూశాడు.

"మళ్ళా నేను పిల్చినా నువ్వు రాకపోవచ్చు అనీ నా అర్థం" అందామె.

అతడు నవ్వేశాడు. భుజానికి తగిలించుకున్న బాగ్ వైపు చూశాడు.

"ఇందులో ఏముంది?"

"పవర్ ఫుల్ టార్చిలైట్లు రెండున్నాయి. చీకటి పడితే మనం యింటికి క్షేమంగా చేరుకోవాలంటే టార్చిలు కావాలిగా!"

ఎన్నో కొండలు ఎత్తుగా కనిపిస్తున్నాయి. రెండు కొండల మధ్యన వాళ్ళు నడుస్తున్నారు. కుక్కలు మొరుగుతూ ఒక కుందేలు వెనక పరుగెడుతున్నాయి. తన ప్రాణంకోసం కుందేలు విమానంలా పరుగెడుతోంది.

"కుక్కలకు కుందేలు దొరకదు!" అన్నాడతను.

కుందేలు ఒక పొదలో దూరింది. మొరుగుతూ కుక్కలు పొదచుట్టూ తిరుగుతున్నాయి.

పొదవైపు వాళ్ళిద్దరూ నడిచారు. రైఫిల్ని యెత్తిందామె. గురిచూసి పొదవైపు రెండుసార్లు షూట్ చేసింది.

గాలిలో ఎగిరెగిరి కుందేలు పాదపక్కనే పడింది.

కుక్కలు దానివైపు చూసుకు వెళ్ళాయి.

"డోంట్ టచ్!" అర్చిందామె.

కుక్కలు వెనక్కు జరిగాయి.

"దాన్ని బాగ్‌లో పడేయి" అందామె, వెంకట్రావు వైపు చూస్తూ.

రక్తం కారుతున్న కుందేలును అతడు బాగ్‌లో పడేశాడు. ఆమె టైమ్ చూసింది.

"చాలాదూరం వచ్చేశాం. చీకటి పడ్తోంది. పోదాం పద" అందామె.

కుక్కలు వెనక్కు తిరిగాయి. వాటి వెనకనే నడిచారు వాళ్ళిద్దరూ. యిద్దరి చేతుల్లోనూ టార్చిలైట్లు వున్నాయి. ఆ కాంతిలో వాళ్ళు కదుల్తున్నారు.

"ఆగు!" అర్చాడు వెంకట్రావు.

ఆమె ఆగింది. టార్చి కాంతిలో ప్రాకిపోతున్న నల్ల త్రాచు వైపు ఆమె చూసింది.

ఇద్దరు మౌనంగా నిలబడ్డారు. త్రాచుపాము మాయమైంది. వాళ్ళు ముందుకు కదిలారు.

ఇల్లు చేరుకునేసరికి ఏడున్నర అయింది. కరుపయ్య గబగబా వచ్చాడు. వెంకట్రావు భుజానికున్న బాగ్‌ను అతడు తీసుకున్నాడు.

"అందులో కుందేలుంది. వంటామెను వండమను. ఇతడికి చాలా యిష్టం" అందామె వెంకట్రావువైపు చూస్తూ.

"అది నీకెలా తెలుసు?" అడిగాడతను.

"మనిషి మొహం చూసి ఏదిష్టమో నేను గ్రహించగలను" అందామె.

ఇద్దరూ హాల్లోకి వెళ్లారు.

"గో అండ్ బేద్! తర్వాత డిన్నర్!" అందామె, తన గదివైపు నడుస్తూ.

కుక్కలు ఆమె వెనక నే పరుగెత్తాయి.

తొమ్మిదింటికి వెంకట్రావు ఆమె పడగ్గదిలోకి వెళ్లాడు. పెద్ద సోఫాలో యిద్దరూ పక్కపక్క నే కూర్చున్నారు.

"విస్కీ తాగుదాం" అందామె.

"నేను యిస్తాను" అని అతడు లేచాడు.

రెండు గ్లాసుల్లో స్కాచ్ విస్కీ పోసి, సోడా కలిపాడు. రిఫ్రిజిరేటర్ లోంచి ఐస్ క్యూబ్స్ తీసి వేశాడు.

"చియర్స్" అని యిద్దరూ తాగడం ప్రారంభించారు.

"ఈ అడవి ప్రాంతంలో యిన్ని సౌకర్యాలున్న బంగళా వుందని ఎవరేనా చెప్తే నేను నమ్మేవాడినికాను. చూశాక నమ్మక తప్పదు" అన్నాడతను.

"నాన్నకి ఎక్కడున్నా అన్ని సౌకర్యాలు కావాలి. అలాగే నాకూ అలవాటైపోయింది" అందామె.

అల్సేషియన్ కుక్కలు వాళ్ళ కాళ్ళముందు పడుకుని వున్నాయి. రెండు పెగ్గులు సేవించడం పూర్తయింది. మూడో పెగ్ వెంకట్రావు గ్లాసులో పోస్తున్నాడు.

కరుపయ్య గదిలోకొచ్చాడు.

"మాంసం వుడకబెట్టానమ్మా కుక్కలకు. వచ్చి మీరే వేయండి!" అన్నాడతను.

హుషారుగా ఆమె లేచింది. ముందు వరండామీదకు వెళ్ళింది. స్టెయిన్ లెస్ స్టీల్ ప్లేట్లు మూడు పక్క పక్క నే అమర్చబడి వున్నాయి.

రాజేశ్వరి మాంసం ముక్కలను మూడు ప్లేట్లలోనూ సమానంగా వేసింది. మూడు కుక్కలు ఆమెవైపే చూస్తున్నాయి.

"టామ్, లూసీ, స్కాట్ హేవ్ డిన్నర్! కమాన్!" అందామె.

పెద్ద మనుషుల్లా కుక్కలు ప్లేట్లవైపు వెళ్ళి తినడం ప్రారంభించాయి. అవి తినేదాకా రాజేశ్వరి అక్కడే నిలబడింది.

మాంసాన్ని తిని ప్లేటను నాకేశాయి కుక్కలు. ఆమె తన గదిలోకి నడిచింది. వెనకనే వెళ్ళాయి కుక్కలు.

వెంకట్రావు ఇచ్చిన గ్లాసును అందుకొని ఆమె మెల్లిగా తాగుతూ సోఫాలో కూర్చుంది.

"రాజీ, నీ వేట అడ్వెంచర్స్ గురించి చెప్పు. వినాలని వుంది" అన్నాడతను.

"రెండేళ్ళ క్రితం నేనూ నాన్నా యిక్కడకు వచ్చాం. ఏదో చిరుతపులి తిరుగుతోందని విన్నాం. అది తిరిగే ప్రదేశానికి నడిచాం. మాతో ఆ రోజు కరుపయ్యకూడా వున్నాడు. ఒక మేకను చెట్టుమానుకు కట్టేశాం. నాన్నా, నేను చెట్టెక్కి కూర్చున్నాం. కరుపయ్య మరో చెట్టుమీద వున్నాడు. అతడి దగ్గర పెద్ద టార్చి వుంది. కాంతి కావలసినపుడు మేం వెయ్యమనగానే అతడు బటన్ నొక్కేవాడు. చీకటి పడింది. వాతావరణం బీభత్సంగా వుంది. మేం యెదురు చూస్తూన్న చిరుతపులి వస్తుందో రాదో!"

"థ్రిల్లింగ్!" అన్నాడు వెంకట్రావు.

"పన్నెండు తర్వాత చిరుతపులి అరుస్తూ వచ్చింది.

నాన్న నా చేతిమీద వేళ్ళతో రాశాడు. మేకమీదకు దూకింది చిరుతపులి!"

"ఎక్సైటింగ్!"

"మేక భయంకరంగా అరవసాగింది. అదే క్షణంలో బటన్ నొక్కాడు కరుపయ్య. టార్చి కాంతి చిరుతపులి మీద పడింది. దాని నోట్లో వుంది మేక మెడ! రెండు సార్లు షూట్ చేశాను. మూడోసారి మళ్ళా షూట్ చేశాను. చిరుతపులి ఎగిరి కరుపయ్య వున్న చెట్టుకింద పడింది. టార్చి కాంతిలో దానివైపు చూశాం. గిజగిజ కొట్టుకుంటూ చిరుతపులి పక్కకు వాలిపోయింది. నాన్న నా చెయ్యిని పట్టుకొని బ్రహ్మాండంగా చంపావు అన్నాడు. అరగంట తర్వాత కరుపయ్య కిందకు దిగాడు. చిరుతపులి చచ్చిందని అర్చాడు. నేనూ నాన్నా కిందకు దిగి, అది పడున్న చోటకు నడిచాం. టార్చి కాంతిలో దాన్ని చూశాను. నేను చంపిన మొదటి క్రూరమృగం అదే! ఆ రోజు నాకు చాలా థ్రిల్లింగా వుంది!" అందామె.

వంటామె గుమ్మంలో నిలబడింది.

"వడ్డించమంటారా?" అని అడిగింది.

"వడ్డించు, వస్తున్నాం" అంది రాజేశ్వరి.

ఇద్దరూ తాగడం పూర్తిచేసి హాల్లోని డైనింగ్ టేబుల్ దగ్గరకు వెళ్ళారు.

ఇద్దరూ ఆకలితో తినసాగారు. మసాలా వేసి వండిన పందేలు మాంసం రుచికరంగా వుంది.

"చాలా బాగుంది" అన్నాడు వెంకట్రావు.

"ఆమె బాగా వండుతుంది" అంది రాజేశ్వరి.

డిన్నర్ పూర్తయ్యేసరికి పది దాటింది. పక్కలు

డైనింగ్ టేబుల్ పక్కనే తిరుగుతున్నాయి.

కరుపయ్యా, వంటామె పల్లెలో వున్న తమ ఇళ్ళకు పోతామన్నారు.

"ఇంత రాత్రివేళ యెక్కడికి కెళ్తారు? ఇక్కడే పడుకోండి!" అందామె.

"నా కీ మధ్య నే పెళ్ళయిందమ్మా" అన్నాడు కరుపయ్యా.

"తండ్రిలేని పిల్లలు నాకోసం యెదురు చూస్తూ వుంటారు" అంది వంటామె.

"మిమ్మల్ని నేను దింపుతాను, పదండి" అంది రాజేశ్వరి.

వెనక సీట్లో కుక్కల మధ్య కరుపయ్యా వంటామె సర్దుకున్నారు. వెంకట్రావు ముందు సీటులో వున్నాడు. ఆమె జీప్ ను పోనిచ్చింది.

"ఎందుకమ్మా మీకీ శ్రమ?" అంది వంటామె.

"ఈ అడవి తోవమ్మట రావడం కష్టమమ్మా" అన్నాడు కరుపయ్యా.

"మరేం ఫరవా లేదు" అందామె.

ఎత్తు పల్లాలున్న కంట్రీ రోడ్డమ్మట జీప్ కదిలిపోతోంది. అరగంటలో పల్లెలో వాళ్ళను దింపి, జీప్ ను వెనక్కి తిప్పి ఆమె పోనిచ్చింది.

వెనుక కుక్కలున్నాయి. రివ్వున గాలి వీస్తోంది. చలిగా వుంది. ఏవో జంతువులు అరుస్తున్నాయి.

"మనం ఆ బంగళాలో ఒంటరిగా వుండాలి!" అన్నాడు వెంకట్రావు.

ఆమె నవ్వింది.

"మూడు తుపాకులు! రైఫిల్సు! పిస్టల్సు! అన్నీ వుండగా భయం దేనికి?" అందామె వుషారుగా.

# 6

పరుపుమీద ఆమె పడుకుంది. నిద్ర రావడంలేదు. గత జీవితం గురించి ఆమె ఆలోచిస్తోంది....

రాజా ఆమెను ఒక ఎగ్జిబిషన్‌లో కల్సుకున్నాడు. తర్వాత ఇద్దరూ స్నేహితులయ్యారు. ఇద్దరూ అనేక చోట్లకు తిరిగారు. ప్రేయసీప్రియులుగా మారారు.

ఇద్దరూ సినిమాలకు వెళ్ళారు. అతడితో ఆమె రెండు సార్లు హంటింగ్‌కు కూడా వెళ్ళింది.

రాజా ఒక ఇంజనీరింగ్ కంపెనీలో పనిచేస్తున్నాడు. బి.యి. పాసయ్యాడు. మంచి జీతం వస్తోంది. చక్కటి రూపం!

"నాన్నా, నేను పెళ్ళాడ్తాను" అందామె తండ్రితో ఒకసారి.

"ఎవర్ని?"

"రాజాని. ఐ లవ్ హిమ్."

"అతడిని తీసుకొచ్చి నాకు పరిచయం చెయ్యి" అన్నాడు తండ్రి.

"అలాగే నాన్నా" అందామె.

ఆ పరిచయం చేసే అవకాశం ఆమెకు లేకుండా పోయింది.

ఇదే బంగళాలో, ఇదే పరుపుమీద రాజాకు ఆమె పూర్తిగా లొంగిపోయింది.

ఆ రోజు అడవిలో తిరిగి తిరిగి, వానలో తడిసి ముద్దయి వాళ్ళు ఇంటికొచ్చారు. ఒకే గదిలో దుస్తులు మార్చుకోబోయారు. ఆ క్షణంలో మన్మథుని బాణాలు

ఇద్దరివైపూ చూసుకుపోయాయి. కట్టుకునే గుడ్డలు కిందకు జారిపోయాయి.

అమాంతంగా ఇద్దరూ కౌగలించేసుకున్నారు. ఆ తర్వాత సముద్ర కెరటాలమీద ఎగిరెగిరి గాలిలో ఆకాశంలో సంచరించారు.

రోజులు గడిచిపోయాయి. నాన్నతో మాట్లాడ్డానికి రాజా ఆ రోజు పొద్దుటే ఇంటికొస్తానన్నాడు. కాని రాలేదు.

"రాజా ఎందుకు రాలేదు?" అడిగాడు తండ్రి.

"ఏమో నాన్నా" అందామె.

అతడి ఆఫీసుకు ఫోన్ చేసింది. అతడు ఆఫీసుకు రాలేదు. అటుపైన ప్రతిరోజూ ఆమె అతిడి ఆఫీసుకు ఫోన్ చేసేది. అతడు ఆఫీసుకు రాలేదని వాళ్ళు చెప్పేవారు.

ఆతను వుండే ఇంటికి వెళ్ళిందామె. అతడి గదిలో మరెవరో నివశిస్తున్నారు! ఇంటి ఓనర్ని ఆమె కలుసుకుంది.

"రాజా ఏమయ్యాడు?" అడిగిందామె.

"నాకు తెలియదు. చెప్పకుండా ఎక్కడికో వుడాయించాడు. మూడు నెలల అద్దె నాకు బాకీ పడ్డాడు. తాళం పగలగొట్టి ఆ గదిని ఒకరికి అద్దెకిచ్చాను" అన్నాడు కుప్పుశెట్టి.

"రాజా ఎటువంటి వాడు?" అడిగిందామె.

"నాకు ప్రతి నెలా అద్దె సరిగ్గా ఇచ్చేవాడే. మంచి వాడు!" అన్నాడతను.

విరక్తితో ఆమె వెళ్ళిపోయింది.

ఆమె గర్భవతి! ఇప్పుడు ఏం చెయ్యాలి? రాజా తిరిగి

వస్తాడనే నమ్మకం ఆమెలో నశించింది.

ఆమె డాక్టర్ పద్మిన్ని కల్సుకుంది. డాక్టర్ ఆమెను పరీక్షించింది. ఆమె చెప్పినదంతా వినింది.

"అమ్మాయి, చాలా ఆలస్యం చేశావు. ఇప్పుడు అబార్షన్ చేయించుకోడం నీ ప్రాణానికే ముప్పు తేవొచ్చు" అంది డాక్టర్.

"డాక్టర్, ఆ దుష్టుడి బిడ్డ నాలో పెరగకూడదు! దాన్ని తుంచి పారేయాలి" అందామె.

"అందుకోసం నువ్వు బలవకూడదు!"

"అయితే ఏం చెయ్యమంటారు?"

"బిడ్డను కనేసి అక్కర లేకపోతే యెక్కడో వది లేయి!" అంది డాక్టర్.

అలాగే జరిగింది.

కొడుకు పుట్టాడు. ఒక అర్ఫనేజిలో ఆమె తన బిడ్డను వదిలేసింది. ప్రతి నెలా ఆ అనాధాశ్రమానికి విరాళంగా ఆమె డబ్బు పంపుతానంది. కావలసినప్పుడు వచ్చి ఆ బిడ్డను చూస్తానంది.

"ఎప్పుడు కావలసినా నువ్వు వచ్చి చూడొచ్చమ్మా" అంది కార్యదర్శి కామాక్షమ్మ.

నాలుగేళ్ళయినా రాజా ఏమైనాడో తనకు తెలియదు. అతడు తనని మోసం చేశాడు. తన్ని అనుభవించి, ఉద్యోగం మాని, గది వదిలి మరే పట్నానికో అతడు పారిపోయి వుండాలి!

"నువ్వు పెళ్ళాడాలమ్మా!" అన్నాడు తండ్రి.

"నాకు పెళ్ళొద్దు నాన్నా. యువకులంటే నాకు అసహ్యం" అందామె.

"నీకేం కావాలో నువ్వే కనుక్కో!" అని తండ్రి

వూరుకున్నాడు.

ఎవరో తలుపును దబదబా తట్టారు. గతంలోంచి తేరుకుని ఆమె తలుపువైపు చూసింది. ఎవరో తట్టారు మళ్ళా.

ఆమె లేచింది. తలుపు తెర్చింది. బయట నిలబడిన వెంకట్రావు ముఖంలో గాభరా కనిపిస్తోంది.

"బందిపోటు దొంగలేమో! ముందు తలుపును బాదుతున్నారు!" అన్నాడతను.

ఆమె ముందు తలుపు దగ్గరకు నడిచింది. చెవిని తలుపుకు ఆనించి మౌనంగా నిలబడింది. కుక్కలు ఆమె పక్కకు చేరుకొన్నాయి.

తటాలున ఆమె తన గదిలోకి పరుగెత్తింది. "రావు, టార్చి తీసుకో!" అందామె.

రైఫిల్ని ఆమె తీసుకొంది.

వెనక తలుపు తెర్చింది. కుక్కలు బయటకు పరుగెత్తాయి. అవి మొరుగుతున్నాయి.

వెంకట్రావు టార్చ్‌ని ఆన్ చేసి పట్టుకున్నాడు. ఆ కాంతిలో ఆమె బంగళా ముందువైపుకు కదిలింది.

నల్లటి ఆకారం తలుపుముందు నిలబడి బాదుతోంది. కుక్కలు మొరుగుతూ ఆకారంవైపు దూకాయి.

టార్చి కాంతిలో తలుపుముందు నిలబడివున్న ఎలుగుబంటిని ఆమె స్పష్టంగా చూసింది.

రైఫిల్ ని గాలిలోకి రెండుసార్లు షూట్ చేసింది. అరుస్తూ ఎలుగుబంటి పారిపోయింది. దాన్ని తరుముతూ కుక్కలు వెనకనే వెళ్ళాయి.

"కమ్ బాక్!" అర్చిందామె.

కుక్కలు వెనక్కు వచ్చేశాయి.

"భయపెడితే ఎలుగుబంటి అదే పారిపోతుంది. దాన్ని చంపడం వృధా!" అందామె నవ్వుతూ.

## 7

ఆమె టైమ్ చూసింది. పన్నెండు దాటింది.

"గుడ్ నైట్, వెళ్ళి పడుకో!" అంది వెంకట్రావుతో.

అతడు కదల్లేదు. ఆమెవైపు చూస్తూ వుండిపోయాడు.

"నిద్ర పట్టడంలేదు!" అన్నాడతను.

రాజేశ్వరి తన పడగ్గదిలోకి నడిచింది. రైఫిల్ని టేబుల్ మీద పెట్టి పరుపుమీద కూర్చుంది.

కుక్కలు మంచం ముందు పడుకున్నాయి. వెంకట్రావు గదిలో కొచ్చి నిలబడ్డాడు.

"ఒంటరిగా పడుకోలేవా?" అడిగిందామె.

"నేనూ యీ గదిలో పడుకుంటాను" అన్నాడతను.

"ఆ ఎలుగుబంటి మళ్ళా వస్తుందని భయమా?"

"అది రాకపోతే మరో ఎలుగుబంటి రావచ్చు. ఏ ముళ్ళపందో రావచ్చు!"

ఆమె వ్యంగ్యంగా నవ్వింది.

"క్రితంసారి నాకు జరిగిన అనుభవాన్ని గురించి నువ్వు వింటే హడలిపోతావు!" అందామె.

"ఏమైంది?" అడిగాడతను, మంచం యెదురుగావున్న సోఫాలో కూర్చుంటూ.

"నాన్న, నేనూ వేటకు వెళ్ళి ఎనిమిదింటికి వచ్చాం. స్నానం చేసి, నేనూ నాన్నా బయట వర్చీలో కూర్చున్నాం. చంద్రకాంతిలో హాయిగా వుంది. నాన్న ఏదో చెప్తున్నాడు. నేనూ, కరుపయ్యా చెవులు రిక్కించి వింటున్నాం. ఆనాడు నాన్న ఒక జింకను షూట్

చేశాడు. కరుపయ్య దాన్ని ఇక్కడకు మోసుకొచ్చాడు. వంటామె జింక మాంసం వండుతోంది. ఆ రాత్రి మేం ఆలస్యంగా భోజనం చేశాం. నాన్నకు గుడ్ నైట్ చెప్పి నా గదికి వెళ్ళిపోయాను. తలుపుమూసి పనికిపాట్లు పడ్తూ పరుపుమీద వాలాను. ఏదో బొచ్చు నా శరీరానికి తగిలింది. అమాంతంగా కిందకు దూకి లైట్ ఆన్ చేశాను. నా పరుపుమీద ఎలుగుబంటి పడుకుని వుంది. తలుపు తెర్చి బయటకు పరుగెత్తాను, అరుస్తూ. నా అరుపు విని నాన్న, కరుపయ్య పరుగెత్తుకొచ్చారు."

"గుడ్ గాడ్!" అన్నాడు వెంకట్రావు.

"నాన్న, కరుపయ్య నా గదిలో కెళ్ళి ఎలుగుబంటి వైపు చూశారు. బయటకు పరుగెత్తారు. నాన్న రైఫిల్ అందుకున్నాడు, దాన్ని చంపడానికి. కాని కరుపయ్య కాగడాతో అక్కడి కొచ్చాడు. ఆ కాగడాతో దాన్ని భయపెడుతూ గెంటివేశాడు. ఎలుగుబంటి కిందకు దూకి హాల్లోకొచ్చింది. కాగడాతో కరుపయ్య దాన్నితరుముతూ వెళ్ళాడు. వెనకవైపు నుంచి అది పారిపోయింది."

"అదెలా లోపలకొచ్చింది?"

"వంటామె వెనక తలుపును మూయడం మర్చిపోయింది. మేము యింటిముందు బయట కూర్చున్నపుడు అది నా గదిలోకెళ్ళి హాయిగా పడుకొంది! నాకానాడు యెంత భయమేసిందో చెప్పలేను" అందామె.

"వెనక తలుపు సరిగ్గా మూశావా?" అడిగాడతను.

"నేనే మూశాను. డోంట్ వర్రీ!" అందామె.

అతడు సోఫాలోంచి లేచాడు. ఆమెవైపు నవ్వుతూ చూశాడు.

రాజేశ్వరి సిల్కు నైటీలో అప్సరసలా వుంది అతడి

కళ్ళుకు.

"వెళ్ళి పడుకుంటాను, గుడ్ నైట్!"

"గుడ్ నైట్" అందామె అవులిస్తూ.

అతడు హాల్లోకి వెళ్ళాడు. నల్లటి ఆకారం ఏదో అతడి చంపమీద తట్టుతూ యెగిరిపోయింది. అతడు భయంతో అర్చాడు.

కుక్కలు మొరుగుతూ ఆమె వెనకనే హాల్లోకి పరుగెత్తాయి. హాల్లో యిటూ అటూ మూసుకుపోతున్న ఆకారంవైపు ఆమె చూసింది. "అడవి గబ్బిలం! భయపడకు!" అందామె.

పడగ్గదిలో కెళ్ళి ఒక పొడుగాటి వత్తిని తెచ్చి ఆమె వెలిగించింది. వత్తి వెలుగుతూ పొగను చిమ్మింది. ఆ పొగను భరించలేక అడవి గబ్బిలం కిటికీలోంచి బయటకు యెగిరిపోయింది.

వెంకట్రావు స్వేచ్ఛగా వూపిరి పీల్చాడు.

"ఇక్కడ బతకాలంటే నీ దగ్గర చాలా నేర్చుకోవాలి!" అన్నాడతను.

"నువ్వే నేర్చుకుంటావు. ప్రాణభయం ప్రాణాన్ని కాపాడే మార్గాలెన్నో సూచిస్తుంది" అందామె నవ్వుతూ.

కుక్కలతో ఆమె తన గదిలోకి వెళ్ళిపోయింది. వెంకట్రావు పక్క గదిలోకెళ్ళి తలుపు మూసుకున్నాడు.

## 8

అతడు ఆటోలోంచి కిందకు దిగాడు. గేటు ముందున్న గూర్ఖా అతడివంక పరీక్షగా చూశాడు.

"మీరా, సాబ్!" అన్నాడు.

"నేనే" అని అతడు లోపలకు నడిచాడు.

ఇల్లంతా మునుపటిలాగే వుంది. నౌఖర్లుకూడా మునుపటి వాళ్ళే! ఆలోచిస్తూ అతను పోర్టికోలోకి వెళ్ళాడు.

అక్కడున్న సుబ్బయ్య కుంటుతూ ముందుకొచ్చాడు.

"ఎవరు కావాలి?" అడిగాడు సుబ్బయ్య.

"నన్నప్పుడే మర్చిపోయేవా?" అన్నాడతను.

సుబ్బయ్య అతడివైపు సూటిగా చూశాడు.

"అయ్యా, మీరా?"

"పోల్చావు, సంతోషం. చిన్నమ్మ వున్నారా?"

"లేరయ్యా. చిన్నమ్మ వేటకెళ్ళారు."

"వెళ్ళి యెన్నిరోజులయింది?"

"నిన్నే వెళ్ళారు."

"ఎక్కడకు?"

"మీకు తెలుసుగా, అక్కడికేనయ్యా."

అతడు సుబ్బయ్యవైపు సూటిగా చూశాడు.

"ఒంటరిగా వెళ్ళారా?"

"కూడా ఒకబ్బాయిగారున్నారు."

అతడు మాట్లాడలేదు. అతడి గుండెను యెవరో పిండుతున్నట్లు అనిపించింది. తను మరీ ఆలస్యంగా వచ్చాడేమో!

అతడు వెనక్కు తిరిగాడు. వేగంగా బయటకు నడిచాడు.

గేటు ముందున్న ఆటో యెక్కాడు.

"పోనీ!" అన్నాడు డ్రయివర్‌తో.

డాక్టర్ పద్మిని క్లినిక్ ముందు అతడు ఆటో దిగాడు. లోపలకు వెళ్ళాడు. ఒక నర్సు అతడివంక ప్రశ్నార్థకంగా చూసింది.

"డాక్టర్ పద్మినిగారితో మాట్లాడాలి."

"వెళ్ళండి, ఆ గదిలో వున్నారు" అందామె.

డాక్టర్ పద్మిని ఏర్‌కండిషండ్ గదిలోకి అతడు వెళ్ళాడు.

"హలో, డాక్టర్" అన్నాడు వుషారుగా. ఓ నిమిషంపాటు చూశాక ఆమె అతడిని పోల్చగల్గింది.

"గుడ్ హెవన్స్, మీరా! రాజేశ్వరికి మీమీద చాలా కోపంగా వుంది. నిజం చెప్పాలంటే మొగాళ్ళంటే ఆమెకు అసహ్యం పుట్టేసింది"

అతడు మౌనంగా వుండిపోయాడు.

"ఇంతకాలం ఏమయ్యారు?"

"మనం ఒక తోవమ్మట వెళ్ళాలనుకుంటే విధి మరో వైపుకు మనల్ని లాక్కుపోతుంది. అదే జరిగింది నా విషయంలో."

డాక్టర్ పద్మిని అతడివైపు సూటిగా చూసింది.

"ఆమెకు బిడ్డపుట్టాడు. అతడిని ఆమె అనాథాశ్రమంలో వదిలేసింది. పూర్ కిడ్!" అందామె.

"ఏ అనాథాశ్రమంలో?"

"కామాక్షమ్మ నడుపుతున్న శరణాలయంలో" అంది ఆమె.

అతడు విచారవదనంతో కూర్చుండిపోయాడు.

"ఆమెను కల్సుకున్నారా?" అడిగిందామె.

"కలుసుకోవాలనే వచ్చాను. కాని ఆమె యింట్లో లేదు. ఒక మిత్రుడితో వేటకెళ్ళిందని తెలిసింది. ఈ పరిస్థితుల్లో ఆమెను చూడ్డం వృధా అనిపిస్తోంది" అన్నాడతను.

"మీరు తప్పక ఆమెను కల్సుకోవాలి!"

"డాక్టర్, సంవత్సరాలు దొర్లిపోయేసరికి ఆడదాని

మనసు మారుంది. కొత్త బంధాలు, బాధ్యతలు ఏర్పడు తాయి. ఇప్పుడామెను నేను కలుసుకొంటే పానకంలో పుడకవుతాను" అన్నాడతను.

అతడు లేచాడు—ఆమెకు నమస్కరించి బయటకు నడిచాడు. ఆటోలో కూర్చున్నాడు. ఆటో కదిలింది.

ఒకచోట దిగి అతడు కొన్ని బిస్కట్ పాకెట్లు, చాక్లెట్లు కొన్నాడు. మళ్ళా ఆటో యెక్కాడు.

"కామాక్షమ్మ అనాధాశ్రమానికి పోనీ!" అన్నాడు డ్రయివర్‌తో.

ఒక గేటుముందు అతడు ఆటోలోంచి దిగాడు. మీటర్ చూసి డబ్బు చెల్లించాడు. మెల్లిగా లోపలకు నడిచాడు.

ముందు హాల్లో కూర్చున్న కామాక్షమ్మ ముందుకు నడిచి ఆమెకు నమస్కరించాడు.

"రాజేశ్వరి ఇక్కడ ఒక కుర్రాడిని చేర్పించింది. అతడిని చూడాలి" అన్నాడతను.

"ఉండండి" అని ఆమె లోపలకు వెళ్ళింది.

కాస్సేపట్లో ఒక కుర్రాడు హాల్లో కొచ్చి అతడివైపు చూశాడు.

ఆ కుర్రాడివైపు అతను కన్నీళ్ళతో చూశాడు. తన చేతిలోని పాకెట్లను ఆ కుర్రాడికిచ్చాడు.

"అవన్నీ నీకే! తీసుకో బాబూ!" అన్నాడతను.

"ఇవన్నీ అమ్మ పంపిందా?" అడిగాడు కుర్రాడు.

"అమ్మే పంపింది!" అన్నాడతను.

"అమ్మ ఏదీ?"

"రాలేదు. వస్తుంది తర్వాత."

"అమ్మకి నామీద కోపం. రాడం మానేసింది!"

"అమ్మకి నీమీద కోపం రాదు!"

"నే పోవచ్చా?" అడిగాడు చక్రాదు.

"వెళ్ళు, బాబూ" అన్నాడతను.

ఆ పాకెట్లను అక్కడే పడేసి వెనక్కి తిరిగాడా చక్రాదు.

"ఆ పాకెట్లు!" అన్నాడతను.

"అమ్మ వచ్చి యిస్తేనే తింటాను" అని ఆ చక్రాదు వెళ్ళిపోయాడు లోపలకు.

కామాక్షమ్మ హాల్లోకొచ్చింది. నేలమీద వున్న పాకెట్లవైపు చూసింది.

"కామాక్షమ్మగారూ!" పిల్చాడతను.

"చెప్పండి" అందామె.

"ఆ బిస్కట్లు, చాక్లెట్లు మీ పిల్లలకు పంచిపెట్టండి" అన్నాడతను.

"అలాగే చేస్తాను" అందామె.

అతడు నమస్కరించి వెనక్కు తిరిగాడు. జీవంలేనట్లు రోడ్డుమీదకు నడిచాడు. తన జీవితం గురించి ఆలోచిస్తూ మెల్లిగా అడుగులు వేయసాగాడు.

# 9

రెండు కొండల మధ్య లోయలో వాళ్ళు నడుస్తున్నారు.

కుక్కలు ముందు పరుగెడుతున్నాయి. ఆమె తటాలున ఆగి అతడివైపు చూసింది.

"ఒక వేటంటే నాకెంతో సరదా!" అందామె.

"జింకల్ని చంపడమా?" అడిగాడు వెంకట్రావు.

"కాదు. జింకకి బదులు నువ్వు యీ అడవిలో పరుగెత్తాలి, నీ ప్రాణాన్ని కాపాడుకో నేందుకు—రైఫిల్ లో

నేను నీ వెనకవే రావాలి! నిన్ను చంపడానికి! నాకు చిక్కకుండా, నా గుళ్ళకు బలవకుండా నువ్వు రక్షించుకొంటూ పారిపోవాలి!" అందామె.

అతడి మొహం పేలవంగా తయారైంది.

"రాజీ, ఏమిటి నువ్వనేది? నేను నీ గుళ్ళకు బలైపోతే, నన్ను నేను కాపాడుకోలేకపోతే నా గతి ఏమవుతుంది?"

ఆమెవైపే చూశాడతను. ఆమె కళ్ళు మొహం ఎర్రబడ్డాయి. ఎందుకో ఆ క్షణంలో ఆమెను చూస్తే అతడి ఒళ్ళు జలదరించింది.

"చెప్పు, రాజీ!" అన్నాడతను.

"నా గుళ్ళకు బలైతే నువ్వు చస్తావు. నీ శరీరాన్ని ఇక్కడే కాల్చి మాంసం ముద్దలను నరికి నా కుక్కలకు పడేస్తాను. అవి వృ[illegible]రుగా తింటాయి!" అందామె.

"యూ ఆర్ కానిబాల్" అర్చాడతను.

"యూ ఆర్ బాస్టర్డ్! నీకు పెళ్ళయింది. పిల్లలు కూడా వున్నారు నన్ను పెళ్ళాడ్తానని అబద్ధాలు చెప్తూ నా వెంటబడ్డావు. నన్ను మోసగించాలని నీ తాపత్రయం. నీ గురించి అన్నీ కనుక్కొనే ఇక్కడకు తీసుకొచ్చాను, నీతో నాకు సరదా అయిన ఆట ఆడ్డానికి! నీలాంటి మోసగాడిని ఒక్క బులెట్‌తో షూట్ చేయడమంటే నాకెంతో సరదా."

అతడు వణుకుతున్నాడు.

"ప్లీజ్, నన్ను పోనీ! నీతో అబద్ధాలు చెప్పాను, నిజమే. ఇటుపైన నీ దగ్గరకు యెన్నడూ రాను!" అన్నాడతను.

"నువ్వు ఆడవలసిందే! బి ఎ మేన్! పిరికిపందలా ప్రవర్తించకు. నీకు ఐదు నిమిషాలు టైము ఇస్తున్నాను. నీ యిష్టమొచ్చిన వైపు పారిపో! ఎక్కడో దాక్కో! ఈ ఆటలో నెగ్గే అవకాశం నీకూ వుంది!"

"నో, నేను నెగ్గలేను. నాకు షూటింగ్ తెలియదు. నే నెక్కడున్నా నీ కుక్కలు నన్ను పసిగడ్తాయి. నీ చేతుల్లో చచ్చి నీ కుక్కలకు తిండి కావలసిన గతి నాకు పట్టింది! నన్ను క్షమించు. నన్ను పోనీ!"

"అది జరగదు. జింకలా, కుందేల్లా పరుగెత్తు. ఐదు నిమిషాల్లో చాలాదూరం పోవచ్చు నువ్వు. ఐదు నిమిషాలు గడిచాకే నేను నీకోసం వేటాడ్తాను. గెట్ రెడీ! స్టార్ట్!" అరిచిందామె.

అతడి భుజానికున్న సంచి కిందపడింది. చేతిలోని రైఫిల్ని అతడు నేలమీద పడేశాడు.

తటాలున వెనుదిరిగి అతడు పరుగెత్తాడు. సంచినీ, రైఫిల్నీ ఆమె తీసుకుంది.

అతడి ఆకారం కనిపిస్తోంది. ఎన్నో చెట్లు దాటి అతడు వెళ్ళిపోయాడు. అతడి ఆకారం యిప్పుడు కనబడ్డంలేదు.

ఆమె టైమ్ చూసింది. ఐదు నిమిషాలు దాటింది.

"టామ్, లూసీ, స్కాట్—గోఫర్ హిమ్! కాచ్ హిమ్!" అరిచిందామె.

కుక్కలు పరుగెత్తాయి. వెనకనే ఆమె పరుగెత్త సాగింది. ఆమె చేతిలో వున్నది స్పెషల్ అమెరికన్ రైఫిల్. ఇరవై ఐదుసార్లు షూట్ చేయొచ్చు!

పది నిమిషాలపాటు కుక్కలు యిటూ అటూ పరు

గత్తి చివరకి ఒక చెట్టుకింద ఆగాయి. పైకి చూసి మొరగడం ప్రారంభించాయి.

ఆమె చెట్టుకిందకు వెళ్ళింది. ఆకులు దట్టంగా వున్నాయి. ఎక్కడా అతడి రూపం కనబడ్డంలేదు. కొమ్మచుట్టూ మెలికలు తిరిగి కిందకు వేళ్ళాడుతున్న కొండ చిలువ ఆమెకు కనిపించింది. లావుగా చాలా పొడుగ్గా వుందది.

రైఫిల్ని గురిపెట్టి ఆమె రెండుసార్లు షూట్ చేసింది. మూడు ముక్కలై కొండచిలువ మెల్లిగా కిందపడింది. మూడు కుక్కలూ మూడు ముక్కల్నీ నలిపి తొక్కాయి.

ఆమె మరోసారి చెట్టువైపు షూట్ చేసింది. కొన్ని చిన్న కొమ్మలు చప్పుడు చేస్తూ కిందపడ్డాయి.

ఆమె చెట్టు చుట్టూ తిరుగుతూ పైకి చూసింది. అతడి ఆకారం ఎక్కడా కనపడలేదు!

ఒకనాటి దృశ్యం ఆమెకు గుర్తుకొచ్చింది. చిరుతపులి రాకకోసం ఎదురుచూస్తూ ఆమె, నాన్న చెట్టెక్కి కూర్చున్నారు. చెట్టుమీదున్న మనిషికోసం ఆమె ఈనాడు పులిలా కింద నిలబడి వుంది!

ఆకుల చప్పుడు లీలగా వినిపించింది. కుక్కలు పక్కనున్న మరో చెట్టుకిందకు దూసుకు పోయాయి.

ఆమె అటువైపు నడుస్తూ పైకి చూసింది. రెండు చెట్ల కొమ్మలూ దగ్గరగా వున్నాయి. అతడు టార్జన్‌లా ఆ రెండో చెట్టుమీదకు చేరుకొని వుండాలి! అతడున్న స్థలాన్ని కుక్కలు సరిగ్గా పోల్చాయి.

అరగంటలో చీకటి పడ్తుంది. అటుపైన చీకట్లో

అతడిని కనుక్కోడం అంత సులువైన పనికాదు.

ఆమె కుక్కలను పిల్చింది. కొంచెం దూరం వెళ్ళి ఒక పొద పక్కనే ఆమె దాక్కుంది. కుక్కలు మౌనంగా కింద పడుకున్నాయి. పొద పైనుంచి ఆమె రహస్యంగా చూస్తోంది.

చెట్టుమీదనుంచి కిందకు దూకి అతడు పిచ్చివాడిలా పరుగెత్త సాగాడు. అతడివైపు ఆమె రెండుసార్లు షూట్ చేసింది. కాని అతడు నేలకూలలేదు.

అటువైపు ఆమె పరుగెత్తింది.

"గెట్ హిమ్!" అందామె కుక్కలతో.

కుక్కలు అతడివైపు పరుగెత్తాయి. ఆమె కుక్కల వెనకనే కదుల్తోంది.

పరుగెడుతూన్న వెంకట్రావు సమీపంలో వున్న ఒక వ్యక్తివైపు దూసుకు వెళ్ళాడు. అతడి కాళ్ళమీద పడ్డాడు.

"నన్ను చంపుతోందామె! రక్షించండి!" అర్చాడతను, ఆయాసంతో.

ఈ అడవిలో మరో మనిషి కనిపించినందుకు వెంకట్రావు సంతోషించాడు.

కుక్కలు అక్కడకు మొరుగుతూ వచ్చాయి.

"టామ్, లూసీ, స్టాట్, గో బాక్!" అర్చాడా వ్యక్తి.

కుక్కలు అమాంతంగా వెనుదిరిగి వెళ్ళిపోయాయి.

ఆ వ్యక్తి కుక్కల వెనకనే వెళ్ళాడు. ఎదురుగా వస్తోంది రాజేశ్వరి! రెండు రైఫిల్సు, సంచితో ఆమె భద్రకాళిలా అగుపిస్తోంది!

ఆమెవైపు అతడు ఆవేశంతో చూశాడు. అతడి గుండె వేగంగా కొట్టుకుంది.

"రాజీ, ఏం చేస్తున్నావు నువ్వు? అతడిని చంపడానికి ప్రయత్నిస్తున్నావా?" అన్నాడతను.

"నువ్వా!" అందామె పళ్ళు పటపట కొరుకుతూ.

"నేనే" అన్నాడతను.

రైఫిల్ని అతడివైపు తిప్పిందామె.

"నిన్ను షూట్ చేసి చంపి, తునాతునకలు చేసి నీ మాంసాన్ని కుక్కలకు పడేస్తా!" అందామె.

అతడు స్లాక్ బటన్లు విప్పేశాడు.

"నీ చేతుల్లో చావడంకంటే ఈ జీవితంలో నేను ఆశించేది మరేముంది రాజీ! షూట్ మి! కిల్ మి! బుచ్చర్ మి! కాని అదంతా చేసేముందు నేను చెప్పేది విను. తర్వాత నీ ఇష్టమొచ్చినట్లు నా శరీరాన్ని చిత్రవధ చేసుకో. నేను యెక్కడికీ పారిపోలేను. నా హృదయంలో వున్నది నువ్వే! అందుకే ఇక్కడికొచ్చాను" అన్నాడతను.

"ఈ నాలుగేళ్ళూ యేమయ్యావు?" బులెట్‌లా ప్రశ్నించిందామె.

"నాలుగేళ్ళ క్రితం ఒక రాత్రి నేను బస్సులో బెంగుళూరు నుంచి మద్రాసు వస్తున్నాను. మర్నాడు పొద్దుటే నీ ఇంటికి వస్తావన్నాను. కాని విధి నా జీవితాన్ని మార్చేసింది."

"మరో పిల్లను పెళ్ళాడావా?" అందామె కొంటెగా.

"బందిపోటు దొంగలు మా బస్సును ఆపారు. అంతా దోచుకున్నారు. నేనూ, మరో ముగ్గురు యువకులూ

వాళ్ళను ఎదిరించాం. వాళ్ళు మా నలుగురినీ బలవంతంగా తీసుకుపోయారు. వాళ్ళ స్థావరం కొండల మధ్యన వుంది. ఈ నాలుగు సంవత్సరాలూ నేను అక్కడే వున్నాను. బయటకు కదిలే అవకాశం నాకు లేకుండా పోయింది. ఎవ్వరికీ ఉత్తరాలు కూడా రాయలేక అందరికీ దూరమయ్యాను."

"అక్కడ నువ్వు ఏం చేశావు?" అడిగిందామె.

"వాళ్ళ గుడ్డలు వుతికాను. వాళ్ళకు నీళ్ళు మోశాను. పప్పు రుబ్బాను. అంట్లు తోమాను. నా చేతులు యెలా మొద్దుబారిపోయాయో నువ్వే చూడు! ఎప్పుడో ఒకనాడు నిన్ను మళ్ళా కల్సుకుంటాననే ఆశ, నా ప్రియురాలికి దగ్గరవుతాననే విశ్వాసం, వాళ్ళు పెట్టే బాధలకు కృంగి, బలయిపోకుండా నన్ను కాపాడి, నా ప్రాణాల్ని నిలబెట్టాయి. వారం రోజుల క్రితం మేం పారిపోగల్గాం అక్కడనుంచి. మాకు కాపలాగా వుండే వ్యక్తి పాము కాటుకి బలయి మరణించాడు. మేం నలుగురం పారిపోయి సమీపంలో వున్న పల్లెకు చేరుకున్నాం. అక్కడనుంచి మద్రాసు వచ్చాను. నీకోసం నీ ఇంటికి వెళ్ళాను. డాక్టర్ పద్మిన్ని కలుసుకున్నాను. అనాధాశ్రమంలో నువ్వు వదిలేసిన బాబును కూడా చూసి ఇక్కడకు వచ్చాను" అన్నాడతను ఏడుస్తూ.

ఆమె చేతిలో వున్న రైఫిల్సు కిందపడ్డాయి.

"రాజా! నా రాజా!" అందామె ఏడుస్తూ.

ఆమె అతడివైపు కదిలింది. చేతుల్తో అతడిని చుట్టేసింది. కన్నీళ్ళతో అతడికి ప్రేమాభిషేకం చేసింది.

ఇద్దరూ కౌగలించుకుని చలనం లేకుండా కొంతసేపు వుండిపోయారు.

వెంకట్రావు మెల్లిగా వాళ్ళ దగ్గరకొచ్చాడు.

"అంతా విన్నాను, రాజా. హంతకురాలు కాకుండా ఆమెనీ, ప్రాణం పోకుండా ఇటు నన్నూ నువ్వు కాపాడావు!" అన్నాడు. వెంకట్రావు.

"పదండి పోదాం ఇంటికి" అందామె.

కుక్కలు ముందు పరుగెత్తాయి.

రాజా, రాజేశ్వరి, వెంకట్రావు వెనకనే వుషారుగా నడిచారు.

—:అ యి పో యిం ది:—

# పెద్దింటి పిల్ల

## మిస్ కె. మధుబాల

ఆమె వయసు వూహాతీతంగా వుంది. పధ్దెనిమిది నుంచి ఇరవై ఎనిమిదిదాకా ఆమె వయస్సు ఎంతైనా వుండొచ్చని చూసేవాళ్ళు అనుకోవచ్చు.

ఆమె ఖరీదైన మైసూర్ సిల్కు చీర ధరించింది. మెళ్ళో చక్కటి గొలుసుంది. జడ పొడుగ్గా కిందకు వాలింది. పెద్ద కళ్ళు. యాపిల్ పళ్ళలా వున్న పెదిమలు. తెల్లటి పళ్ళు.

ఎడంచేతికి చక్కటి వాచ్. కుడిచేతికి మూడు బంగారం గాజులు. ఆమె వేసుకొన్న స్లిప్పర్లు చీర రంగులో వున్నాయి.

ఫియట్ కారు పక్కనే ఆమె నిలబడి వుంది. రోడ్డమ్మట పోతున్న కార్లవెపు ఆమె చూస్తోంది. మారుతీ కారు ఆమె పక్కనే ఆగింది. ఒక యువకుడు నవ్వుతూ ఆమెవంక చూశాడు.

"మిస్ ఎనీ ట్రబుల్ ?" అడిగాడతను.

"బాడ్ లక్! ఇంజన్ ట్రబులిస్తోంది."

"నా కారులో రండి. తర్వాత మీ కారుకోసం మెకానిక్‌ను పంపొచ్చు" అన్నాడతను.

"థాంక్స్" అని ఆమె కారు కిటికీ అద్దాలను ఎత్తి తలుపులను లాక్ చేసింది,

ఉషారుగా వచ్చి అతడి పక్కనే ముందుసీటుమీద కూర్చుని తలుపు మూసింది.

అతడు కారును పోనిచ్చాడు, ఓరగా ఆమెవంక చూస్తూ.

చక్కటి సెంటు సువాసన ఆమెనుంచి గాలిలో వ్యాపిస్తోంది.

"నా పేరు గోపాలరావు, మీరు గోపాల్ అని పిలవొచ్చు" అన్నాడతను.

"నా పేరు రీతా" అందామె.

"ఎక్కడికెళ్ళాలి?"

ఆమె నవ్వుతూ అతడివంక చూసింది.

"చిన్న సహాయం చేస్తే నేను సంతోషిస్తాను" అందామె.

"ఏం కావలసినా చెప్పండి. నేను ప్రస్తుతం ఫ్రీగానే వున్నాను."

"మా మెకానిక్ వర్క్‌షాపుకు పదండి. కారు ఇగ్నిషన్ కీ అతడి కిచ్చి, వెళ్ళి నా కారును చూడమంటాను. ఈ దేశంలో రోడ్డువారగా కారును ఎక్కువసేపు వది లేస్తే గూండాలు అన్నీ పీక్కుపోతారు" అందామె.

"యూ ఆర్ రైట్! మీ మెకానిక్ ఎక్కడున్నాడు?" ప్రశ్నించాడతను.

"టిప్పా ఆటోమొబైల్ వర్క్‌షాప్, పాంథియన్ రోడ్డులో వుంది."

అతడు కారును అటువైపు పోనిచ్చాడు. సాయంత్ర సమయం. సూర్యుడు అ స్తమించాడు.

కాని యింకా చీకటి పడలేదు. ఆఫీసుల్లో పనిచేసే వాళ్ళు, కాలేజి స్టూడెంట్లు యిళ్ళకు బస్సుల్లో పోతు న్నారు.

టిప్పా వర్క్‌షాపు ముందు అతడు కారును ఆపాడు. గ్రీస్ మరకలతో మాసిన ఖాకీ దుస్తులు ధరించిన ఒకతను కారు దగ్గరకొచ్చాడు. ఆమె దగ్గరకు వెళ్ళమని గోపాల రావు సౌజ్ఞ చేశాడు.

కారు ఇగ్నిషన్ కీని ఆమె అతడి కిచ్చింది.

"కెనాల్ రోడ్డు వారగా వుంది నా ఫియట్ కారు. అది రిపేరు చేసి ఇక్కడ వుంచండి. తర్వాత ఇక్కడి కొచ్చి తీసుకెళ్తాను" అందామె.

"ఫియట్ కారు నంబరెంతమ్మా?" మెకానిక్ అడి గాడు.

ఆమె చెప్పింది.

"వెంట నే వెళ్తానమ్మా" అన్నాడతను.

ఆమె గోపాలరావుకేసి చూసింది.

"చాలా థాంక్స్ మీకు. కారును పోనీయండి" అందామె.

కారు స్లో స్పీడులో వెళ్తోంది. ఎదురుగా టాక్సీస్టేండు కనిపించింది.

"ఇక్కడ నన్ను దింపేస్తే టాక్సీలో పోతాను" అందామె.

"నా కారు టాక్సీ అనుకోండి!"

ఆమె కిలకిల నవ్వింది. కళ్ళు చిట్లించి అతడి వంక చూసింది.

"మీరు ఏం చేస్తున్నారు?"

"అన్నయ్యా, నేనూ మా తండ్రిగారు స్థాపించిన ఫ్యాక్టరీలను చూసుకుంటున్నాం. నాన్నగారు చని పోయారు. మాకు ఒక్కతే చెల్లెలు. ఆమెకు పెళ్ళయి పోయింది. అన్నయ్యకు పెళ్ళయి సంవత్సరమైంది. వదిన గర్భవతి. ఆమె త్వరలో పుట్టింటికి వెళుతుంది. ఇంట్లో అమ్మా, అన్నయ్యా, వదినా, నేనూ వుంటున్నాం."

"మీ చరిత్ర చెప్పేశారు. నా గురించి కూడా చెప్ప మంటారా?"

"చెప్పండి."

"అండీ అనడం మానేస్తే చెప్తాను."

"చెప్పు రీతా! నువ్వు నన్ను గోపాల్ అని పిలవాలి" అన్నాడతను.

"ఆల్‌రైట్. అమ్మా నాన్నా అమెరికా వెళ్ళారు. నా తండ్రి పేరు మీరు వినే వుంటారు, జాన్‌సన్. ఆయన పేరుపొందిన ఆర్కిటెక్ట్. నాకొక అన్నయ్య మాత్రం వున్నాడు. ఎమ్మే పాసయి ఎమ్.బి.ఎ. చేస్తున్నాడు. అతడి పేరు శామ్‌సన్. నేను క్రిస్టియన్ కాలేజీలో బి.ఎ. ఫైనలియ్యర్ చదువుతున్నాను. లిటరేచర్ నా సబ్జెక్టు" అందామె.

అతడు స్పీడు తగ్గించాడు.

"ఇలా చాలా దూరం వచ్చేశాం. నీ మాటలు వింటూ లోకాన్నే మర్చిపోయాను. మీ యిల్లెక్కడ?"

"ఇంకా వెళ్ళాలి."

హోటల్ ఇరోజ్ నేమ్ బోర్డు చూశాడతను.

"కాస్త కాఫీ తాగుదాం వస్తావా?"

"పద తాగుదాం" అందామె.

అతడు కారును హోటల్ ఇరోజ్ కాంపౌండులోకి పోనిచ్చాడు.

## 2

ఆమె ఇంటికి కొంచెం దూరంగా అతడు కారు ఆపాడు. కారులోనే కూర్చుని సిగరెట్ వెలిగించాడు. పొగ పీల్చి వదులుతూ టైమ్ చూశాడు. ఐదు కావస్తోంది.

గేటు దాటి ఆమె బయటకొచ్చింది. సమీపంలో ఆగిన కారువైపు ఆమె చూసింది. గబగబా అటువైపు నడిచింది.

ఆమెకేసి గోపాల్ నవ్వుతూ చూశాడు.

"హై, రీతా!" అన్నాడతను.

"హై, గోపాల్" ఆమె ముందుసీటుమీద కూర్చుని తలుపు మూసింది.

అతడు కారును పోనిచ్చాడు.

"నువ్వు వస్తావో రావో అనుకున్నాను!"

"లక్కీ, అన్నయ్య ఇంట్లో లేడు. వుంటే వెయ్యి ప్రశ్నలు వేసేవాడు" అందామె.

"క్రిస్టియన్స్ చాలా ఫ్రీగా వుంటారని నేననుకొంటున్నాను" అన్నాడతను.

"అదంతా నీ యిమాజినేషన్. మేం కన్వర్టెడ్ క్రిస్టియన్స్. మతం మారినా పాతకాలపు అలవాట్లు మాలో పోలేదు" అందామె.

"మాలాగే మీరూ వున్నారన్న మాట!" అన్నాడతను నవ్వుతూ.

హోటల్ ఇరోజ్‌లో టిఫిన్ తిని, కాఫీ తాగి యిద్దరూ బయటకు నడిచారు.

"మహాబలిపురం వెళ్దామా?" అన్నాడతను.

"ఎందుకు?" అడిగిందామె అమాయకంగా.

"అక్కడ మనం ఏకాంతంగా కూర్చోవచ్చు" అన్నాడతను.

"మా యింటికి పోదాం, పద. అక్కడ యెవ్వరూ లేరు. అన్నయ్య రాత్రి పన్నెండు దాకా తిరిగి రాడు" అందామె.

"పద, వెళ్దాం" అన్నాడతను.

కారును వేగంగా పోనిచ్చాడతను. తేనాం పేటలోని ఒక పెద్ద యింటి కాంపౌండులోకి కారును పోనిచ్చి ఆపాడతను.

ఇద్దరూ కార్లోంచి దిగారు. ఏ నౌఖరూ కారువైపు రాలేదు.

"మీ యింట్లో నౌఖర్లు లేరా?"

"పనిమనుషులు యింటిలోపల తిరుగుతూ వుండడం నాన్నకు నచ్చదు. వున్నా నౌఖర్లు పని ముగించి వెళ్ళిపోతారు. ఎవ్వరూ ఇక్కడ వుండరు" అందామె.

ఆమె ముందు లాక్‌ని తెర్చింది. లోపలకు వెళ్ళాక ఆమె తలుపును మూసింది. ఏర్ లాక్ క్లిక్‌మంది.

మేడ మెట్లెక్కి వాళ్ళు పైకి వెళ్ళారు. హాల్లో వున్న సోఫాలో అతడిని కూర్చోమని ఆమె లోపలకు వెళ్ళింది.

పది నిమిషాల్లో ఆమె తిరిగి వచ్చింది. పల్చటి నైటీ ధరించిందామె. లోపలున్న పావడా స్పష్టంగా కనిపిస్తోంది.

అతడి పక్కనే అదే సోఫాలో ఆమె కూర్చుంది.

"టీ తాగతావా?" అడిగిందామె.

"ఎవరు తయారుచేస్తారు?" అడిగాడతను.

"నేనే."

"నాకు టీ వద్దు. ఇలా నా పక్కన కూర్చో. నీకేసి చూస్తూ ఇలాగే వుండిపోతాను" అన్నాడతను.

అతడివంక చూసి ఆమె నవ్వింది.

"నీకు ఆడస్నేహితులు లేరా?"

"సాధారణంగా ఆడవాళ్ళకు నేను దూరంగా వుంటాను."

"కారుపక్క నిలబడిన నన్ను చూడగానే పలకరించావు!" అందామె.

"నువ్వు ఏం కష్టంలో యిరుక్కున్నావో అని పలకరించాను" అన్నాడతను.

ఎలక్ట్రిక్ బెల్ మ్రోగింది. ఆమె కిందకు వెళ్ళింది. రెండు నిమిషాల తర్వాత తిరిగి వచ్చింది.

"డోర్ టు డోర్ కాన్వాసింగ్ చేసి సబ్బులమ్మే యువతులను చూస్తే నాకు ఒళ్ళు మండుతుంది! వాళ్ళ కోసం మెట్లు దిగి కిందకు వెళ్ళి పైకి రావాలి!" అందామె.

"నువ్వు యెక్కడ పడుకొంటావు!" అడిగాడతను విషయాన్ని మారుస్తూ.

"ఆ గదిలో" అందామె.

అతడు లేచాడు. మెల్లిగా ఆమె గదిలోకి నడిచాడు. వెనకనే ఆమె వచ్చింది.

"ప్లీస్, యీ గదిలోకి మరెవరేనా వస్తే అన్నయ్య తిడ్తాడు" అందామె.

"అన్నయ్య ఇప్పుడు ఇంట్లో లేడుగా?"

"లేకపోవచ్చు. ఈ గదిలో సిగరెట్ కాల్చి ఏమూలో పడేస్తావు. అన్నయ్య దాన్నిబట్టి పోలుస్తాడు."

"డోంట్ బాదర్, సిగరెట్ కాల్చనులే" అన్నాడతను.

ఎదురుగా ఫోమ్ బెడ్ వుంది. రెండు గాడ్ రెజ్ బీరువాలున్నాయి. గదిలో చిన్న టేబులు, రెండు కుర్చీలు వున్నాయి.

అతడు మెల్లిగా వెళ్ళి పరుపుమీద కూర్చున్నాడు. ఆమెవంక నవ్వుతూ చూశాడు. నైటీలో ఆమె రంభలా వుంది. ఆమె స్తనాలు కొట్టొచ్చినట్లు అగుపిస్తున్నాయి. అతడి రక్తంలో యెన్నో కోరికలు మిళితమై ప్రవహిస్తున్నాయి.

"రీతా, ఐ లవ్ యు!" అన్నాడతను.

ఆమె దగ్గరగా నడిచింది. పరుపుమీద పక్కనే కూర్చుంది.

"సారీ, నిన్ను నేను లవ్ చేయలేను. నన్ను పెళ్ళాడబోయే వ్యక్తి అమెరికాలో వున్నాడు. అతడు తిరిగి రాగానే మా పెళ్ళి జరుగుతుంది."

ఆమెవైపు అతడు సూటిగా చూశాడు.

"అది ముందట్లోనే నాతో యెందుకు చెప్పలేదు? ఇంతవరకూ వచ్చాక నన్ను వెనక్కు పొమ్మంటే నేను యెలా పోగలను?" అన్నాడతను.

ఆమె మాట్లాడలేదు. వెర్రిదానిలా అతడివైపు చూస్తూ వుండిపోయింది.

అతడి చేతులు ఆమెను చుట్టేశాయి. కళ్ళలోకి చూస్తూ అతడామె పెదిమలను పదే పదే ముద్దెట్టుకొన్నాడు.

"గోపాల్, నన్ను వదులు!" అందామె.

"నా ప్రాణం పోయినా నిన్ను వదలను. వదల్లేను" అన్నాడతను.

"నేను నిన్ను పెళ్ళాడలేను" అందామె.

"నన్ను పెళ్ళాడకపోయినా, ఈనాటి యీ దృశ్యం నా హృదయంలో చెరగని ముద్రలా వుండిపోతుంది" అన్నాడతను.

ఆమె బరువుగా వూపిరి పీల్చింది. అతడామెను పరుపు మీద పడుకోబెట్టి పక్కనే వాలిపోయాడు.

భయంతో ఆమె అతడివంక చూసింది.

"బయటకు పోదాం పద! నాకు భయంగా వుంది" అందామె.

కాని అతడామెను వదల్లేదు. ఆమె ముఖంమీద ముద్దుల వర్షం కురిపించసాగాడు. క్షణంలో యిద్దరూ మబ్బులమీద తేలిపోసాగారు. అమాంతంగా ఆమె అతడి వెనక తన చేతులను పెనవేసింది.

తటాలున తలుపును తోసి ఒకతను గుమ్మంలో యమ దూతలా నిలబడ్డాడు.

ఇద్దరూ కిందకు దూకారు. ఆమె బాత్ రూమ్‌లోకి పరుగెత్తింది. తలుపును లోపలనుంచి మూసేసుకొంది.

తన పాంటు సర్దుకొని గోపాలరావు అతడివైపు గాభరాగా చూశాడు.

అతడు పొడుగ్గా, వస్తాదులా వున్నాడు. పాంట్, టీషర్ట్ ధరించాడు.

అతడు వేగంగా బాత్ రూమ్ ముందుకు వెళ్ళి తలుపును గట్టిగా కొట్టాడు.

"చెల్లీ, బయటకు రా!" అరిచాడతను.

ఆమె తలుపు తెరవలేదు. అతడు కోపంగా గోపాలరావు వంక చూశాడు.

"రాస్కెల్, నా చెల్లెల్ని రేప్ చేశావా? నిన్ను చావ

గొట్టి పోలీసులకు అప్పగిస్తాను” అరిచాడతను.

బాత్ రూమ్ తలుపు తెరిచి ఆమె భయంతో బయట కొచ్చింది.

“అన్నయ్యా, అతడు నాతో యిక్కడకి వచ్చాడు. నేను యెంత వద్దన్నా వినకుండా ఆ స్థితికి లాక్కెళ్లాడు” అందామె, ఏడుస్తూ.

అతడు గోపాలరావుని చంపమీద గట్టిగా కొట్టాడు. ఈడ్చుకెళ్ళి అతడిని హాల్లోని సోఫాలో కూర్చోబెట్టాడు.

“నా సిస్టర్ని రేప్ చేశావు. ఆమెకు భవిష్యత్తు లేకుండా చేశావు. పోలీసు రిపోర్టు ఇస్తాను” అని అతడు ఫోన్ వైపు వెళ్ళాడు.

రిసీవర్ యెత్తి యేదో నంబరు తిప్పాడతను.

పరుగెత్తుకు వెళ్ళి గోపాలరావు నాబ్ నొక్కి ఫోన్ని డిస్కనెక్ట్ చేశాడు.

“మిస్టర్, అయిందేదో అయిపోయింది. కడుపును కోసుకుంటే నీ కాళ్ళమీదే పడుతుంది. ఇప్పుడు నన్నేమి చేయమంటావో చెప్పు! పోలీసులు రావడం అటు ఆమెకూ ఇక నాకూ మంచిది కాదు.”

“వెళ్ళి కూర్చో! నాలోని వుద్రేకం తగ్గాక నీతో మాట్లాడతాను” అన్నాడతను.

“అలాగే కూర్చుంటాను. లెటస్ సెటిల్ తింగ్స్” అన్నాడు గోపాలరావు.

అతడు మౌనంగా చెల్లెలున్న గదిలోకి వెళ్ళిపోయాడు.

హాల్లోని లైటు వెలుగుతోంది. గోపాలరావు టైమ్ చూశాడు. ఏడు దాటింది. కాలచక్రం తనకు తెలియకుండానే తిరిగిపోయింది!

పక్క గదిలోంచి రీతా ఏడుపు అతడికి వినపడ్తోంది.

గోపాలరావు హృదయం చివుక్కుమంది. ఆమెను తొందర పెట్టి అనవసరంగా కష్టాలపాలు చేసినందుకు అతడు లోలోపల విచారించసాగాడు.

సిగరెట్ వెలిగించి పొగ పీల్చి వదుల్తూ గోపాలరావు ఆలోచిస్తున్నాడు. ఈ విషయం పోలీసులదాకా వెళ్ళకుండా తను జాగ్రత్తపడాలి! ఇది తెలిస్తే తన తల్లి ఆత్మహత్య చేసుకొని మరణిస్తుంది!

ఆమె అన్న రాకతో పరిస్థితి విషమించింది. రాత్రి ఏ పన్నెండింటికో రావలసిన వాడు అంతలో రావడం తన దురదృష్టమే! ఏదో చేసి యీ యమకూపంలోంచి బయటపడాలి! పీడకలగా భావిస్తూ జరిగినదంతా తను మర్చిపోవాలి!

# 3

గోపాలరావు కెదురుగా అతడు కూర్చున్నాడు.

"నా పేరు శామ్‌సన్. నీ పేరు గోపాలరావని చెల్లి చెప్పింది. నా చెల్లెలు జీవితాన్ని నువ్వు నాశనం చేసేశావు. ఆమె అమాయకురాలు. నువ్వు మంచివాడవనుకొని యింటికి రమ్మంది. ఇంటికొచ్చి ఆమె జీవితానికే ఎసరు పెట్టావు. ఇటుపైన ఆమె ఏడుస్తూనే వుంటుంది" అన్నాడతను.

అతడివైపు సూటిగా చూశాడు గోపాలరావు.

"ఆమె కన్నీళ్ళను తుడవడానికి నేను ఏం చెయ్యాలో చెప్పు!"

"ఏం చెయ్యగలవు? కొంత డబ్బివ్వగలవు, కాని పోయిన మానాన్ని ఆమె తిరిగి కొనుక్కోగలదా? నువ్వే చెప్పు!" అరిచాడతను.

గోపాలరావు తలదించుకొని కూర్చున్నాడు.

"నా తలిదండ్రులు అమెరికాలో వున్నారు. వాళ్ళు ఇక్కడ వుండి వుంటే, నాన్న కమ్చీతో నిన్ను కొట్టి చంపివుండేవాడు. వాళ్ళకు ఇది తెలిస్తే ప్రమాదం!"

గోపాలరావు మాట్లాడలేదు.

"అమ్మకూ, నాన్నకూ ఇది తెలియకుండా వుంచడమే మంచేది. అమెరికాలో వున్న డేవిడ్ నా చెల్లెల్ని పెళ్లాడ్తాడో లేదో నేను ప్రస్తుతం చెప్పలేను. తన కాళ్ళమీద ఆమె నిలబడాలి! మాన నష్ట పరిహారంగా నువ్వు ఆమెకు రెండు లక్షలు యివ్వాలి. అది నా చేతికి వెంటనే అందాలి. తర్వాత నీ దారిన నువ్వు వెళ్ళిపోవచ్చు. జరిగింది ఆమె మర్చిపోయి జీవిస్తుంది. నేనూ అంతా మర్చిపోతాను" అన్నాడతను.

"రెండు లక్షలా?" అన్నాడు గోపాలరావు ఆశ్చర్యంతో.

శామ్సన్ మొహం కోపంతో ఎర్రబడింది. అతడు పిడికిలి బిగించాడు. పిడికిట్లో వున్న మెటల్ యాష్ట్రే నలిగిపోయింది.

"ఆమె చేతిలో ఏ వందో పెట్టిపోదామనుకున్నావా?" గద్దించాడు శామ్సన్.

"కోపం తెచ్చుకోకు! లక్ష ఇస్తాను. అంతకంటె ఇవ్వలేను."

"నీతో బేరమాడ్డం కంటె పోలీసులకు ఫోన్ చేయడం మంచిది" అని శామ్సన్ లేచాడు.

టెలిఫోన్ వైపు నడిచాడు. గుండె దడతో గోపాలరావు వెళ్ళి అతడిని ఆపాడు.

"అలా కూర్చో! రెండు లక్షలు ఇస్తాను. నేను వెళ్ళి డబ్బు తెస్తాను."

"నువ్వెళ్ళి రాకపోతే?"

"నా మాట నమ్ము!"

"నా చెల్లెల్ని రేప్ చేసిన వాడి మాట నేను నమ్మను. నిన్ను నమ్మిన నా చెల్లెల్ని ఏం చేశావు?"

"ఆమె నన్నంతగా నిరాకరించలేదు. దగ్గరకు నేను వెళ్తుంటే ఆమె పూరుకొంది. నాతో పోట్లాడివుంటే నేనామెను వదిలేసి వుండేవాడిని."

"అదామెకు ఏం తెలుసు? నిన్ను యెదిరిస్తే పీకపిసికి చంపుతావేమో అని ఆమె భయపడింది. ఏడుస్తూ అదంతా నాతో చెప్పింది."

"ఆ డబ్బు నా చేతికెలా వస్తుంది నే నిక్కడనుంచి వెళ్ళకుండా" అడిగాడు గోపాలరావు.

"డబ్బు నా చేతి కందేకే నువ్వు ఇక్కడనుంచి కదులావు. ఏం చేయాలో నువ్వే ఆలోచించుకో? అది నీ సమస్య" అన్నాడు శామ్సన్.

"నువ్వు యెవరి నేనా నాతో పంపొచ్చు. కావలిస్తే నువ్వే రావచ్చు" అన్నాడు గోపాలరావు.

"ఎవర్నీ పంపను. నేను రాను."

"పై మెట్టుమీద కూర్చుని కిందకు దిగనంటే యెలా మరి? నువ్వు అడిగిన రెండులక్షలూ ఇస్తా అన్నాను. నేను ఇంటికి వెళ్ళాలి. నా అన్నయ్యతో మాట్లాడాలి."

"నువ్వు యేం చెప్పినా నేను వినను. నువ్వు ఇక్కడ నుంచి కదిలే ముందు డబ్బు నా చేతికి అందాలి."

నిస్సహాయంగా గోపాలరావు సిగరెట్ వెలిగించాడు.

"నీ జేబులో ప్రస్తుతం యెంతుంది?"

గోపాలరావు పర్సుతీసి చూశాడు.

"ఐదు వేలు పైన వుంది."

"ఆ పర్సు ఇలా ఇయ్యి."

గోపాలరావు పర్సును అతడికిచ్చాడు, అతడా పర్సును తన పాంటుజేబులో పడేసుకున్నాడు.

"ఇది నా దగ్గర వుంటుంది. రెండులక్షలు నాకొచ్చాక యీ పర్సు నీకిచ్చేస్తాను."

"నా దగ్గర సిగరెట్లు కొనుక్కోడానికికూడా డబ్బు లేదు!" అన్నాడు గోపాలరావు.

"నువ్వు నా అతిథివి. నీకు కావలసినవి నేను సప్లయి చేస్తాను."

అతడు కొంతసేపు హాల్లో పచార్లుచేసి గోపాలరావు వంక చూశాడు.

"నాతోరా!"

అతడి వెనకనే కదిలాడు గోపాలరావు. చిన్న పడగదిలోకి ఇద్దరు ప్రవేశించారు. గదిలో మంచం వుంది. టెలిఫోన్ వుంది. యటాచ్‌డ్ బాత్‌రూమ్ తలుపు కనిపిస్తోంది.

గదికి ఒకే కిటికీ వుంది. పైన ఫాన్ తిరుగుతోంది.

"ఆ టెలిఫోన్ను నువ్వు వుపయోగించుకోవచ్చు, రెండు లక్షలు పోగుచెయ్యడానికి. మరే పనికీ ఆ ఫోను నీకు వుపయోగపడదు. నువ్వు ఫోన్‌లో చెప్పే ప్రతిమాటా నేను వింటాను. అండర్ స్టేండ్!"

గోపాలరావు తలాడించాడు.

"నాకు గోల్డుఫ్లేక్ కింగ్స్ పది పాకెట్లు కావాలి. అగ్గిపెట్లు అరడజన్. స్కాచ్ విస్కీ సోడా వగైరా" అన్నాడు గోపాలరావు.

"అన్నీ నీ గదికి వస్తాయి. ఈ గదిలోంచి ఎలా బయటపడాలో దాన్ని గురించి ముందు ఆలోచించు!"

అన్నాడతను.

"ఆల్ రైట్, ఆలోచిస్తాను" అన్నాడు గోపాలరావు.

అతడు బయటకు నడిచాడు. తలుపు మూశాడు. తాళంవేసి వేగంగా వెళ్ళిపోయాడు.

## 4

గోపాలరావు రెండు పెగ్గుల స్కాచ్ విస్కీ తాగేసి, మూడో పెగ్‌లో వున్నాడు. ప్లేటులో వున్న చిప్స్‌ను నవుల్తున్నాడు.

అతడు మెల్లిగా వెళ్ళి టెలిఫోన్ పక్కనున్న కుర్చీలో కూర్చున్నాడు. రిసీవర్ ఎత్తి తన ఇంటి నంబర్ తిప్పాడు.

"హలో!" అందో స్త్రీ కంఠం.

"నేను వదినా, గోపాల్" అన్నాడతను.

"ఇంకా రాలేదేమిటి, ఎక్కడున్నావు?" అడిగిందామె.

"ఢిల్లీ నుంచి ఒక ఫ్రెండు వచ్చాడు. అతడితో ఒక ఇంట్లో వున్నాను. అన్నయ్య ఏం చేస్తున్నాడు?"

"అదుగో వచ్చారు" అందామె.

"ఏంరా గోపాల్?" అన్నాడు అన్నయ్య, కాసేపయ్యాక.

"అన్నయ్యా, నాకు వెంటనే రెండు లక్షలు కాష్ కావాలి."

"ఎందుకురా?" అడిగాడు అన్న రామారావు.

"ఏదో కొత్త బిజినెస్ కొనడానికి ప్రయత్నాలు సాగిస్తున్నాను. కాష్ దగ్గరుండాలి."

"నువ్వు ఇంటికిరా, మాట్లాడుదాం."

"ఈ బిజినెస్ తేల్చుకుంటేగాని నేను ఇంటికి

రాలేను. నా ఫ్రెండు రేపు వెళ్ళిపోతున్నాడు."

రామారావు చాలా తెలివైనవాడు. తన తమ్ముడు ఎందులోనో ఇరుక్కుని వుండాలని అతడు గ్రహించాడు.

"ఎప్పుడు పంపాలి? ఎక్కడకు?"

"నా ఫ్రెండుతో మాట్లాడి చెప్తాను."

"చెప్పు" అని అన్న రిసీవర్ పెట్టేశాడు.

కాస్సేపట్లో గదిలోకి అతడు వచ్చాడు.

"మిష్టర్ శామ్సన్, డబ్బు ఇక్కడకు పంపమన్నా?"

"అది చెప్పడానికే వచ్చాను. వాణీ స్ట్రీట్ ఫ్లాట్ నంబరు 10కి పంపమను. రేపు పొద్దుట పన్నెండింటికి పంపమను. ఆ ఫ్లాట్‌లో నువ్వు లేకపోతే నీ మిత్రుడు రాజన్ వుంటాడని, డబ్బు అతడికిమ్మను."

"రాజన్ ఆ డబ్బుతీసుకు పారిపోతే?" అడిగాడు గోపాలరావు.

"రాజన్ యెక్కడికీ పారిపోడు. ఆ పేరుతో నేనక్కడ వుంటాను" అన్నాడతను.

"ఆల్‌రైట్ అలాగే చేస్తాను" అన్నాడు గోపాలరావు.

"నీకు కాస్సేపట్లో డిన్నర్ వస్తుంది."

"థాంక్స్, తొందరగా తినే అలవాటు లేదు నాకు" అన్నాడు గోపాలరావు.

అతడు బయటకు నడిచాడు. తలుపు మూసి లాక్ చేశాడు.

మెల్లిగా స్కాచ్ విస్కీ తాగుతూ గోపాలరావు అక్కడున్న పత్రికలను చూస్తున్నాడు. అన్న రామారావుతో అతడు మాట్లాడాడు. డబ్బును యెక్కడకు పంపవలసిందీ చెప్పాడు. పని పూర్తి అయ్యాక ఇంటికి

వస్తానన్నాడు.

"డోంట్ బాదర్! క్షేమంగా, లాభకరంగా బిజినెస్ చేసిరా" అన్నాడు అన్న.

గోపాలరావు తన వాచ్ వంక చూశాడు. టైము పది దాటింది.

అతడు మంచి నిషాలో వున్నాడు. అయినా ఇంకా తాగుతూనే వున్నాడు.

తాళం తీసిన చప్పుడైంది. కాసేపట్లో రీతా లోపలకు వచ్చింది. ఒక కేరియర్ని ఒక కంచాన్ని అతడి పక్కనే పెట్టింది.

"డిన్నర్ అందులో వుంది. నువ్వే పెట్టుకు తినాలి" అందామె.

"నువ్వెందుకిక్కడికొచ్చావు?" అడిగాడతను గాభరాగా.

"మరెవ్వరూ లేక."

"నీ అన్న ఏమయ్యాడు?"

"తన గదిలో వున్నాడు."

"జరిగినదానికి నన్ను క్షమించు!" అన్నాడతను.

"అన్నతో అలా చెప్పినందుకు నన్ను నువ్వు క్షమించాలి. అన్నంటే నాకు భయం. నా అంతట నేను నీకు లొంగిపోయానని చెప్తే అన్నయ్య నన్ను చంపుతాడు. అందుకని తప్పు నీమీదకు తోశాను" అందామె.

"నేనంటే నీకిష్టమేనా?" అడిగాడతను.

"నీ చేతుల్లో వుంటే నాకెంతో ఆనందంగా వుంది."

"నిజంగా?"

ఆమె తీయగా నవ్వింది.

అతడామె పెదిమలను ముద్దెట్టుకున్నాడు.

"అన్నయ్య పిల్లిలా వస్తాడు. నేను వెళ్తాను, గుడ్ నైట్" అందామె.

మెల్లిగా ఆమె బయటకు వెళ్ళిపోయింది.

# 5

టైమ్ ఒంటిగంట దాటింది. తాళం తెర్చి, తలుపు తోసుకుని అతడు లోపలకు వచ్చాడు. గోపాలరావు వంక సూటిగా చూశాడు.

"నువ్వు ఇస్తానన్న డబ్బు నా చేతికి అందింది. నువ్వు ఇక వెళ్ళొచ్చు" అన్నాడతను.

గోపాలరావు సోఫాలోంచి లేచాడు. ఒక పర్సును అతడు గోపాలరావుకిచ్చాడు. దాన్ని తెర్చి చూశాడతను. అందులో రెండు వందరూపాయిలనోట్లు మాత్రం వున్నాయి.

"ఇందులో ఇంకా డబ్బు వుండాలి" అన్నాడు గోపాలరావు.

"అదంతా ఖర్చయింది. అందులో వున్నదానితో నువ్వు తృప్తిపడాలి" అన్నాడతను.

గోపాలరావు సిగరెట్ వెలిగించాడు.

"మిష్టర్, జరిగినది ముగ్గురికి మాత్రం తెలుసు. నా చెల్లెలికి, నీకు, నాకు. ఎప్పుడూ దీన్ని గురించి ఎక్కడా మాట్లాడకు. మళ్ళా ఈ ఇంటివైపు నువ్వు ఎప్పుడూ రాకూడదు" హెచ్చరించాడతను.

"కల్లో కూడా రాను" అన్నాడు గోపాలరావు.

తన వస్తువులన్నీ తీసుకుని గోపాలరావు బయటకు వెళ్ళడానికి సిద్ధమయ్యాడు.

"థాంక్స్, వెళ్తా" అన్నాడు.

"నీకు ఏ ప్రమాదమూ రాకుండా నేను కాపాడ గల్గాను. నాన్న అయితే దేనికీ లొంగేవాడు కాదు. ఎక్కడా వాగకు!"

"వాగనని హామీ యిస్తున్నాను."

అతడు గోపాలరావును బయటకు తీసుకు వెళ్ళాడు. గోపాలరావు తన కారులో కూర్చుని తలుపు మూశాడు.

"మిస్టర్ శాంసన్, నీ చెల్లెలుకి నా గుడ్ విషెస్ అందజేయి. గాడ్ బ్లెస్ హార్!" అని అతడు కారును పోనిచ్చాడు.

కారును అతడు వేగంగా తన ఇంటివైపు పోనిచ్చాడు అతడి మెదడులో ఆలోచనలు సాగుతున్నాయి. రీతాకు తనంటే యిష్టమే! కాని అన్నంటే ఆమెకు భయం! ఆమెను గురించి ఆలోచిస్తూంటే ఎందుకో అతడికి జాలి కలిగింది!

ఇంటి ముందు కారాపి అతడు లోపలకు వెళ్ళాడు. హాల్లో కూర్చున్న తల్లి అతడివైపు నవ్వుతూ చూసింది.

"ఏమయ్యావురా, రాత్రి ఎక్కడున్నావు?" ప్రశ్నించిందామె.

"ఫ్రెండు యింట్లో వున్నానమ్మా" అని అతను పైనున్న తన గదికి వెళ్ళిపోయాడు.

తలుపు మూసి, అలసటగా పరుపుమీద పడుకున్నాడు. టెలిఫోన్ మ్రోగింది. వెళ్ళి అతడు రిసీవర్ని ఎత్తాడు.

"మీ అన్నగారు" అంది వదిన కిందనుంచి.

"హలో, గోపాల్" అన్నాడతను.

"ఒకేయ్, ఏమైంది? ఎందుకంత డబ్బు అర్జంటుగా కావలసి వచ్చింది" అడిగాడు అన్న రామారావు.

"అదంతా తర్వాత మాట్లాడుదాం" అన్నాడు

గోపాలరావు.

కిందనుంచి వదిన వాళ్ళ మాటలు వినొచ్చు! తనకు జరిగినది ఆమెకు తెలియడం గోపాలరావుకు ఇష్టంలేదు.

"ఆఫీసుకు వస్తున్నావా?"

"ఇవాళ రాను. నిన్న రాత్రి సరిగ్గా నిద్రపోలేదు. విశ్రాంతి తీసుకోవాలి" అన్నాడతను.

"ఆల్ రైట్, హేవ్ సమ్ రెస్టు" అని అన్నయ్య రిసీవర్ పెట్టేశాడు.

రాత్రి అన్నయ్య రామారావు అతడి గదిలోకి వచ్చాడు. జరిగినదంతా అతడు అన్నయ్యతో చెప్పాడు.

"ఆమె అన్న నన్ను ఆ ఇంట్లో ఖైదీగా వుంచేశాడు. డబ్బిస్తేగాని కదలడానికి వీల్లేదన్నాడు. డబ్బు ముట్టాక నన్ను వదిలేశాడు" అన్నాడతను.

"ఆ ఇల్లు యెక్కడుంది?"

"తేనేంపేటలో. చాలా పెద్ద ఇల్లు. ఆమె తలిదండ్రులు ప్రస్తుతం అమెరికాలో వున్నారు."

"ఆ ఇంటిని గురించి మనం పూర్తి వివరాలు కనుక్కోడం మంచిది" అన్నాడు రామారావు.

"పోయిందేదో పోయింది వాళ్ళను గురించి దర్యాప్తు చేయడం ప్రమాదకరం. శామ్సన్, ఆమె అన్న మన్ని ముప్పుతిప్పలూ పెట్టాడు. అది మర్చిపోదాం. ఇది ఎవ్వరికీ చెప్పకు. వదినకీ, అమ్మకీ తెలియకూడదు."

"చెప్పనులే" అన్నాడు రామారావు.

## 6

సంవత్సరం గడిచిపోయింది.

ట్రేడ్ ఫెయిర్ ఎగ్జిబిషన్‌లో వేలాది ప్రజలమధ్య గోపాలరావు తిరుగుతున్నాడు.

ఒక ఆంగ్లోయిండియన్ యువతి ముందు నడుస్తోంది. ఆమె వంక పరీక్షగా చూసి అతడు వులిక్కిపడ్డాడు.

రీతా!

కొంత దూరం ఆమె వెనకనే వెళ్ళాడు. బ్రిటానియా బిస్కట్ల స్టాల్లోకి ఆమె నడిచింది. అదే స్టాల్లోకి దూరాడతను. ఆమెవంక పదేపదే చూడసాగాడు.

ఆమె రీతా కాదేమో అని సంశయిస్తూ వెనకనే కదిలాడు. రీతా లాగే వుంది ఆమె. కాని వయసులో పెద్దదిగా అగుపిస్తోంది!

స్టాల్లోంచి ఆమె బయటకు నడిచి చెట్టుకింద నిలబడింది. కొంచెం దూరంనుంచి అతడామెను చూస్తూ వుండిపోయాడు.

ఆమె గౌను వేసుకుంది. బాబ్డ్ హెయిర్. చేతులకు బంగారు గాజులు లేవు. ఖరీదైన వాచ్ లేదు. అయినా రీతా పోలిక బాగా వుంది.

అతడు అమాంతంగా ఆమెవైపు కదిలాడు.

"హై రీతా!" అన్నాడు.

ఆమె అతడివంక పరీక్షగా చూసింది.

"నన్ను మర్చిపోయావా?" అడిగాడతను.

ఆమె మాట్లాడలేదు. అతడివంకే చూస్తోంది.

ఆమె రీతా కాదనిపించిందతనికి.

"హై, గోపాల్!" అందామె నవ్వుతూ.

"నన్ను పోల్చావన్న మాట!"

"నిన్నెలా మర్చిపోతాను?" అందామె.

"రీతా, ఎలా వున్నావు?"

ఆమె గంభీరంగా నవ్వింది.

"సంవత్సరం క్రితం రీతా అనే పేరుతో నిన్ను కల్సు

వున్న యువతిని నేనే. కాని నా అసలు పేరు గ్లోరి"
అందామె.

"నీ అన్న శామ్సన్ యెలా వున్నాడు?"

"శామ్సన్ నా అన్న కాదు. రెండు రోజులపాటు తన చెల్లెలు రీతాగా నన్ను నటించమన్నాడు. అతడిచ్చిన రెండువేల కోసం అలా నటించాను" అందామె.

"నీ తలిదండ్రులు అమెరికాలో లేరా?"

"అదంతా అతడు నన్ను నీతో చెప్పమన్న కథ. నేను పెరంబూరులో ఒక చిన్న గదిలో నా తల్లితో జీవిస్తున్నాను."

శామ్సన్ తనని మోసగించాడు. తన దగ్గరనుంచి రెండు లక్షలు పైన కొట్టేశాడు.

"ఆ శామ్సన్ యెక్కడుంటాడు?"

"నాకేం తెలుసు? ఇరవై ఐదు రూపాయలు యిచ్చి ఒక రాత్రి అతడు నాతో గడిపాడు. తర్వాత ఒకరోజున వచ్చి నన్ను రీతాలా నటించమన్నాడు. ఏ ప్రశ్నలు అడగకుండా పనిచేస్తే రోజుకి వెయ్యి ఇస్తానన్నాడు. అతడు చెప్పినదంతా చేసి నాకు రావలసిన డబ్బు తీసుకుని వచ్చేశాను" అందామె.

"ఆ పెద్ద యిల్లు శామ్సన్‌ది కాదా?"

"నాకు తెలియదు" అందామె.

"అంతా వివరంగా చెప్పు" అన్నాడతను.

"చెప్తే నాకేమటొస్తుంది?"

"డబ్బిస్తాను."

"వంద రూపాయలు ఇయ్యి."

అతడు వందరూపాయల నోటు తీసి ఆమెకిచ్చాడు.

"శామ్సన్ నిన్ను నాకు చూపించాడు. కెనాల్ రోడ్డు

వారగా నన్ను దింపాడు. ఫియట్ కారు అక్కడ రెడీగా వుంది. దాని పక్కనే నిలబడి వుండమన్నాడు. నీ కారు వస్తే ఆపి నీతో మాట్లాడమన్నాడు. నువ్వే ఆగి నన్ను పలకరించావు. పెద్దయింటి బిడ్డగా కూడెంటుగా నటిస్తూ నీతో మాట్లాడాను. నామీద నీ మోజు పెరిగింది. నువ్వు నన్ను రేప్ చేసేటట్లు చూడమన్నాడతను. అదే చేశాను నేను. నీకు అడ్డుపడ లేదు. మన ఇద్దరం కలిసి వుండగా శామ్సన్ వచ్చాడు, గదిలోకి!"

"అదంతా నాటకమేనా?"

"అంతా నాటకమే" అందామె.

గోపాలరావు పిడికిలి బిగించాడు. తనని అంతగా మోసంచేసిన శామ్సన్ని తను వెతికి పట్టుకోవాలి! అతడికి బుద్ధి చెప్పాలి!

"శామ్సన్ అదే యింట్లో వున్నాడేమో?" అన్నాడతను.

"నేను వెళ్ళి చూడలేదు. అటువైపు ఎప్పుడూ రావద్దన్నాడు. నా అవసరం వస్తే తనే నా గదికి వస్తానన్నాడు" అందామె.

తన విజిటింగ్ కార్డును గోపాలరావు ఆమెకిచ్చాడు.

"శామ్సన్ ఎప్పుడేనా నీ గదికి వస్తే, అతడు అక్కడ వుండగా నాకు ఫోన్ చేసి చెప్పు" అన్నాడతను.

"నాకు యేంతిస్తావు?"

"ఐదువందలు."

"అడ్వాన్స్‌గా వంద ఇప్పుడు ఇస్తే సంతోషిస్తాను" అందామె.

అతడామెకు మరో వందరూపాయలు ఇచ్చాడు.

"పాడయిన ఆ ఫియట్ కారు యెవరిది?"

"నాకు తెలియదు. ఆ ఫియట్ పక్కనే అతడు నన్ను నిలబడమన్నాడు. నీ కారులో ఆ ఆటో మొబైల్ షాపు కుర్ర్రి ఇగ్నిషన్ కీ ఇమ్మన్నాడు. అందుకే అక్కడ ఇచ్చాను" అందామె.

"అసలు ఆ శామ్సన్‌కి రీతా అనే చెల్లెలు వుందా?" అడిగాడతను.

"నాకు తెలియదు. ఏ ప్రశ్నలూ వేయకుండా నేను పని చేయాలని అతడు మొదటే చెప్పాడు."

విసుగ్గా గోపాలరావు మరో సిగరెట్ వెలిగించాడు. తను డజన్ ఫ్యాక్టరీలు నడుపుతున్నాడు. వేలాది కార్మికులు తనకింద పనిచేస్తున్నారు. కాని ఒక అనామకుడు తన్ని ఫూల్ చేసి, రెండులక్షలు కాజేశాడు.

ఈ లోకంలో యెక్కడున్నా వాడికోసం తను వెతకాలి! అతడిని చిత్రవధ చేయాలి!

ఆమె అతడివంక నవ్వుతూ చూసింది.

"ఆనాటి అనుభవాన్ని నేను మరువలేను. నా గదికి రా ఒకసారి! నువ్వు యేంతిచ్చినా చాలు" అందామె.

"చూద్దాం" అని అతడు బయటకు నడిచాడు.

## 7

తేనాంపేటలోని ఆ యింటిముందు అతడు కారును ఆపాడు. గేటు ముందువున్న వాచ్‌మన్ కారు దగ్గరకు వచ్చాడు.

"శామ్సన్ వున్నాడా?" గోపాలరావు అడిగాడు.

"శామ్సన్ అనే పేరుతో యీ యింట్లో ఎవ్వరూ లేరు, సార్. ఈ యిల్లు అడ్వకేట్ రంగాచారిది" అన్నాడు వాచ్‌మన్.

"రంగాచారిగారు వున్నారా?"

"వున్నారు, వెళ్ళండి" అని వాచ్‌మన్ గేటు తెరిచాడు!

కారును లోపలకు పోనిచ్చి ఆపాడతను. కారు దిగి ముందు హాల్లోకి వెళ్ళాడు.

"మీరా, రండి" అన్నాడు అడ్వకేట్ రంగాచారి.

అతడి కెదురుగా గోపాలరావు కూర్చున్నాడు.

"ఇది మీ ఇల్లని ఇప్పుడే తెలిసింది" అన్నాడు గోపాలరావు.

"ఈ మేడ పదేళ్ళపైగా నాదే" అన్నాడు రంగాచారి.

"థాంప్సన్ అనే వ్యక్తి మీకు తెలుసా?"

"ఎవరతను?"

"గత సంవత్సరం జనవరి నెల మొదటి వారంలో అతడిని ఇదే ఇంట్లో నేను కలుసుకున్నాను. ఒక రాత్రి యిక్కడే మేడమీది గదిలో పడుకున్నాను."

"గుడ్ హెవెన్స్! డిశంబరు ఆఖరి వారంలో ఇంటి తాళాలు వేసి మేం ఢిల్లీ వెళ్ళాం. జనవరి ఆఖరివారంలో తిరిగి వచ్చాం. ఎవరో ఈ ఇంట్లో రెండు మూడు రోజుల పాటు వున్నారని పక్కవాళ్ళు చెప్పారు. అందుకే యిప్పుడు వాచ్ మన్ని పెట్టాను. ఏ గూండాలో, దొంగలో యీ ఇంట్లో వుండి వుండొచ్చు! కాని మీరు ఇక్కడకు రావడం పై గదిలో పడుకోడం విచిత్రంగా వుంది" అన్నాడు రంగాచారి.

గోపాలరావు మాట్లాడలేదు.

"ఆ థాంప్సన్ మీకెలా దొరికాడు?"

"ఏదో వ్యాపారం గురించి మాట్లాడ్డానికి నన్ను అతడు ఇక్కడకు తీసుకొచ్చాడు. ఆ రాత్రి విస్కీ

సేవించి యిక్కడే పడుకున్నాను. ఈ యిల్లు తనదే అన్నాడు."

"రాస్కెల్!" అర్చాడు రంగాచారి.

"మీ వస్తువులు ఏమైనా పోయాయా?"

"ఏమీ పోలేదు. పోతే పోలీసు రిపోర్టు ఇచ్చేవాడిని. తాళాలన్నీ మేం వేసినట్లే వున్నాయి."

"స్కెలిటిన్ కీతో అతడు తాళాలను తెర్చివుంటాడు" అన్నాడు గోపాలరావు.

"అతడు మళ్ళా మీకు యెక్కడేనా కనిపిస్తే నాకు చెప్పండి" అన్నాడు రంగాచారి.

సెలవు తీసుకొని గోపాలరావు బయటకు నడిచి తన కారులో కూర్చున్నాడు. కారును బయటకు పోనిచ్చాడు. అంతా మోసం! తనను ఒక చవటగా చేసి, ఎందుకూ పనికిరాని దద్దమ్మగాచేసి శామ్‌సన్ నాటకమాడాడు. తన దగ్గరనుంచి రెండు లక్షలుపైన గుంజుకుని అదృశ్య మయ్యాడు.

కోపంతో అతడు మండుతున్నాడు. ఇన్ని ఫ్యాక్టరీలు విజయవంతంగా నడుపుతున్న గోపాలరావు చవటకాదని తను ఆ దుర్మార్గుడికి నిరూపించాలి!

టిప్పూ ఆటో మొబైల్ వర్క్‌షాపుముందు అతడు కారును ఆపాడు. కిందకు దిగాడు. నాలుగు కార్ల మధ్య నున్న ఫియట్ కారును చూసి అతడు తృళ్ళిపడ్డాడు.

ఆనాడు ఆ కారు పక్కనే రీతా నిలబడి వుంది!

వర్క్‌షాపు ప్రొప్రయిటర్ మస్తాన్ అతడి కెదురుగా వచ్చాడు.

"ఆ కారు ఎవరిది?" అడిగాడు గోపాలరావు ఫియట్ వైపు చూపిస్తూ.

"మాదే సార్" అని అతడు ఫియట్ దగ్గరకు నడిచాడు.

బోనెట్ ఎత్తాడు. లోపల ఇంజన్ లేదు!

"సినిమా ప్రొడ్యూసర్లు ఈ కారును షూటింగ్ కోసం అద్దెకు తీసుకుంటారు సార్" అన్నాడు మస్తాన్.

"గత సంవత్సరం జనవరి మొదటి వారంలో యీ కారు థామ్సన్ అనే వ్యక్తికి అద్దెకిచ్చారా?"

"డైరీ చూసి చెప్పాలి, సార్."

"చూసి చెప్పు."

మస్తాన్ లోపలకు వెళ్లాడు. ఐదు నిమిషాల తర్వాత తిరిగి వచ్చాడు.

"థామ్సన్ అనే అతడికి వెయ్యి రూపాయలకు అద్దెకిచ్చాం, సార్. యేదో షూటింగ్ వుందని అతడు చెప్పాడు."

"అతడు మళ్లా కారును మీ దగ్గర అద్దెకు తీసుకున్నాడా?"

"మూడుసార్లు తీసుకున్నాడు. థామ్సనే ఇక్కడకు వచ్చాడు. కాని వేరే నిర్మాతల పేర్లలో అతడు అద్దెకు తీసుకున్నాడు."

"ఈసారి అతడు కారును అద్దెకు తీసుకుంటే వెంటనే నాకు ఫోన్ చేసి చెప్పు. నీకు ఐదువందలు యిస్తాను" అని గోపాల్‌రావు తన విజిటింగ్ కార్డు ఇచ్చాడు.

దాన్ని చూసి మస్తాన్ తృప్తిపడ్డాడు.

"సార్, మీకు తప్పక ఫోన్ చేసి చెప్తాను. మీ కంపెనీల కార్లను రిపేర్లకు ఇక్కడకు పంపించండి" అన్నాడు మస్తాన్.

"చూస్తాను" అని గోపాలరావు తన కారువైపు

నడిచాడు.

ఆలోచిస్తూ అతడు కారును పోనిచ్చాడు. పోలీస్ హెడ్ క్వార్టర్స్ కాంపౌండులో కారును ఆపి దిగాడు. తన మిత్రుడైన డిప్యూటీ ఐ.జి. ఆఫ్ పోలీస్ చంద్రన్ గదిలోకి నడిచాడు.

"హలో గోపాల్, ఏమిటిలా వచ్చావు?" అడిగాడు చంద్రన్.

"నీతో పనుంది!"

"పనుంటేగాని నువ్వు వస్తావా!" అన్నాడు చంద్రన్ నవ్వుతూ.

అతడి ఎదురుగా కూర్చుని గోపాలరావు డిప్యూటీ ఐ.జి. వైపు చూశాడు.

"క్రొత్త పద్ధతిలో శామ్‌సన్ అనే వ్యక్తి అనేకమంది ధనవంతులను మోసంచేశాడు, ఇంకా చేస్తున్నాడు."

"నువ్వుకూడా మోసపోయావా?"

"అందుకే వచ్చాను. నేను చెప్పేదంతా నీ మనస్సులో వుంచుకో. ప్రస్తుతం ఎవ్వరికీ చెప్పొద్దు."

"చెప్పనులే" అన్నాడు చంద్రన్.

తనకు జరిగినదంతా గోపాలరావు చంద్రన్‌తో చెప్పాడు.

"ఇక్కడ విచిత్ర మేమిటో తెలుసా? రీతాగా ఒక యాంగ్లో యిండియన్ యువతి నటించింది. ఇరవైఐదు రూపాయిలిచ్చి శామ్‌సన్ ఒక రాత్రి ఆమెతో గడిపాడు. పెద్దింటి పిల్లలా రీతాను చిత్రించి, ఆమెను రేప్ చేసినందుకు నన్ను భయపెట్టి, నన్ను పెద్ద యింట్లో ఖైదీగా వుంచి రెండు లక్షలు ముట్టాక నన్ను శామ్‌సన్ వదిలేశాడు. ఆ ఇల్లు ఎవరిదో తెలుసా?"

"ఎవరిది?"

"అడ్వకేట్ రంగాచారిగారిది. ఇంటికి తాళాలు వేసి వాళ్ళు ఢిల్లీ పోయారు. ఆ సమయంలో ఈ నాటకాన్ని శామ్సన్ ఆ ఇంట్లో ఆడాడు!"

"రియల్లీ బ్రాండ్ న్యూ వే ఆఫ్ చీటింగ్!"

ఇద్దరూ సిగరెట్లు వెలిగించారు.

"నువ్వు కంప్లెయింట్ రాసి నాకిస్తే మేం అతడి కోసం వెతుకుతాం" అన్నాడు చంద్రన్.

"శామ్సన్ కోసం నేను వెతుకుతున్నాను. అతడు నా కంటబడగానే నీకు ఫోన్ చేస్తాను. అప్పుడు అరస్టు హిమ్!"

"రెడ్ హేండెడ్‌గా పరాయివాడి ఇంట్లో అతడు మాకు దొరికితే తప్పక అరస్టు చేస్తాం" అన్నాడు చంద్రన్.

"నాకు కావలసింది అదే. శామ్సన్ ఇంకా యాక్టివ్‌గా పనిచేస్తున్నాడు. అతను మోసగించిన చవటలెవరూ తనమీద రిపోర్టివ్వరని అతడి నమ్మకం. త్వరలో అతడిని నీకు అప్పగిస్తాను" అని గోపాలరావు బయటకు నడిచాడు.

# 8

కారు పక్కనే నిలబడివున్న యువతివైపు కుప్పచెట్టి పరీక్షగా చూసి డ్రయివర్ని కారాపమన్నాడు.

ఇంపాలా కారు ఆగింది. ఆమె వెనుక సీటువైపు కదిలింది. నవ్వుతూ కుప్పచెట్టికేసి చూసింది.

"ఏమయిందమ్మాయీ?" అడిగాడతను.

పంచ, జుబ్బాలో వున్నాడతను. కుడిచేతికి గోల్డు వాచ్ వుంది. మెళ్ళో గొలుసు మెరుస్తోంది.

"నన్ను మెకానిక్ షాపుముందు దింపుతారా?"

"అదేం ప్రశ్న? ఎక్కు, పిల్లా!" అన్నాడతను.

ఆమె వెనుక సీటుమీద కూర్చుంది. తలుపుమూసింది. డ్రయివర్ కారును పోనిచ్చాడు.

కుప్పుచెట్టి ఆమె చెయ్యి పట్టుకుని చేతిలోని గీతలు చూశాడు. మెల్లిగా అతడి చూపు ఆమె ముఖంమీదకు వెళ్ళింది.

"అచ్చంగా నువ్వు అమ్మలులా వున్నావు!" అన్నాడు.

"నా పేరు మేనక, అమ్మలు కాదు" అందామె.

"నిన్ను అమ్మలూ అని పిలుస్తాను" అన్నాడతను.

"మీ ఇష్టం పెద్దలు అలా అంటే కాదనగలనా!" అందామె.

"బాగా చెప్పావు, అమ్మలూ" అన్నాడతను.

"ఆ వర్క్‌షాపుముందు ఆపమనండి."

డ్రయివర్ ఆపాడు. ఆడపిల్లను చూస్తే కుప్పుచెట్టి హృదయం దడదడమంటుందని డ్రయివర్ కి బాగా తెలుసు.

టిప్పూ ఆటోమొబైల్ వర్క్‌షాపులో ఒక మేకానిక్ కి ఆమె కారు యిగ్నిషన్ కీని యిచ్చి, కారును అక్కడకు తెచ్చుకోమంది.

"అలాగేనమ్మా" అన్నాడతను.

ఇంపాలా కదిలింది.

"అమ్మలూ, నువ్వు ఎక్కడికెళ్లాలి?"

"నా యింటికి."

"నీ యిల్లెక్కడ?"

"కిల్పాక్ లో, టేలర్స్ రోడ్డు."

"డ్రయివర్ విన్నావా, అటు పద" అన్నాడు

కుప్పుచెట్టి.

"మిమ్మల్ని శ్రమ పెడుతున్నాను" అందామె.

"నాకేం శ్రమ? నీ పక్కన కూర్చుంటే అమ్మలు పక్క వున్నట్టే వుంది. టైఫాయిడ్ ఫీవర్ వచ్చి అమ్మలు పోయింది. అప్పుడు యెంత ఏడ్చేనో!" అని కుప్పుచెట్టి కళ్ళు తుడుచుకున్నాడు.

ఆమెను దగ్గరగా లాక్కొని, నడుం చుట్టూ చెయ్యి పోనిచ్చి కూర్చున్నాడు.

"నా అమ్మలు! నా అమ్మలు!" అని వంగి ఆమె మెడ మీద ముద్దెట్టుకున్నాడు.

ఆమె నవ్వింది. అతడివంక చూసింది. కుప్పుచెట్టి జుత్తు నల్లగానే వుంది. సెంటు సువాసన గుప్పున కొడ్తోంది. అతడి వయస్సు అరవై పైన ఉండొచ్చు!

దాశప్రకాష్ హోటల్ దూరంలో కనిపిస్తోంది.

"అమ్మలుకి ఐస్ క్రీమ్ అంటే మహా యిష్టం. తింటావా?"

"పదండి" అందామె.

"డ్రయివర్, విన్నావుగా!" అన్నాడు కుప్పుచెట్టి.

"విన్నాను సార్" అన్నాడు డ్రయివర్.

దాశప్రకాష్ హోటల్ కాంపౌండులో కారు ఆగింది. అతడు దిగాడు. ఆమె వెనకనే దిగింది. ఇద్దరూ ఎర్ కండిషండ్ హాల్లోకి వెళ్ళారు. ఎదురెదురుగా కుర్చీల్లో కూర్చున్నారు.

"మీ వయస్సెంత?" అందామె.

"చెప్పుకో!" అన్నాడతను.

"ఏ నలభయ్యో ఉండొచ్చు!" అందామె.

"నేను నలభై ఏళ్ళవాడిలా వున్నానా?" ఆమె

తలాడించింది.

"అమ్మలూ నాకు అరవై దాటింది. గర్వంగా చెప్పు కుంటున్నాను. ప్రతిరోజూ జాగింగ్ చేస్తాను, ఆసనాలు వేస్తాను. నా ఆరోగ్యం ఇంత బాగా అందువలనే వుంది" అన్నాడు కుప్పుచెట్టి.

బేరర్ రాగానే అతడు ఐస్ క్రీమ్ ఆర్డరిచ్చాడు. ఆమెవైపు నవ్వుతూ చూశాడు. డెంటిస్టు కట్టిన అతడి పళ్ళు తెల్లగా మెరుస్తున్నాయి.

"నీ యింట్లో యెవరెవరుంటున్నారు?"

"నాన్న, అమ్మ, అన్నయ్యా, నేను మేం నలుగురమే. ప్రస్తుతం అమ్మా, నాన్నా పారిస్‌లో ఉన్నారు. నాన్న పేరు మీరు వినే వుంటారు, డాక్టర్ శివరాజన్. ఆయన పేరుపొందిన సైకియాట్రిస్టు. అన్నయ్య సి.ఎ. చేస్తున్నాడు" అందామె.

ఐస్ క్రీమ్ పెద్ద కప్పుల్లో వచ్చింది. ఇద్దరూ తినడం ప్రారంభించారు.

"నువ్వు నా అమ్మలువే అనిపిస్తోంది. విధి నిన్ను నా దగ్గరకు పంపింది. నిన్ను వదలబుద్ధి కావడంలేదు" అన్నాడతను.

కళ్ళు చిట్లించి ఆమె నవ్వింది.

"నీతో గంటల తరబడి కూర్చోవాలనిపిస్తోంది. నీతో ఎంతో మాట్లాడాలి. నా అమ్మలుకు చెప్పనిదెంతో నీతో చెప్పుకోవాలి" అన్నాడతను.

"చెప్పండి" అందామె.

"చేపల బజారులో పాట కచ్చేరీలా యిక్కడేం చెప్పగలను? ఒక చక్కని గదిలో మనిద్దరం పక్క పక్కనే కూర్చుని వుండాలి. అప్పుడు నా అమ్మలుకు

అంతా చెప్తాను" అన్నాడతను.

అతడు డబ్బు చెల్లించాడు. బేరర్ అతడికి నమస్కరించాడు. కుప్పుచెట్టి పక్కనే వయ్యారంగా ఆమె ఇంపాలా కారువైపు నడిచింది.

ఆమె ఎక్కాక పక్కనే అతడు కూర్చున్నాడు. డ్రయివర్ తలుపు మూశాడు. ఇంపాలా కారు కదిలింది. ఆమె చెప్పిన యింటికి కొంచెం దూరంలో ఆగింది.

అతడామె చెయ్యి పట్టుకున్నాడు.

"మీ మాటలు వినాలని నాకెంతగానో వుంది. రేపు సాయంత్రం ఆరింటికి రండి. అన్నయ్య ఇంట్లో వుండడు. మనం యింట్లో కూర్చుని మాట్లాడుకోవచ్చు" అందామె.

"అమ్మలూ, అలాగే వస్తాను" అన్నాడతను.

డ్రయివర్ కారును పోనిచ్చాడు.

"డ్రయివర్ ఎలా వుంది పిల్ల?" అడిగాడతను.

"నిజంగా మేనకే సార్" అన్నాడు డ్రయివర్.

# 9

సరిగ్గా ఆరుగంటలకు కారు ఆమె యింటి ముందు ఆగింది. కారుని చూసి ఆమె గేటువైపు పరుగెత్తుకొచ్చింది.

"రండి" అందామె.

"డ్రయివర్, కారును యింటికి తీసుకుపో. కావాలిస్తే ఫోన్ చేస్తాను. వెంటనేరా! నేనెక్కడున్నదీ ఎవ్వరికీ తెలియకూడదు" అన్నాడు కుప్పుచెట్టి.

లెదర్ బాగ్ పట్టుకుని అతడు కిందకు దిగాడు. కారు వెళ్ళిపోయింది. ఆమె భుజం మీద ఒక చెయ్యివేసి కుప్పుచెట్టి ముందు హాల్లోకి వెళ్లాడు.

పక్కనున్న పడగ్గదిలోకి యిద్దరూ నడిచారు.

"ఇది నా గది" అందామె.

"నీలాగే అందంగా వుంది" అన్నాడతను.

సోఫా చూపించి ఆమె అతడిని కూర్చోమంది. అతడు పరుపువైపు నడిచాడు.

"నాకు సోఫాలు నచ్చవు. పరుపుమీద కూర్చుని మాట్లాడుకుందాం" అన్నాడతను.

"మీ యిష్టం" అందామె.

టేబుల్ మీద పెట్టిన బాగ్ వంక ఆమె చూసింది.

"అందులో ఏముంది?"

"నా అమ్మాయికి ప్రెజెంటు" అన్నాడతను.

ఆమె పరుపు పక్కకు నడిచింది. అతడివైపు నవ్వుతూ చూసింది.

"ఆ అమ్మాయి ఎవరోగాని మీకు ఆమె అంటే చాలా ప్రేమ" అందామె.

"అమ్మాయి ఎవరో వూహించు!"

"మీ అమ్మాయేమో!"

"కాదు."

"మీ ముద్దుల కూతురై వుండాలి."

"నాకు పిల్లలు లేరు!" అన్నాడతను.

ఆమె కాస్సేపు ఆలోచించి, యేమీ తోచక, "ఏమో!" అంది.

కప్పు చెట్టి నవ్వాడు. ఆమెను చెయిపట్టుకొని లాగాడు. ఆమె అతడిమీద పడింది.

అతడి చేతులు ఆమెను చుట్టేశాయి.

"అమ్మాయి ఎవరో చెప్పనా?"

"చెప్పండి" అందామె.

అమాంతంగా ఆతడామె పెదిమలను బలంగా ముద్దెట్టుకున్నాడు.

"ఇప్పుడు తెలిసిందా? అమ్మలు నా మొదటి భార్య. పెళ్ళయిన సంవత్సరం లోపలే చచ్చిపోయింది. ఆ అమ్మలే నీ రూపములో తిరిగి వచ్చింది."

ఆమె పరుపుమీద దూరంగా జరిగింది.

"నేను పద్దెనిమిదేళ్ళ యువతిని. నన్ను పెళ్ళాడబోయే యువకుడు కెనడాలో వున్నాడు. మీరు అమ్మలుగా నన్ను చూడొద్దు" అందామె.

"అమ్మలూ, ఇలా కూర్చో! ఆ బాగ్ లో నీకోసం ఐదు లక్షలు తెచ్చాను. ఆ నోట్లకట్టలను చూస్తే నువ్వు గెంతులేస్తావు!"

బయటినుంచి యెవరో పిల్చారు. ఆమె బయటకు పరుగెత్తింది.

రెండు నిమిషాల తర్వాత తిరిగి వచ్చింది.

"ఎవరు?" అడిగాడు కుప్పుచెట్టి.

"లాండ్రీ వాడు—అన్నయ్య గుడ్డలు తెచ్చాడు. అన్నయ్య గదిలో పెట్టాను" అందామె.

"మీ అన్నయ్య ఇప్పుడు రాడుగా?"

"ఏ ఒంటిగంటకో వస్తాడు."

"అతడి పేరు?"

"నాగరాజు" అందామె.

"ఇలా కూర్చో!" అన్నాడతను.

"వద్దంటే మీరు వినరు" అంటూ ఆమె వెళ్ళి పరుపు మీద కూర్చుంది.

కుప్పుచెట్టి ఆమె గడ్డాన్ని మెల్లిగా నిమిరాడు.

"అమ్మలూ, ఏళ్ళతరబడి పాటుబడి నేను కోట్లు గడిం

చాను. నా యింట్లో నోట్లకట్టలు మూలుగుతున్నాయి. కాని సుఖమంటే ఏమిటో నే నెరగను."

"నాకూ తెలియదు. నేను కాలేజీలో చదువుకొంటున్నాను. జీవితం గురించి నాకింకా ఏమీ తెలియదు" అందామె.

"తెలియకపోతే చెప్పడానికి నేనున్నానుగా, అమ్మలూ?" అన్నాడతను.

ఆమె అతడి ఛాతీమీద ముఖాన్ని ఆనించింది.

"మీకెందుకు సుఖం లేదు?"

"నా అమ్మలు తప్ప మరెవ్వరూ నన్ను సుఖపెట్టలేరు. నా అమ్మలు నువ్వే!"

"ఈ అమ్మలుకి ఏమీ తెలియదు!" అందామె.

అతడు నవ్వుతూ ఆమెను తోశాడు. వెల్లకిలా ఆమె పరుపుమీద పడింది. ఆమె మీదకు ఆత్రంగా వాలేడతను.

ఆమె తటాలున లేచింది. అతడివైపు నవ్వుతూ చూసింది.

"కాస్సేపు అమ్మలు పేరు స్మరిస్తూ కూర్చోండి. నేను స్నానంచేసి వస్తాను" అందామె.

ఆమె యటాచ్డ్ బాత్‌రూమ్‌లోకి దూరి తలుపును మూసుకొంది.

అతడు కిందకు దిగాడు. బాత్‌రూమ్ తలుపు పక్కనే నిలబడ్డాడు. తలుపును తట్టాడు.

"అమ్మలూ, తొందరగా రా!" అన్నాడతను.

"నేను రాలేను. మీరే తీసుకెళ్ళండి" అందామె.

అతడు తలుపును తోశాడు. తెరుచుకుంది. ఆమె పల్చటి నిల్కు నైటీలో వుంది. ఆమె మెల్లిగా గుమ్మంవైపు వచ్చింది.

"అతడామెను యెత్తుకుని, మోసుకెళ్ళి పరుపుమీద పడుకో బెట్టాడు.

గదిలో ఫ్లోరసెంట్ లైట్ వెలుగుతోంది. కుప్పుచెట్టి ఆమెను ఆవేశంతో ముద్దాడాడు. ఆమె చిలిపిగా నవ్వింది.

కుప్పుచెట్టి కళ్ళు మెరిశాయి. అతడిలో గాలివానలా కోరిక చెలరేగింది. ఆమె అతడికి దూరమవడానికి ప్రయ త్నించలేదు. అతడిలో చెలరేగిన కోరికల కెరటాల్లో ఆమె మునిగి తేలింది. ఇద్దరూ స్వర్గంలో విహరిస్తున్నారు.

అమాంతంగా తలుపును తోసుకొని ఒకతను గదిలో కొచ్చాడు.

"అన్నయ్యా!" అని ఆమె ఏడ్వసాగింది.

అతడు కోపంగా కుప్పుచెట్టిని కిందకు లాగాడు.

"ఓల్డ్ రాస్కెల్, నా చెల్లెల్ని బలాత్కరించావా?" అరిచాడతను.

కుప్పుచెట్టి నవ్వుతూ అతడివంక చూశాడు.

"అరిచి ఆయాసపడకు, అబ్బాయి. నీకేం కావాలో చెప్పు!" అన్నాడతను.

ఆమె నేలమీద కూర్చుని యేడుస్తోంది.

"నా చెల్లెలు జీవితాన్ని నాశనం చేశావు!" అరిచాడు నాగరాజు.

"కూలిపోయిన ఇళ్ళను మళ్ళా కట్టొచ్చు. పగిలిన వస్తు వులను మళ్ళా కొనుక్కోవచ్చు. ఎంతకావాలో చెప్పు!"

"ఐదు లక్షలు యిస్తే నిన్ను వదిలేస్తాను. నా తలి దండ్రులకు ఇదంతా తెలియకుండా చూడాలి. వాళ్ళకు తెలిస్తే నిన్ను వదలరు" అన్నాడతను.

"అబ్బాయి, ఆ లెదర్ బాగ్‌లో ఐదు లక్షలుంది.

తీసుకో. నా ఇంటికి ఫోన్ చేసి నాకోసం కారు పంపమను. నే వెళ్తాను" అన్నాడు కుప్పుశెట్టి.

అతడు లెదర్ బాగ్ జిప్పును తెర్చి నోట్లవైపు సంతోషంగా చూశాడు.

"ఈ డబ్బు నీకు రాదు!" అన్నారెవరో వెనకనుంచి.

అతడు వెనక్కు తిరిగాడు. ఆశ్చర్యంతో గోపాలరావు వంక చూశాడు. అతడి చేతిలో పిస్టలు మెరుస్తోంది.

"నువ్వు ఇక్కడికెలా వచ్చావు?"

"నువ్వు వచ్చినట్లే" అన్నాడు గోపాలరావు.

అదే సమయంలో ఇన్‌స్పెక్టర్ బాండ్ ఆరుగురు కాన్‌స్టేబుళ్ళతో లోపలకు వచ్చాడు.

"ఇన్‌స్పెక్టర్ బాండ్, అరస్టుహిమ్" అన్నాడు గోపాలరావు.

అతడి చేతులకు ఇన్‌స్పెక్టర్ బాండ్ బేడీలు వేశాడు.

ఇన్‌స్పెక్టర్ బాండ్, గోపాలరావు నేల మీద కూర్చుని యేడుస్తున్న ఆమె వంక చూశాడు.

"నీ పేరు?

"కనకం."

"నాతో తన పేరు మేనకని చెప్పింది" అన్నాడు కుప్పుశెట్టి.

"మేనకలా నటించడానికి ఇతడు నీకు ఎంత ఇచ్చాడు" అడిగాడు గోపాలరావు.

"రెండు వేలు" అందామె.

"ఇతడు నీకెలా తెలుసు?"

"అప్పుడప్పుడు నా ఇంటికి వచ్చేవాడతను. డబ్బిచ్చి నాతో రాత్రిళ్ళు వుండేవాడు."

"ఇతడి అసలు పేరు యేమిటి?"

"నాకు తెలియదు. నాగరాజు పేరుమాత్రం నాకు తెలుసు" అందామె.

"ఇన్‌స్పెక్టర్, ఇంజన్ లేని ఆ కారును మీరు చూశారు. కనకాన్ని తీసుకొచ్చి, ఆమె పేరు మార్చి, పెద్దింటి పిల్లలా ఆమెను చిత్రించి, యీ ఇంట్లో నాటక మాడి అతడు కుప్పుచెట్టిగారి నుంచి ఐదు లక్షలు తీసుకో డానికి ప్రయత్నం చేస్తున్నాడు" అన్నాడు గోపాల రావు.

"ఆమె ఒక సామాన్య వేశ్య!" అన్నాడు కుప్పుచెట్టి అసహ్యంతో.

ఇన్‌స్పెక్టర్ బాండ్, గోపాలరావు బేడీలు వేసిన వ్యక్తి ముందుకు వెళ్ళారు.

"ఈ ఇల్లు యెవరది?" అడిగాడు గోపాలరావు.

"నాదే. నేను కొన్నాను" అన్నాడతను.

"నీ అసలు పేరు?" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"మాధవ నాయర్. ఆ పేరుతోనే యీ ఇల్లు కొన్నాను."

"ఇల్లంతా సోదాచేయండి" అరిచాడు ఇన్‌స్పెక్టర్ బాండ్.

అరగంటలో అంతా తేలిపోయింది. యాభై లక్షలు పైన రొఖ్ఖంగా పోలీసులకు దొరికింది.

"అంతా బ్లాక్‌మనీ!" అన్నాడు గోపాలరావు.

"ఇంతవరకూ యెంతమంది నీకు యిలా డబ్బు చెల్లిం చారు?" అడిగాడు బాండ్.

"యాభైమందికి పైన వుంటారు."

"ఒక్కరు కూడా మాకు రిపోర్టివ్వలేదు. లక్షలిచ్చి

నోళ్లు మూసుకొని కూర్చున్నారు" అన్నాడు బాండ్.

"నేనూ ఐదులక్షలిచ్చి నోరు మూసుకొని వుండే వాడిని" అన్నాడు కుప్పుచెట్టి.

ఇన్‌స్పెక్టర్ బాండ్ వుషారుగా గోపాలరావుతో కరచాలనం చేశాడు.

"మీరు పట్టుదలతో కృషి చేసి ఇతడిని మాకు పట్టిచ్చినందుకు మీకు నా జోహార్లు" అన్నాడు ఇన్‌స్పెక్టర్ బాండ్.

—: అ యి పో యిం ది :—

సీరియల్



ప్రతాప రవిశంకర్

(గత సంచిక తరువాయి)

హెలికాప్టర్ వేగంలో వున్నట్టుండి మార్పువచ్చింది. వేగం తగ్గిపోయింది. పైలట్‌తోపాటుగా ఆ విషయాన్ని ముందుగా ప్రొఫెసర్ అనంత్ గమనించాడు.

"ఏమిటి? ఏమయ్యింది?" అడిగాడు భారత్ పైలట్‌ని.

పైలట్ వెంటనే మాట్లాడలేదు. సీరియస్‌గా యెదురుగా వున్న మీటలకేసి చూస్తున్నాడు.

వేగం తగ్గటమే కాకుండా హెలికాప్టర్ చిన్నగా కిందికి దిగిపోవటం మొదలుపెట్టింది.

ఉలిక్కిపడ్డాడు భారత్—అతడితోపాటు మిగిలిన వాళ్ళందరికీ కంగారు పుట్టుకొచ్చింది.

"ఏం జరిగింది?" ప్రొఫెసర్ అనంత్ అడిగాడు.

"చూస్తున్నాను. ఏదో చిన్న సాంకేతిక లోపమై

వుంటుంది" అన్నాడు పైలట్ చూస్తూ.

లీల భయంగా అనంత్ కళ్ళల్లోకి చూసింది.

"ఆశ్చర్యంగా వుంది. బయల్దేరబోయే ముందు నువ్వు చెక్ చేసుకోలేదా?" అడిగాడు భారత్.

"చేశాను. అంతా బాగానే వుంది. కాని ఇంతలోనే ఏం జరిగిందో అర్థం కావటంలేదు."

వాళ్ళు మాట్లాడుతున్నప్పుడే వేగం మరింతగా తగ్గిపోయింది. కిందికి దిగబోతున్న హెలికాప్టర్‌ని తిరిగి ఎత్తుక లేపాడు పైలట్.

అతడికీ ఆశ్చర్యంగా వుంది. ఇంతలోనే ఏమయ్యింది?

"హెలికాప్టర్ కనీసం సాబూజా దీవిని కూడా చేరక ముందే ఇలా జరగటం విచారకరం. ఇప్పుడు మన కేమిటి దారి? మనం బయల్దేరిన టైము బాగాలేదు" అన్నాడు ప్రొఫెసర్ అనంత్.

"అవును. మనం బయల్దేరకుండా వుంటే బావుండేది. ఇలా జరుగుతుందనుకోలేదు" అన్నది లీల నిష్ఠూరంగా.

భారత్‌కి బాధ కలిగింది వాళ్ళలా మాట్లాడుతుంటే. టెల్లాను చూశాడు. ఆమె నిశ్చలంగా కిందికి చూస్తోంది.

ముందుకు చూస్తున్నదల్లా లీల హుషారుగా అన్నది "అదిగో చూడండి....కొంచెం దూరంలో చెట్లు—భూమి కనిపిస్తోంది. మనం సాబూజా దీవికి దగ్గర్లోకి వచ్చేశాం"

అంతా ముందుకు చూశారు.

నిజమే. కొంచెం దూరంలోనే దట్టంగా ఎదిగిన చెట్లతో అంతా పచ్చగా కనపడుతోంది.

ప్రొఫెసర్ చిన్నగా ఇలా అన్నాడు—

"ఇక్కడినించే దీవులు మొదలవుతాయి. ఈ దీవి సాబూజా దీవి కాదు. వీటిని నికోలాయ్ దీవులు

అంటారు. ఈ దీవుల్లో మానవసంచారం అసలు వుండదు. ఈ దీవుల్లో అన్నీ క్రూరమృగాలు, భయంకరమైన విష కీటకాలు వుంటాయి. ఈ దీవులు ప్రతి అంగుళం ప్రమాదంతో నిండివుంటాయి."

ఆ మాటలు వినగానే అందరినీ నిరుత్సాహం ఆవహించింది.

హెలికాప్టర్ చాలావరకు వేగం తగ్గిపోయింది.

అప్పటివరకూ ఇంజన్‌లో వున్న లోపాన్ని కనుక్కోటానికి ప్రయత్నించిన పైలట్ విచారవదనంతో ఇలా అన్నాడు—

"క్షమించండి.... లోపమేమిటో తెలీటంలేదు. రన్నింగ్‌లో లోపాన్ని తెలుసుకోవటం సాధ్యం కావటంలేదు. అయినా ఇంకో పదినిముషాలకంటే హెలికాప్టర్ ఎగర లేదనే అనుకుంటున్నాను. అందువల్ల మనం వెంటనే దిగిపోక తప్పదు. లేకపోతే సముద్రంలో పడిపోక తప్పదు."

భయంతో బిగుసుకుపోయారు.

భారత్‌కు గుండె ఆగిపోయినట్లనిపించింది.

నికోలాయ్ దీవులు మొదలవుతున్నాయ్.... సముద్ర తీరం దగ్గరపడుతోంది.

పైలట్ మీద భరించలేని కోపం వచ్చింది. కాని అతను మాత్రం యేంచెయ్యగలడు? సడన్‌గా ఏదో జరిగింది. ఐనా ఇప్పుడు పైలట్‌ను నిందిస్తూ కూర్చున్నందువల్ల ప్రయోజనం లేదు. ఏదో ఒక నిర్ణయం వెంటనే తీసుకోవాలి.

"ఏం చేద్దాం?" అనంత్‌ను అడిగాడు.

"చెయ్యగలిగింది యేమీ లేదు. ప్రమాదకరమైన ఈ కోలాయ్ దీవుల్లో హెలికాప్టర్‌ను దించకతప్పదు. అను

వైన స్థలం చూసుకుని దిగిపోవాలి" అన్నాడు.

అప్పటికి నికొలాయ్ దీవులమీదికి చేరుకుంది హెలికాప్టర్.

అప్పటికే సూర్యుడు దిగిపోయాడు.

చీకటి పడుతోంది.

దీవిమీద యెగురుతోంది హెలికాప్టర్ చాలాతక్కువ యెత్తులో. కొంచెం దూరం వచ్చేసరికి చుట్టూ చెట్లు— మధ్యలో కొంత మేర మైదానంలా వున్న ప్రదేశం కన పడింది.

"ఇక్కడ దించుతాను" అన్నాడు పైలట్.

"దించెయ్యి" అన్నాడు అనంత్.

అప్పటికే హెలికాప్టర్ దిగిపోవటం మొదలు పెట్టింది.

• • •

చుట్టూ దట్టంగా పెరిగిన చెట్లు. పైన ఆకాశం కనపడు తోంది. చెట్లమీద పక్షుల అరుపులు గోలగా వినపడు తున్నాయి.

హెలికాప్టర్ ఆ దీవిలోకి దిగటంతోనే అందరి గుండెలూ భయంతోనే చిన్నగా అదిరాయి. ఎందుకంటే ఆ దీవులగురించి ప్రొఫెసర్ అనంత్ చెప్పిన మాటలు వాళ్ళు మరచిపోలేరు.

చీకటి నీడలు ఆ దీవిమీద పరచుకున్నాయి. వెలుగు పూర్తిగా అంతరించిపోతోంది.

సముద్రం దగ్గరలోనే వుండటంవల్ల దాని హోరు భీక రంగా వినిపిస్తోంది.

గాలి రివ్వున వీస్తోంది.

హెలికాప్టర్‌లోనించి కిందికి దిగటానికే అందరికీ భయం కలిగింది.

ముందుగా సైల్లా క్రిందికి దిగింది.

ఆమె దిగిన తర్వాత జాన్సన్ దిగాడు. దిగి ఒకసారి చుట్టూ వున్న పరిసరాలను తన పెద్ద పెద్ద కళ్ళతో చూశాడు.

చీకటి పడుతున్నా పరిసరాలు బాగానే కనిపించాయి. అక్కడి చెట్లకు నల్లటి పండ్లు వేల్లాడుతూ ఉండటాన్ని వాళ్ళంతా గమనించారు.

అంతా దిగారు.

కింద నల్లగా వున్న గడ్డి పెరిగి ఉంది ఎత్తుగా—

పైలట్ మాత్రం లోపలే వుండిపోయాడు. టార్చి లైటుతీసి ఆ వెలుతుర్లో డిఫెక్ట్ను ఐడెంటిఫై చేస్తు న్నాడు.

"డిఫెక్టు సరయితే మనం వెంటనే బయలుదేరే అవకాశం వుందా?" అడిగింది లీల—అనంత్ ను.

"లేదు. ఈ చీకట్లో దీవులను గుర్తించటం కష్టం. పగటివేళనే అది సాధ్యమవుతుంది. బాగా తెలిసివుంటే తప్ప రాత్రివేళ గుర్తించటం సాధ్యంకాదు. అందువల్ల ఈ రాత్రి మనం ఈ దీవిలో గడపక తప్పదు."

చీకటి చిక్కబడుతోంది.

మగవాళ్ళంతా సిగరెట్లు వెలిగించారు.

సైల్లా—లీల మాట్లాడుకుంటున్నారు.

రంజిత్ జాన్సన్ తో మాట్లాడుతున్నాడు.

పైలట్ ఇంజన్ తో కుస్తీపడుతున్నాడు.

భారత్ మాట్లాడుతున్నాడే కాని అతనికి మనసులో ఆందోళనగా వుంది. ఏమిటీ హంసపాదు? మొదట్లోనే ఇలా ఎందుకు జరిగింది?

అతని ఆలోచనలకు అంతరాయం కలిగింది.

ఉన్నట్టుండి లీల భయంతో అరిచింది సైట్లాలో మాట్లాడుతున్నదల్లా ఆగిపోయి.

చెట్లమధ్యగా ఒక వైపుకు వేలుపెట్టి చూపుతూ—

అంతా ఆ వైపుకు చూశారు.

అక్కడ కొంతదూరంలో వున్న చెట్లమధ్య కొంచెం ఎత్తుగా వున్న జంతువు నిలబడి వాళ్ళనే చూస్తోంది. అది ఏ రంగులో వుందో తెలీటంలేదు—చీకటి పడుతుండటం కారణంగా—

దాని కళ్ళు లైట్లులా మెరుస్తున్నాయి.

అంతా ఆ జంతువునే చూస్తున్నారు. అదికూడా కదలకుండా అక్కడే కూర్చుని వాళ్ళనే రెప్పవాల్చకుండా చూస్తోంది.

హఠాత్తుగా గుర్తొచ్చింది అనంత్‌కు—ఆ జంతువు ఎర్ర తోడేలు. అది ఒంటరిగా వున్నప్పుడు ఎక్కువ మంది మనుషులు వుంటే వాళ్ళ జోలికి రాదట. ఒంటరిగా వున్న మనిషిమీద హఠాత్తుగా దాడిచేస్తుందిట. ఎక్కువమంది మనుషులు వున్నప్పుడు మిగిలిన తోడేళ్ళను కూడా తీసుకుని దాడికి వస్తుందిట.

ఆ విషయం గుర్తుకు రాగానే అతని ఒళ్ళు జలదరించింది. అంటే అది తప్పకుండా ఏదో ఒక సమయంలో తన జాతి తోడేళ్ళన్నింటినీ తీసుకుని వస్తుంది.

భారత్ టార్చ్‌లైటు తీశాడు.

దానిమీదకు ఫోకస్ చేశాడు.

అంతా చూశారు. ఎర్రగా వుంది. దాని శరీరం రంగు నెత్తురు పూసినట్టుగా—

చిత్రంగా అది వెలుతురు కళ్ళమీద పడుతుంటే

తలను మాత్రమే శరీరం ఏమాత్రం కదలకుండా అటూ ఇటూ కదిల్చింది.

"సందేహం లేదు. ఎర్ర తోడేలు" అన్నాడు అనంత్ పెద్దగా అందరికీ వినిపించేలా.

"ఎర్ర తోడేలా! దీని మొహం తోడేలులా లేదు కదా!" అన్నాడు రంజిత్.

"లేదు, కాని ఇది తోడేలు సంతతికి చెందిన జంతువు. దీని గుణాలన్నీ తోడేలు గుణాలే" అంటూ ఎర్ర తోడేళ్ళ గురించి వాళ్ళకు తెలియపరిచాడు.

అప్పటికే జాన్సన్ ప్యాంటు జేబులోనించి రివాల్వర్ తీసి చేతిలో పెట్టుకున్నాడు.

అతడి చర్యను పింట్లా గమనించి "తొందరపడకు" అని "జాన్సన్ దాన్ని షూట్ చెయ్యబోతున్నాడు" అన్నది.

అప్పుడంతా అతనివైపు తిరిగారు.

జాన్సన్ గురి చూసుకుంటున్నాడు.

"షూట్ చెయ్యకు. అది మన జోలికి రానప్పుడు దాన్ని కాల్చటం ఎందుకు?" అన్నాడు భారత్. అతని భయం ఏమిటంటే రివాల్వర్ పేలిన చప్పుడుకు మిగిలిన జంతువులు ఏవైనా అక్కడికి వస్తాయేమోనని.

"కాదు. ఆ ఎర్ర తోడేలు గురించి మీకు తెలీదు భారత్....అది అలా చూసి వెళ్ళి తన బలగంతో వచ్చి మనమీద దాడిచేస్తుంది. అందువల్ల దాన్ని షూట్ చెయ్యకుండా వదలకూడదు" అన్నాడు అనంత్.

అతడి మాటలు పూర్తి అవకముందే ఢామ్మని రివాల్వర్ మోత ఆ దీవి అంతా ప్రతిధ్వనించింది.

లీల భయంగా అనంత్ దగ్గరగా జరిగింది.

అంతా ఆ ఎర్ర తోడేలు రివాల్వర్ గుండుదెబ్బ తగిలి నెత్తురు మడుగులో గిలగిలా తన్నుకుంటూ వుంటుం దని అనుకున్నారు.

కాని—జరిగింది మరొకటి.

జాన్సన్ ప్రయత్నాలను అది గమనించినట్టుగా రివాల్వర్ పేలే సమయానికి అది హఠాత్తుగా వూహించ నంత వేగంగా కాళ్ళను వంచి కింద కూలబడి పోయింది.

వాళ్ళంతా దాని తెలివి తేటలకు ఆశ్చర్యపడ్డారు. అది తప్పకుండా తోడేలు జాతికి చెందిన జంతువేనని నమ్మకం అందరికీ కలిగింది.

జాన్సన్ రెండోసారి రివాల్వర్ పేల్చేంతలో నే అది వూహించనంత వేగంగా వెనక్కి తిరిగి చెట్లమధ్యనించి పరుగుదీసింది.

"మై గాడ్....ఇటీజ్ టూ డేంజరస్ .... అది ప్రాణాలతో తిరిగివెళ్ళటం ప్రమాదం" అని అరిచాడు అనంత్.

బాణంలా ముందుకు పరుగుదీశాడు జాన్సన్ రివాల్వర్ చేతపట్టుకుని — భారత్ చేతిలో నించి టార్చి లైటును లాక్కుని—

"జాన్సన్" అరిచాడు అనంత్ కంగారుగా.

ఆగిపోయాడు జాన్సన్ కొంచెం ముందుకు వెళ్ళి, అప్పటికే ఎర్ర తోడేలు కనిపించకుండా పోయింది.

చెట్లకింద రాలిన ఎండుటాకుల మీద ఎర్ర తోడేలు పరుగెడుతున్న చప్పుడు వినిపించి నిమిషంలో అది

క్రమంగా మారమయిపోయింది.

"ఇక రాత్రంతా మనకు జాగరణ తప్పదు. దాన్ని తప్పించుకోనివ్వకుండా వుంటే బావుండేది" అన్నాడు అనంత్.

"నేను షూట్ చేసినా బావుండేది" అన్నది స్టెల్లా.

ఆ మాటలు జాన్సన్‌కు వినిపించాయి. పౌరుషంగా స్టెల్లాను చూస్తూ "అంటే నీ ఉద్దేశం యేమిటి? నాకు గురిచూసి కాల్చటం రాదనుకున్నావా?" అన్నాడు బొంగురు గొంతుతో.

స్టెల్లా యేదో మాట్లాడబోతున్నప్పుడు అనంత్ కలగ జేసుకుని "ఎర్ర తోడేలు విషయంలో యెంత నేర్పరిగా షూట్ చెయ్యగలిగిన వాళ్ళైనా దాన్ని పడగొట్టటం కష్టమే. దానికి వున్న తెలివితేటలు అలాంటివి. ఈ విషయం గురించి మీరు ఘర్షణకు దిగకండి" అన్నాడు.

ఐనా జాన్సన్ స్టెల్లాను గుర్రుగా చూశాడు.

పైలట్ బయట జరుగుతున్న ఈ గొడవను పట్టించుకోకుండా జరిగిన లోపం గురించి సెర్చి చెయ్యటంలో మునిగి పోయివున్నాడు.

* * *

పూర్తిగా చీకటి పడిపోయింది.

ఐనా హెలికాప్టర్‌లో వెలుగుతున్న దీపాల కాంతితో అక్కడంతా వెలుతురుగా వుంది.

వాచీకేసి చూసుకున్నాడు భారత్.

ఏడుగంటలు కావస్తోంది.

జాన్సన్ చిన్నగా రంజిత్‌తో యేదో మాట్లాడు తున్నాడు.

"ఇంకా డిఫెక్టు యెక్కడున్నదో తెలిసినట్టుగా లేదు. ఈ రాత్రికి ఈ రిపేర్ జరుగుతుందా?" సందేహంగా అడిగింది లీల.

"ఏమో! బయల్దేరగానే ఇలా జరగటం అంత శుభ సూచకంగా లేదు. లేకపోతే ఈ సమయానికి సాబూజా దీవి మనుషులతో టకారా దీవి గురించి మాట్లాడుతూ వుందేవాళ్ళం" అన్నాడు అనంత్ సిగరెట్టు వెలిగిస్తూ—

"అవును ఇలా జరిగినందుకు చింతిస్తున్నాను. ఇది మనం ఏమాత్రం వూహించని పరిణామం. త్వరలోనే మన వెహికల్ కి రిపేర్ పూర్తవుతుందని రేపు ఉదయమే మనం ఈ నికోలాయ్ దీవులను వదిలి వెళతామని నేను అనుకుంటున్నాను" అన్నాడు భారత్.

అక్కడ వారికి ఏమీ తోచటం లేదు. ఒక్కనిమిషం గడవటమే ఎంతో కష్టంగా వుంది.

భారత్ లోపలకు వెళ్ళాడు.

పైలట్ దగ్గరకు వెళ్ళి పొజిషన్ గురించి అడిగాడు. అందుకతను చిన్నగా "కంగారుపడకండి. ఇది మేజర్ డిఫెక్టు అయివుంటుందని నేను అనుకోవటం లేదు. త్వరలోనే గుడ్ కండిషన్ లోకి వస్తుంది. ఐయామ్ సారీ.... ఇలా జరుగుతుందని నేనుకూడా అనుకోలేదు. లిఫ్టు చెయ్యబోయే ముందు చెక్ చేశాను. అంతా బాగానే వుంది. అందుకే నాకు ధైర్యంగా వుంది. ఇదేదో మైనర్ డిఫెక్టు అయివుంటుంది" అన్నాడు.

"బోర్ కొడుతోంది" అన్నది లీల.

"తప్పదు. మరి దీవుల ప్రయాణం అంటే ఏమిటను కున్నావ్? ఏదయినా మాట్లాడు" అన్నాడు అనంత్.

"ఏం మాట్లాడను? ఎంత సేపని నేనొక్కదాన్నే మాట్లాడేది? ఎవరైనా ఒక మంచి కథ చెప్పండి. టైము గడిచిపోతుంది" అన్నది లీల.

"కథలో మునిగిపోయామంటే మన పని అవుట్... ఎర్ర తోడేళ్ళ దాడి గురించి మనం గుర్తుంచుకోవాలి. అవి ఏ క్షణంలోనైనా రావొచ్చు....అందరం ఆయుధాలతో సిద్ధంగా వుండాలి."

"మిస్టర్ అనంత్. ఈ లైట్లు వెలగటం అంత మంచిది కాదేమో!" అన్నాడు భారత్.

"అవును. నేనుకూడా అదే అనుకుంటున్నాను. ఈ వెలుతురు వల్ల దూరంగా వున్న జంతువులకు కూడా మన ఉనికి ఎంత వద్దనుకున్నా తెలిసిపోతుంది. అందుకే మనం ఈ లైట్లను ఆర్పివేయాలి" అన్నాడు అనంత్.

సరిగ్గా అప్పుడే పైలట్ సంతోషంతో అరిచాడు. "ఉయార్ లక్కీ....డిఫెక్ట్ దొరికింది" అన్నాడు.

అతని దగ్గరకు పరుగుదీశారు భారత్—అనంత్—రంజిత్.

"ఇక మనం భయపడవలసిన అవసరం లేదు. మైనర్ డిఫెక్ట్....పని నిముషాల్లోనే అయిపోతుంది."

అంతా తేలిగ్గా గాలి పీల్చుకున్నారు. ఒక భయం తీరింది. ఇక ఈ రాత్రి గడవటం ఎలాగో చూడాలి.

పదినిముషాల్లో పైలట్ ఇంజన్ను స్టార్టుచేశాడు. చిన్న చప్పుడుతో స్టార్టయ్యింది. ప్రొపెల్లర్లు గిర్రున తిరిగాయి. విసురుగా గాలి వీచింది.

రెండు నిముషాల తర్వాత పైలట్ ఇంజన్ని ఆఫ్ చేశాడు. బయటకు వచ్చాడు.

"క్షమించండి. మీలో గొప్ప యాంగ్జాయిటీని కలిగించాను. ఒక్కోసారి ఇలాగే జరుగుతుంది. కాని ఇలా జరక్కుండా వున్నట్లయితే మనం దిగాలనుకున్న దీవిలోనే దిగేవాళ్ళం" అన్నాడు వాళ్ళతో నొచ్చుకుంటున్నట్టు.

"నెవర్ మైండ్.... మేమేం అనుకోలేదు. కొంచెం భయపడిన మాట నిజమే, ఎందుకంటే హెలికాప్టర్ లేకపోతే మనం ఈ దీవిలోనే వుండిపోవలసి వచ్చేది" అన్నాడు అనంత్.

• • •

"ఎనిమిది గంటలవుతోంది" అన్నది లీల.

"అవును. మనం ఇక తిండి యేర్పాట్లు చూస్తే మంచిది" అన్నాడు భారత్.

"అంతా లోపలకు రండి" అన్నాడు భారత్.

కింద నిల్చుని చిన్నగా మాట్లాడుకుంటున్న వాళ్ళంతా లోపలకు వచ్చారు.

లీలా బిస్కెట్లు—బ్రెడ్ తీసి అందరికీ ఇచ్చింది. వాటిని తిని అంతా టిన్‌లో తీసుకొచ్చిన నీళ్ళు తాగారు.

జాన్సన్‌కు ఆ తిండి సరిపోలేదు. అందుకే దిక్కులు చూశాడు.

అతడి చూపులను గమనించి రంజిత్ "సారీ జాన్సన్. నీ ఆకలి సంగతి నాకు తెలుసు. ఐతే అనుకోకుండా మనం ఇక్కడ చిక్కుపడిపోవటంవల్ల ఈ బ్రెడ్, బిస్కెట్లతో కడుపు నింపుకోవలసి వచ్చింది. లేకపోతే మంచి

మాంసాన్ని తినగలిగి వుండేవాళ్ళం" అన్నాడు.

అనంత్‌ను చూశాడు తర్వాత.

"అవును మిస్టర్ జాన్సన్. సాబూజా దీవిలో మనం దిగగలిగి వున్నట్లయితే మనం జీవితంలో మరచిపోలేని ఆతిథ్యం మనకు వారికి వుండేది. ఆ దీవి వాసుల గురించి నాకు బాగా తెలుసు. మంచి రుచికరమైన మాంసాన్ని మనకు వండిపెడతారు. వాళ్ళు పాములను చంపి చేసే వంటకాలు అద్భుతంగా వుంటాయి. అటువంటి రుచికరమైన మాంసాన్ని ఎప్పుడూ తిని వుండము. సాబూజా దీవిలో దొరికే పాములు అంత రుచిగా వుంటాయి. ఈ రాత్రికి యెలాగో ఓపిక పట్టు. రేపు మనం మంచి భోజనాన్ని చెయ్యొచ్చు" అన్నాడు అనంత్.

జాన్సన్ మాట్లాడలేదు.

మౌనంగా జేబులోనించి సిగరెట్టు పెట్టె తీసి లైటర్‌తో ఓ సిగరెట్టు ముట్టించి నున్నగా వున్న గుండును ఓ సారి చేత్తో తడుముకున్నాడు.

అతనలా గుండును చేత్తో తడుముకోవటం చూస్తే సెల్లాకు నవ్వొచ్చింది. కాని నవ్వలేదు జాన్సన్‌కు కోపం వస్తుందని.

కాని—లీల ఆ విషయం గురించి అనంత్‌తో చెబుతూ నవ్వింది. ఆమె నవ్వటాన్ని గమనించి లీలను గుర్రుగా చూశాడు జాన్సన్.

"ఎంత సేపు ఇలా కూర్చోటం? నాకు నడుమునొప్పిగా వుంది. పడుకోవాలి" అన్న దిలీల.

"తెల్లవార్లూ కూర్చోక తప్పదు లీలా. మనం మన ఇంట్లో బెడ్‌రూములో లేము. క్రూరమృగాలు నిండివున్న

నికొలాయ్ దీవుల్లో వున్నాం" అన్నాడు అనంత్ నవ్వుతూ.

చిన్నగా జాన్సన్ —రంజిత్‌తో అన్నాడు.

"మందుసీసాలు తీసుకువచ్చారు కదా.... వాటిని బయటకు తియ్యండి."

"అవి మనవి కాదు సాబూజా దీవిలో వున్న మనుషులవి."

"ముందు మనవి. మిగిలినవే వాళ్ళవి. మందు కొట్టకుండా ఒక్కరాత్రి కూడా ఇంతవరకు వుండలేదు. చీకటి పడగానే మందు కొట్టకపోతే నాకు మతిపోయినట్టు వుంటుందని నీకు తెలుసుకదా."

"తెలుసు. కాని భారత్‌ను అడగాలి" అని ఆ విషయాన్ని భారత్‌తో చెప్పాడు. పక్కనే పైలెట్ కూడా వుంది.

వాళ్ళంతా మళ్ళీ కిందికి దిగి హెలికాప్టర్ పక్కనే నిలబడి వున్నారు.

"వద్దు. నాకు ఇష్టంలేదు. ఎందుకంటే మనమంతా తాగి మత్తులో జోగుతున్నప్పుడు ఎర్రతోదేళ్ళు వచ్చి మనమీద పడే అవకాశం వుంది" అన్నాడు భారత్.

అనంత్ కూడా అతని మాటలకు సపోర్టు చేశాడు.

కాని జాన్సన్ ఒప్పుకోలేదు.

"మీ అందరినీ తాగమని నేను బలవంతపెట్టడంలేదు. నేనొక్కడినే తాగుతాను. ఎంత యెక్కువగా తాగినా నేను కంట్రోల్‌లోనే వుంటాను. తాగకపోతే నా బుర్ర పనిచేయదు" అన్నాడు పట్టు వదలకుండా—

భారత్ రంజిత్‌ను చూశాడు.

రంజిత్ చిన్నగా "జాన్సన్ చెప్పిన మాట నిజమే. తాగకపోతే అతని బుర్ర పనిచేయదు. మనిషి చురుకుగా వుండలేడు. మనం ఈ రాత్రి ఎర్రతో దేళ్ళ దాడిగురించి భయపడుతున్నాం. అలాంటప్పుడు వాటిని యెదిరించా లంటే మనకు జాన్సన్ చురుగ్గా వుండటం యెంతో ముఖ్యం. అందుకోసమైనా మనం అతనికి ఓ బాటిల్ ఇవ్వక తప్పదు" అని చెప్పాడు.

ఆపైన భారత్ మాట్లాడలేదు. స్టెల్లాకు కళ్ళతోనే సైగచేశాడు.

కాబిన్‌లో చిన్న లైటు వెలుగుతోంది.

స్టెల్లా ఓ విస్కీ బాటిల్ తీసుకొచ్చి జాన్సన్‌కు ఇచ్చింది.

థాంక్స్ చెప్పాడతను.

వెంటనే పళ్ళతోనే దాని కార్కు వూడదీసి సీసా యెత్తి రెండు గుటకలు వేశాడు.

లీల అతడికేసి చిత్రంగా చూసింది.

అలాంటి మనుషులను ఆమె ఇంతకుముందు యెప్పుడూ చూడలేదు. కేవలం సినిమాల్లోనే చూసింది. అంత మొరటుగా ప్రవర్తిస్తున్న మనిషిని ఇప్పుడు ప్రత్యక్షంగా చూస్తోంది.

పొద్దు గడిచిపోతోంది.

మళ్ళీ దీవుల గురించి, సముద్రపు ప్రయాణాల గురించి కొంతసేపు వాళ్ళందరికీ చెప్పాడు అనంత్.

అంతాలోపలే కూర్చున్నారు-కాని జాన్సన్—రంజిత్ అక్కడికి కొంచెం దూరంలో వున్న కొంచెం యెత్తుగా వున్న బండరాయిమీద కూర్చుని మాట్లాడుకుంటున్నారు.

రంజిత్‌కు కూడా తాగాలని వుంది. కాని భారత్‌తో ఆ విషయం చెప్పటానికి సందేహించాడు. అందుకే ఆ విషయాన్ని జాన్సన్‌కు తెలియజేశాడు. జాన్సన్ సగం బాటిలును ఖాళీచేసి మిగిలిందాన్ని రంజిత్‌కు ఇచ్చాడు. అంతా కబుర్లలో మునిగిపోయారని అనుకున్న తర్వాత ఆ సగం బాటిలును రంజిత్ ఖాళీ చేశాడు.

"లోపలకు రండి" అని పిల్చారు భారత్—అనంత్ బయట కూర్చున్న ఇద్దరినీ.

"నేను ఇక్కడే కూర్చుంటాను" అన్నాడు జాన్సన్ సిగరెట్టు వెలిగించుకోబోతూ—

"వద్దు. ప్రమాదం. ఏ జంతువైనా వచ్చి హటాత్తుగా మీదకు దూకవచ్చు" అన్నాడు భారత్.

రంజిత్ లేచి నిల్చుని "నువ్వు కూర్చో, నాకు నిద్ర వస్తోంది" అంటూ లోపలకు వచ్చాడు.

"జాన్సన్ ....నువ్వుకూడా వచ్చెయ్యి."

"నేను ఇక్కడే కూర్చుంటాను. నాకు భయం లేదు. నా దగ్గర రివాల్వర్ వుంది."

"రివాల్వర్ ఒక్కటే చాలదు. ఇదిగో ఈ తుపాకి కూడా తీసుకువెళ్ళు."

భారీ శరీరాన్ని కదుల్చుకుంటూ వచ్చాడు జాన్సన్. భారత్ అందించిన తుపాకిని, టార్చిలైటును తీసుకుని వెళ్ళి మళ్ళీ ఆ బండమీద కూర్చున్నాడు.

"మేమంతా లోపల కూర్చుంటాం. నువ్వొక్కడివే నిద్రపోకుండా కూర్చోగలవా?" అనంత్ అడిగాడు.

"ఒంటిగంట వరకు నేను మెలకువతో వుంటాను. ఆ తర్వాత యెవరైనా కాపలాగా వుండండి."

"తర్వాత యెవరు వుంటారు?" అడిగాడు అనంత్.

ఎవ్వరూ మాట్లాడలేదు.

"నాకు ఎవరైనా మరో మనిషి తోడుగా వుంటే నేను వుంటాను" అన్నాడు రంజిత్.

భారత్ నవ్వి "ఒక్కడివే వుండటానికి భయమా?" అన్నాడు.

"కాదు. ఎవరైనా తోడుగా వుండి మాట్లాడుతుంటే నిద్ర రాకుండా వుంటుంది. అంతేకాని భయంకాదు."

"ఎవ్వరూ వుండనవసరం లేదు. ఒంటి గంటనించి నాలుగు గంటల వరకు నేను మెలకువగా వుంటాను" అన్నది సెల్లా.

"థాంక్ యూ" అన్నాడు అనంత్.

"నేను మెలకువగా వుంటానని చెప్పలేదు కాని నాకు కొత్త ప్రదేశంలో అంత తొందరగా నిద్రపట్టదు. నిద్ర పట్టినా కొంచెం సేపట్లోనే మెలకువ వస్తుంది" అన్నాడు అనంత్.

అప్పటికే లీల కళ్ళు మూతలుపడుతున్నాయి. పైలట్ అందరినీ చూస్తున్నాడు ఏదో సినిమా చూస్తున్నట్టు.

ఇంతకు ముందు ఎప్పుడూ ఇలా దీవుల్లోకి వెళ్ళలేదు.

సెల్లా సిగరెట్ వెలిగించింది.

ఆమె భారత్ తో ఏకాంతాన్ని కోరుకుంటోంది. కాని అక్కడ అలాంటి అవకాశమే లేదు. ఆమె పక్కనే లీల కూర్చుంది. ఆమె పక్కనే అనంత్ కూర్చుని వున్నాడు.

లీల వెనక్కు వాలి కునుకు తీయబోతోంది. మిగిలిన వారంతా మెలకువగా వున్నారు.

"సో....ఇక మనం విశ్రాంతి తీసుకుందాం. ఎంత

నిద్రలో వున్నా చీమ చిటుక్కుమన్నా మెలకువ వచ్చేలా వుండండి. ఎర్రతో దేళ్ళ దాడి గురించి మరచిపోకండి.... బయట జాన్సన్ ఒక్కడే వున్నాడు" అని—

"మిస్టర్ జాన్సన్....ఏమాత్రం ప్రమాదాన్ని పసిగట్టినా నువ్వు పెద్దగా కేకలుపెట్టు. వెంటనే మేము మేలుకుంటాం" అంటూ డోర్‌ను క్లోజ్ చెయ్యటానికి ముందుకు వంగి చిన్నగా అరిచాడు భారత్.

లీల వులిక్కిపడి కళ్ళు తెరిచింది ఆ అరుపుకు. అంతా డోర్ వైపు చూశారు.

హెలికాప్టర్ కేబిన్ పైనించి డోర్ మీదకు పొడుగ్గా వెడల్పుగా వున్న నల్లని పాము వేల్లాడుతోంది. అది బాగా నల్లగా వుంది. దాని పొట్టకింద తెల్లగా గీసినట్టున్న చారలు వున్నాయి. అది వుండుండి నోరు తెరుస్తోంది. అటూ ఇటూ వూగుతోంది.

దాన్ని చూడ్డంతోనే భయంతో అరవబోయింది లీల. వెంటనే అరచేత్తో ఆమె నోరు మూసేసింది స్టెల్లా.

"ష్, అరవకు. ఆ పాము మనమీదకు దూకుతుంది ఆ శబ్దానికి. దాన్ని నేను చంపుతాను" అని చేతిని తీసేసింది.

దాన్ని చూస్తూనే జాన్సన్ తుపాకితో బండమీద నించి అక్కడకు రాబోయాడు.

"జాన్సన్....నువ్వక్కడే వుండు. పక్కకు తప్పుకో" అన్నది స్టెల్లా రివాల్వర్ బయటకుతీసి పాము తలకు గురిపెడుతూ—

జాన్సన్ నవ్వాడు పరిహాసంగా.

"ఇప్పుడు తెలుస్తుంది నీ గురి యేమిటో? నేను ఎర్రతో దేలును గురిచూసి కాల్చలేకపోయానని ఏదో కోతలు

కోడావు కదా" అనుకున్నాడు మనసులోనే.

అతడి నవ్వులోని పరిహాసాన్ని అర్థం చేసుకుని లోపలే చిన్నగా నవ్వుకుంది స్టెల్లా.

పాము మెల్లగా మరింత కిందకు జారుతోంది. ఇంకా యెంత పొడుగు వున్నదో తెలీదు.

"ఢాం"

పాము తల చితికి హెలికాప్టర్ కు కొంచెం దూరంలో ఎగిరి పడింది గిలగిలా తన్నుకుంటూ.

లోపల్నించే ఆత్రంగా అంతా దాన్ని చూశారు. ఆ పాము తల పూర్తిగా చితికిపోయి మొండెం మాత్రమే మిగిలి వుంది.

జాన్సన్ షాకై పోయాడు. ఆడదైన స్టెల్లా కదులు తున్న పాముతలను అలా మాటిగా చితికిపోయేలా షూట్ చెయ్యగలదని అతడనుకోలేదు.

ఆమె గురి తప్పదని అతడికి అర్థమయ్యింది.

డోర్ క్లోజ్ చేశాడు భారత్.

తుపాకి మొనతో ఎత్తి ఆ పామును దూరంగా చెట్ల లోకి విసిరేశాడు జాన్సన్.

"భయపడకు....దీవుల్లో వుండేవి ఇవే ...నిద్రపో.... జాన్సన్ కాపలా వున్నాడు" అన్నాడు అనంత్—లీల భుజంమీద అనునయంగా రాస్తూ—

ఆమె అతడిని భయంతో అంటుకుపోయింది.

* * *

జాన్సన్ సిగరెట్టు కాలుస్తున్నాడు.

చెట్లు చీకట్లో దయ్యాల్లా తలలు వూపుతున్నాయి.

చెట్లకొమ్మలు ఒకదానికొకటి రాచుకుంటూ భయం

కలిగించే ధ్వనిని చేస్తున్నాయి.

భారత్ కళ్ళముందు ఎర్రటి కాంతులను విరజిమ్ము తున్న అపురూపమణి కనపడుతోంది. అతడిని ఆహ్వానిస్తు న్నట్టుగా వుంది.

హెలికాప్టర్ చెడిపోయినప్పుడు భయపడ్డాడు కాని ఇప్పుడు భయంలేదు. తప్పకుండా విజయం తనదే. టకారా దీవిని తెలుసుకోవటం అంత కష్టం కాకపోవచ్చు.

ఆ దీవి గురించి తెలిసిన మనుషులు సాబూజా దీవిలో వున్నారని ప్రొఫెసర్ అనంత్ చెప్పాడు. అక్కడినించి హెలికాప్టర్‌లో సముద్రంమీద బయల్దేరితే టకారాదీవి కనపడకుండా వుండదు. ఒకసారి ఆ దీవిని చూశాడు కాబట్టి తను దాన్ని సులభంగానే గుర్తుపడతాడు.

ఇక ఆ దీవిలో పాదం మోపిన తర్వాత చీకటిపడగానే కపాలీదేవత విగ్రహం దగ్గరకు వెళ్ళి ఆ మణిని చేజిక్కించుకోవాలి.

అప్పుడే తన ధ్యేయం నెరవేరేది.

ఇలా అతను కళ్ళు మూసుకునే ఆలోచిస్తున్నాడు.

పైలట్‌కు కునుకుపట్టింది.

ప్రొఫెసర్ అనంత్ మనసులో ఎలాంటి ఆలోచనలూ లేవు కాబట్టి అప్పుడే నిద్రలోకి జారిపోయాడు.

లీలకూడా నిద్రపోతూంది.

కళ్ళు తెరిచాడు భారత్. తలతిప్పి లీలను చూశాడు. గాలి పీలుస్తున్నప్పుడు వదులుతున్నప్పుడు ఆమె గుండెలు యెగిరిపడుతున్నాయి.

ఏవేవో ఆలోచనలతోనే నిద్రపోయింది.

కొంచెంసేపటి తర్వాత భారత్ కూడా నిద్రపోయాడు.

జాన్సన్ ఒక్కడే ఆ మనుషులందరిలోనూ మెలకువగా వున్నాడు.

అతనికూడా మత్తుగా వుంది. నిద్ర వస్తున్నట్టుగా అనిపించింది. అంతమంది నిద్రమత్తులో జోగుతున్నప్పుడు అతనొక్కడే మెలకువగా వుండటం కష్టమనిపించింది.

అందుకే అతను హిందీపాటలు పాడటం మొదలు పెట్టాడు. ఒకదాని తర్వాత ఒకటి వరసగా పాడుతున్నాడు చిన్నగా.

కొంచెంసేపు పాడిన తర్వాత అతనికి నిద్రమత్తు ఎగిరి పోయింది. ఒకసారి బండమీద లేచి నిల్చుని చుట్టూ చూశాడు. ఎక్కడా ఏమీ అనుమానించవలసినదిగా అనిపించలేదు.

అతని చేతిలో రివాల్వర్ వుంది. మరో చేతిలో టార్చిలైటు వుంది. టార్చి వెలుతురును చెట్లమీదికి ఫోకస్ చేశాడు.

నల్లటి పండ్లగుత్తులు కనపడ్డాయి. ఆ పండ్లు తాటి పండ్లలా వున్నాయి. అంతకంటే చిన్నవిగా వున్నాయి.

జాన్సన్ మళ్ళీ కూర్చున్నాడు.

కూర్చుని సిగరెట్ వెలిగించుకున్నాడు.

పొగ వదులుతూ ఆకాశంలోకి చూశాడు. నక్షత్రాలు మినుకు మినుకు మంటున్నాయి.

గాలి మరీ వేగంగా వీచటంలేదు. నెమ్మదిగా వీస్తోంది. చెట్లు కూడా బద్ధకంగా కదులుతున్నాయి.

ఏదో ఆలోచిస్తూ సిగరెట్టు పొగ లాగుతున్న అతనికి చెట్లలో ఏదో కదులుతున్నట్టుగా కనిపించింది. వెంటనే టార్చిలైటును ఆ వైపుకు ఫోకస్ చేశాడు. అక్కడ అత

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈనెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క-మాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 6 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాదిపాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల లా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. పూర్తి వివరాలకు పత్రిక చూడండి.

అయితే, ఈ స్కీము అవన ఏజంట్లు వున్న ప్రాంతాలకు వర్తించదు. మీరు హోమ్ డెలివరీ సభ్యత్వము పంపే ముందు మీ వూరిలో మా ఏజంటు లేడనే విషయం నిర్ధారణ చేసుకోండి.

నేడే మీరూ 'హోమ్ డెలివరీ'లో చేరండి!

నికి ఏమీ కనిపించలేదు. ఇంకొంచెం పరీక్షగా చూసిన తర్వాత తెల్లటి కుందేళ్ళు రెండూ ఒకదానిమీద ఒకటి పడుతూ ఆడుకుంటూ కనిపించాయి.

టార్చిని ఆపేశాడు.

మరోసారి ఐనట్లయితే జాన్సన్ ఆ కుందేళ్ళను పట్టుకునే వరకు వూరుకునేవాడు కాదు. కుందేలు మాంసం అంటే అతనికి బాగా ఇష్టం. కాని అప్పుడు వాటిని వదిలేశాడు.

వింజామర వీస్తున్నట్టుగా వీస్తున్న గాలికి అతడికి క్రమంగా నిద్ర ముంచుకువచ్చింది. చిన్నగా కళ్ళు మూతలు పడ్డాయి. కూర్చుని—కూర్చుని నడుము నొప్పిగా వున్నట్లు అనిపించింది.

కేబిన్ కేసి చూశాడు. అంతా గాఢనిద్రలో వున్నారు. తనుకూడా ఓ గంటసేపు నిద్రపోతే? అంతా నిద్రపోతున్నారు కాబట్టి తను నిద్రపోయిన సంగతి యెవ్వరికీ తెలీదు.

జాన్సన్‌కు అప్పుడు ఎర్రతోడేళ్ళ గురించి గుర్తుకు వచ్చింది.

నవ్వుకున్నాడు.

ఇంతమంది మనుషులను చూసి అవి భయపడివుంటాయి. అందువల్లనే ఇంతవరకు రాలేదు. లేకపోతే ఎప్పుడో వచ్చేవి. కాబట్టి ఇక ఆ ఎర్రతోడేళ్ళు రావు. వాటి గురించి ఆలోచిస్తూ తను నిద్రపోకుండా కూర్చోవటం వేస్ట్.

జాన్సన్ ఇలా అనుకుని, రివాల్వర్‌ని, తుపాకిని టార్చి లైటును పక్కనే వుంచుకుని బండమీద వెనక్కి వాలాడు. తలకింద చేతులు వుంచుకుని కళ్ళు మూసు

కున్నాడు.

అలా మూసుకున్న పదినిముషాలు గడవకముందే నిద్ర లోకి జారిపోయాడు. కొంచెం సేపట్లోనే అతను గురక పెట్టడం మొదలుపెట్టాడు.

* * *

నిశ్శబ్దంగా వున్న ఆ ప్రదేశంలో ఎక్కడో గడ్డిమీద బరబరా లాగుతున్న చప్పుడు వుండుండి వినపడుతోంది.

రాను రాను ఆ శబ్దం మరింత దగ్గరయ్యింది.

ఆ బరబర శబ్దానికి సంబంధించిన ప్రాణి కొంచెం సేపటి తర్వాత వెల్లికిలా పడుకుని గుర్రుపెడుతున్న జాన్సన్ దగ్గరకు వచ్చింది.

వచ్చి—ఒకసారి అతడిని ఆప్యాయంగా వళ్ళంతా తడిమింది. అలా తడుముతున్నప్పుడు జాన్సన్ కనీసం ఒక సారి కదలనుకూడా లేదు. విస్కీమత్తు అతడిని కదలనివ్వ లేదు.

అందువల్ల ఆ ప్రాణి చిన్నగా జాన్సన్‌ను చుట్టుకు పోవటం మొదలుపెట్టింది.

ఐనా జాన్సన్ గురక ఆపలేదు. అతడి గుర్రుతోనే స్టెల్లాకు మెలకువ వచ్చింది.

కళ్ళు తెరిచింది స్టెల్లా. వాచీకేసి చూసుకుంది. పన్నెండు గంటలు దాటి ఇరవై నిముషాలయ్యింది. కేబిన్ లో అంతా మంచి నిద్రలో వున్నారు. ఒహుశ అంతా ఎర్రతో దేళ్ళ గురించి మరచిపోయారేమో అనుకుంది.

ఎర్ర తో దేళ్ళ గురించి గుర్తుకు రాగానే ఆమెకు బయట బండమీద కాపలాగా కూర్చున్న జాన్సన్ గుర్తుకు వచ్చాడు. ముందుకువంగి బయటకు చూసింది.

(సశేషం)

